అపరాధ పరిశోధన అనుబంధం—9

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అడవిలో అగచాట్లు!

రచన: ఏ. వీ. మోహన్రావ్

## మంచు మనిషి

రచన: రమణశ్రీ

## మడ్డి వెధవ?

రచన: సుజనశ్రీ

## నడిచే శవం!

రచన: శ్యాంబాబు

"ఖైదీ" సీరియల్ - నాలుగవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 9
సెప్టెంబరు, 1974
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 180 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్

శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
కంచర్ల రమణ
సుజనశ్రీ
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైద్రాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

నేర రంగావళి

# అడవిలో అగచాట్లు!

ఏ. వీ. మోహన్‌రావ్

"ఇదీ నా ప్లాన్! అంతా సవ్యంగా జరిగితే మన ముగ్గురికీ తలకో రెండు లక్షలు లాభ్ చిక్కుతుంది" అన్నాడు సుందర్ సిగరెట్ బట్ ఆష్‌ట్రేలో నొక్కుతూ.

ఆనంద్ స్టూలుపైనుండి కాళ్ళు క్రిందికిదించి నిట్టూర్చాడు. మోహన్ మౌనంగా కిటికీకేసి చూశాడు.

"మీ రిద్దరూ ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు?" అర్థంగాక అడిగాడు సుందర్.

"ఏం లేదు! పెట్టుబడికి పాతిక వేలన్నా కావాల్సి వుంటుంది. నా దగ్గర అంత లేదు. మొత్తం కలిపితే ఏడు వేలుంటుందేమో?" అన్నాడు ఆనంద్.

"నా దగ్గరో ఐదు వేలుంది. అయినా మనకు మరో

పదమూడు వేలన్నా కావాలి!" చెప్పాడు మోహన్.

"మీ రిద్దరూ పేరుమోసిన పిక్‌పాకెట్స్‌గాళ్ళు కదా? అలా రద్దీగావుండే మౌంట్‌రోడ్‌కు పోయి పది పర్సులు కొట్టుకొస్తే చాలు. మన పని జరిగిపోతుంది. ఆ తర్వాత చిల్లర దొంగతనాలు, చిన్న పిక్‌పాకెట్‌లు చెయ్యాల్సిన అవసరం వుండదు!" అన్నాడు సుందర్.

"నీ దగ్గరేం డబ్బులేదా?" ఆనంద్ అడిగాడు.

"లేదు! కాబట్టే మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను. నా ప్లాను నచ్చకున్నా, లేదా డబ్బు తేలేమన్న అనుమానమున్నా మీరు నాతో చేరనవసరంలేదు. మరొకరెవరినన్నా చూసుకోగలను" అన్నాడు సుందర్.

"అందుక్కాదు! ముగ్గురం సమాన లాభాలు పొందబోయేటప్పుడు, పెట్టుబడికూడా సమాన వాటాల్లోవుంటే బాగుంటుందని......" అంటూ మధ్యలోనే ఆపాడు మోహన్.

"కానీ ప్లాన్ నాది. డబ్బు మీది. నా ప్లాన్‌కు వాటా రావాలి. అంతే!" అన్నాడు సుందర్.

హోటల్ బాయ్‌వచ్చి తలుపు తట్టాడు.

సుందర్ వెళ్ళి తలుపు తీశాడు.

ట్రేలో మూడు కప్పుల కాఫీ తెచ్చి టీపాయ్ పైన పెట్టి వెనక్కి వెళ్ళిపోయాడు. ముగ్గురూ మాట్లాడకుండా కాఫీలు త్రాగారు.

"మా కిద్దరికీ రేపు సాయంత్రందాకా టైంకావాలి! అందాకా నువ్విక్కడే వుండు. ఈ లోపల మేము మిగిలిన డబ్బు ప్రోగుచేస్తాం. ఆ తర్వాత మన పథకం ప్రారంభం చేద్దాం!" అన్నాడు ఆనంద్.

"ఉంటాను. కానీ ఈ క్షణంనుండి నా ఖర్చులు

మొత్తం మీరే భరించాలి. అందుకు ఇష్టమేనా?" అడిగాడు సుందర్.

మోహన్ జేబులోంచి రెండు వంద కాగితాలు తీసి సుందర్ చేతిలో పెట్టాడు సమాధానంగా. అతనిదగ్గర సెలవు పుచ్చుకుని ఇద్దరూ వెళ్ళిపోయారు.

గదిలోంచి వాళ్ళు వెళ్ళగానే తలుపులు బిగించాడు సుందర్. బ్రీఫ్ కేస్ తెరచి అందులోంచి విస్కీ తీసి టేబుల్ పైన పెట్టుకొన్నాడు. అంతకుముందు త్రాగుదామని తీశాడు. కానీ ఆనంద్, మోహన్ రావటంతో దాచేశాడు. వాళ్ళు త్రాగితే సీసా ఖాళీ అవుతుందన్న భయంలేదు. కానీ త్రాగిన తర్వాత వ్యాపార విషయాలు మాట్లాడితే అదంత సజావుగా వుండదు. అందుకే వ్యాపారానికీ, మందుకు లంకె పెట్టడు.

గ్లాసునిండా వొంపుకుని, కుర్చీ లీపాయ్ దగ్గరకు లాక్కున్నాడు.

తను వేసిన ప్లాను గుర్తుకొచ్చింది. తలచుకొంటే గర్వంతో కళ్ళు మెరిసిపోసాగాయి. భుజాలు పొంగుతున్నాయి. ఇటు మనుషుల్నీ, అటు చట్టాన్నీ తెలివిగా బోల్తాకొట్టించి ఆరులక్షల రూపాయలు సునాయాసంగా సంపాదించిపెట్టే మాస్టర్ ప్లాన్. అలాంటి ప్లాన్ను ఆలోచించగల తన బుర్రను తనే పదేపదే మెచ్చుకోసాగాడు.

రోజా గుర్తొచ్చింది. ఈపాటికి కలకత్తాలో ఏక్లబ్ లోనో నృత్యంచేస్తూ ఒక్కొక్క గుడ్డవిప్పి ఆడియన్స్ మొహాన పారేస్తూ వుంటుంది. చివరకు నగ్నంగా వాళ్ళ ముందు నిలబడి తన శరీరంలోని వొంపులు, సొంపులు మొత్తం చూపిస్తుంది రోజా. అందుకు వాళ్ళిచ్చేది

పాతిక రూపాయలు. తిండికీ, త్రాగుడికీ, మేకప్ కి చాలదది. దాంతో అప్పుడప్పుడు గదికి ఎవర్నో ఒకర్ని పిలుచుకుపోతుంది.

అలాంటి ఛాన్సు ఒకసారి సుందర్ కు తగిలింది. అప్పటినుంచే ఇద్దరూ ప్రేయసీప్రియు లైపోయారు.

ఆమె జీవన విధానానికి సుందర్ అభ్యంతర పెట్ట లేదు. ఆమె అలవాట్లని మానుకోమని ఆంక్ష పెట్టలేదు. ఆమెకోసమే, ఆమెనా ఊబిలోంచి వెలుపలకి లాగేందుకు సుందర్ కు డబ్బు సంపాదించాలన్న ఆరాటం బయలు దేరింది.

గ్లాసులో విస్కీ పూర్తిగా త్రాగాడు సుందర్. బాత్ రూంలో కెళ్ళి మొహం కడుక్కొని వచ్చి, డ్రెస్ చేసుకొన్నాడు. రూంకు తాళం వేసి హోటల్ లోంచి బయట పడ్డాడు. జేబులో మోహన్ ఇచ్చివెళ్ళిన రెండు వంద నోట్లు వున్నాయో లేదో ఓమారు తడిమి చూసు కున్నాడు.

టాక్సీఎక్కి మౌంట్ రోడ్ జి పి ఒ దగ్గరకొచ్చి ఆగాడు. డబ్బులిచ్చి టాక్సీని పంపి లోనికెళ్ళాడు. జనం రద్దీగా వున్నారు. పగలంతా తీరుబాటులేని జనం, సాయంత్రం జి.పి.ఒ. కొచ్చిగాని ఉత్తరాలు రాయటం, డబ్బు M.O. చేయటం లాంటిది చెయ్యరనిపించిం దతనికి. స్టాంప్స్ కౌంటర్ కు వెళ్ళి ఇన్ లాండ్ కవరు కొనితెచ్చుకొని బెంచీమీద కూర్చుని రోజాకు ఉత్తరం రాయసాగాడు.

రాస్తూ తలపైకెత్తి చూశాడు. యం. ఒ. ల కౌంటర్ ముందు పాము మెలికలు తిరిగిపోతూంది క్యూ. దగ్గరలో సిగరెట్ దమ్ము కొడుతున్న మోహన్ కనిపించాడు.

చూచి నవ్వుతున్నాడు.

ఈ తరం రాసి చివర్లో 'నీ ప్రియమైన సుందర్' అని రాస్తుండగా 'దాంగ్ దాంగ్' అంటూ కేకలు వినిపించాయి.

తలెత్తి చూశాడు సుందర్.

మోహన్ వడిసెల్లో రాయిలా జనం మధ్యనుండి దూసుకుని తనవైపు రావటం గమనించాడు.

సుందర్‌కు కాళ్ళు వణికాయి. అతనెప్పుడూ దాంగ్ తనాలు చెయ్యలేదు. అతను అంతమంది చూస్తుండగా తన్ను పలకరిస్తే, చావు ఖాయమని తెల్పుతుని, కదరు తీసుకుని లేచాడు. అంతలోనే మోహన్ అతని దగ్గర కంటూ వచ్చేశాడు. అతన్ని తరుముకొస్తున్న జనానికీ, అతనికీ మధ్య పట్టుమని పదడుగుల దూరం లేదు.

మోహన్ డాష్ ఇచ్చాడు. దెబ్బతో క్రిందపడ్డాడు సుందర్. కన్నుమూసి తెరచేటంతలో లేచి వెలుపలికి వెళ్ళిపోయాడు. సుందర్ క్రిందపడే వున్నాడు.

"అతన్ని ఘట్టిగా పట్టుకోవాల్సింది!" కామెంటు చేశాడొకడు.

"వాడు ఆరితేరిన పిక్‌పాకెట్! పాపం అతని పర్సు కూడా కొట్టేశాడేమో చూసుకోమనండి!" ఇంకో వ్యక్తి సానుభూతిగా అన్నాడు.

సుందర్ లేచి నిల్చున్నాడు.

"ఇన్సూర్ చేద్దామని తెచ్చాను. రెండు వేలు పోయాయి" డబ్బు పోగొట్టుకున్న వ్యక్తి మొత్తుకున్నాడు.

సుందర్‌కు పరిస్థితి అర్థమయింది. పోలీసులు రావడం, అందర్నీ ప్రశ్నలతో వేధించడంలాంటి తతంగం ప్రారంభమవుతుంది. దానికిముందే తను అక్కడినుండి తప్పు

కోవడం మంచిదనుకుని ముందుకు నడిచాడు. అడ్రసు రాసి పోస్టుబాక్సులో ఉత్తరం పడేశాడు. మొహమంతా చెమట పట్టింది. తుడుచుకుందామని జేబురుమాలుకోసం జేబులో చెయ్యిపెట్టాడు. లావుగా, ఘట్టిగా, కవరులాంటిదేదో చేతికి తగిలింది. కొద్దిగాలాగి చూశాడు. ఇన్సూర్డ్ కవర్ అది. మళ్ళా లోనికి తోసేశాడు.

మోహన్ పైన కోపమొచ్చింది సుందర్ కు. అక్కడింక ఒక్క క్షణం వుండటం మంచిదికాదని గబగబ వెలుపల కొచ్చి టాక్సీ ఎక్కి హోటల్ కు పోనిమ్మన్నాడు. టాక్సీ మౌంట్ రోడ్ ను చీల్చుకుంటూ పరుగెత్తసాగింది.

## 2

లైట్లు ఆరిపోయాయి. సీట్లలో వెనక్కి జేరబడి కూర్చున్న జనం ముందుకు జరిగి కూర్చున్నారు. రంగంమీద తెర తొలగింది. నల్లటి సూట్ లో వున్న వ్యక్తివచ్చి మైక్ ముందు నిలబడ్డాడు. అందరికీ వందనం చేస్తున్నట్లు ఒకమారు తలవంచి పైకెత్తి చెప్పసాగాడు:

“లేడీస్ అండ్ జంటిల్ మెన్! స్వీట్ సిక్స్ టీన్ నైట్ క్వీన్ మిస్ రోజా మరో కొన్ని నిముషాల్లో రంగం మీదకొచ్చి తన అన్ని అంగాల అందచందాలు పొందికగా మీకు చూపిస్తుంది. మీ కంటికీ, వొంటికీ, నరాలకు, ఇదో విందు. ఈ మిస్ ను చూసే అవకాశం మిస్ అయిపోయిన మీ మిత్రులకు రేపే రమ్మని చెప్పండి. ఓ.కే.” అంటూ అతను తొలగిపోయాడు.

మరో రెండు నిముషాలకు రోజా రంగంపైకి వచ్చింది.

డ్రమ్స్ పెద్దగా మ్రోగాయి.

ఆమె ఒక్కొక్కటే బట్టలు విప్పి దూరంగా విసిరేయసాగింది.

అందరూ ఆమెకేసి ఆకలిగొన్న సింహాల్లా చూడ సాగారు.

ఎయిర్ కండిషన్ హాల్లో చల్లదనం మాయమై వేడి పుట్టుకు రాసాగింది.

ఆమె పూర్తిగా వివస్త్రయింది.

ముందు సీట్లో కూర్చునున్న స్టీల్ మాగ్నెట్ సింగా మియా లేచి నిలుచున్నాడు. రోజా గమనించింది. అతన్నే కనిపెట్టుకుని వుంది అంతకుముందునుంచి. స్టేజి ప్రక్కనున్న చెక్క మెట్లెక్కి రాబోయాడు. అలాంటి సంఘటనల కలవాటుపడ్డవాళ్లు కావడంచేత హాలు యజమానులు అక్కడో దుక్కముక్కలాంటి రౌడీని కాపలాపెట్టే వుంచారు.

ఆ రౌడీ సింగామియాను ఆపి "ఆమె కావాలా?" అడిగాడు నవ్వుతూ కోరమీసం మెలేస్తూ.

"ఆఁ!" అన్నాడు సింగామియా.

"ఇటుతిరిగి వెనక్కి వెళ్ళండి. మేకప్ రూంలో వుంటుంది. మాట్లాడండి!" అన్నాడు వాడు.

"థాంక్స్!" అంటూ జేబులోంచి వంద రూపాయల నోట్లకట్ట వెలుపలికిలాగి, దాన్లోంచి ఒకనోటు తీసి ఇచ్చాడు వాడికి. అందుకొని, సలాంచేశాడు.

సింగామియా ఆ రౌడీ చెప్పిన దోవనే వెళ్ళాడు మేకప్ గదిలోకి.

రోజా బ్రాసరీ తొడుక్కుంది. పెట్టీకోట్ బొందు బిగించుకుంటుంటే లోనికొచ్చాడు సింగామియా. ద్వారం ముందే నిలబడి "మే ఐ కమిన్!" అడిగాడు.

"ఎవరు మీరు!"

"చెసోక్క స్టీల్ మిల్ ఓనర్ను. లెక్కలేనన్ని మిల్లు

లవ డైరక్టర్ను!'' ఆ మాటలు చెప్తుంటే అతనిలో గర్వం, డబ్బుగలవాడినన్న ధీమా కొట్టవచ్చినట్లు కనుపించాయి.

''ఏంకావాలి?'' అడిగింది రోజా, జాకిట్ అందు కుంటూ.

''నువ్వూ, నీ అందం!'' అన్నాడు సింగామియా.

''సారీ! నువ్వు కొనలేవు!'' అంటూ బట్టలు కట్టుకోవ డంలో మునిగిపోయింది.

''అంటే!'' అర్థంగాక అడిగాడు.

''ఈ రాత్రికి అమ్ముడయిపోయాను. నన్ను మధ్యా హ్నమే కొనుక్కున్నారు. ఇక్కడ్నుంచి తిన్నగా వాళ్ళదగ్గరకే వెళ్ళాలి. గ్రాండ్ హోటల్లో దిగారు'' అంది రోజా అతన్ని కవ్వించేట్లు ఓరగా చూస్తూ.

''ఎంతకు కొన్నారు?''

''రెండు వేలకు.''

''డబ్బిస్తాను వెళ్ళి నాలుగువేలు వాళ్ళ మొహాన కొట్టిరా?''

''వాళ్ళు మళ్ళా ఆరువేలిచ్చి మీకిచ్చి రమ్మంటే!''

''అంత డబ్బున్న వాళ్ళా!''

''తెలీదు! మద్రాసీలు. స్క్రాప్ మర్చంట్స్మని చెప్పారు. కోట్లమీద వ్యాపారం చేస్తారట'' అంది రోజా.

''ఐ. సీ. ఏం స్క్రాప్ వాళ్లు డీల్ చేసేది!''

''ఐరన్!''

''పోనీ రేపు వీలవుతుందా?'' అడిగాడు సింగా మియా.

''ఓ. కే. రేపయితే ప్రాబ్లమ్ లేదు'' అంది రోజా.

''వాళ్ళెవరో, పేరేమిటో, వాళ్ళ కంపెనీ పేరేమిటో,

ఏమాత్రం సరుకుందో తెలుసుకునిరా. నాకు అవసర ముంది'' అన్నాడు సింగామియా.

"నా బిజినెస్ అదికాదు."

"ఊరకే అడిగి తెలుసుకో. నాకు చెప్పు. అలా చెప్పి నందుకు నీకు ఇంకొంత డబ్బు విడిగా ఇస్తాను'' అన్నాడు.

"అయితే కనుక్కుంటాను'' అంది రోజా.

"రేపు హోటల్ గంగా రూం నెంబరు ఆరువందలా అరవై ఆరులో నీ కోసం ఎదురుచూస్తుంటాను. షో కాగానే వచ్చెయ్యి'' అన్నాడు వెయ్యిరూపాయలుతీసి అందిస్తూ.

"అలాగే!'' అంది.

సింగామియా వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

రోజా బట్టలు పూర్తిగా కట్టుకొంది. హాండ్ బ్యాగ్ పుచ్చుకుని వెలుపలకొచ్చి టాక్సీ ఎక్కి తనరూం అడ్రస్ చెప్పింది. అరగంటలో కాళీఘాట్ చేరుకుంది టాక్సీ. చిన్న పెంకుటిల్లు చూపించి దానిముందాపమంది.

దిగి డబ్బిస్తూంటే డ్రైవరు రోజానే దీక్షగా పరిశీలించ సాగాడు. ఆమె ఏ రకం స్త్రీ అయివుంటుందో అర్థం చేసుకున్నట్లు తలూపుతూ "నీ ఇల్లు ఇదేనా?'' అడిగాడు.

"నీ కెందుకు?'' అడిగింది డబ్బిస్తూ.

డబ్బు అందుకునే ప్రయత్నం చెయ్యకుండానే "బేరాలు కావాలంటే తెద్దామని. ఫిఫ్టీ పర్సెంట్ కమీ షను ఇచ్చేట్లయితే మంచి గిరాకీలు తెస్తాను'' అన్నాడు అతను.

రోజాకు వొళ్ళు కంపరం పుట్టింది. వాడివంక కోపంగా చూసి "నీ సాయం అవసరంలేదు! నోరుమూసుకుని వెళ్ళు!'' అంది డబ్బు విసిరి మొహానకొడ్తూ.

డ్రైవరు అందుకుని గుట్టుగా వెళ్ళి టాక్సీ ఎక్కి స్టార్ట్ చేశాడు. రోజా హాండ్ బ్యాగ్ తీసి అందులోంచి తాళాల గుత్తితీసి, తలుపులకున్న కప్ప తెరచింది. లైటు వెలిగించి ఉత్తరాలేవన్నా వచ్చాయేమోనని ఆత్రుతగా వెతికింది. ఏదీ రాలేదు.

సుందర్ పైన కోపం వచ్చింది. వెళ్ళి వారం దినం లయింది. వెంటనే వుత్తరం రాస్తానన్నాడు. సరిగ్గా రాసుంటే ఈ పాటికి రెండు త్తరాలు వచ్చి వుండాల్సింది. తన్ను మరచిపోయాడేమో ననుకుంది.

అతనే ఎలాగైనా సింగామియాను వల్లో వేసుకో మన్నాడు. అతని ద్వారానే తను పెద్ద మొత్తంలో డబ్బు సంపాదించేందుకు పథకం వేసుకున్నాడు. అందు వల్ల అతను తన్ను మరచిపోయేందుకు అవకాశంలేదు.

సుందర్ విచిత్రమైన మనిషి. డబ్బుకోసం ఎంత నీచానికైనా పాల్పడే రకమని తొలి పరిచయంలోనే రోజాకు అర్థమైంది. అయినా అతన్ని ప్రేమించింది. అందుకు కారణం అతని అందంకాదు. లేమి! తిండికోసం, గుడ్డకోసం, నమ్మకంగా తన్ను నమ్ముకొని పడివుండక తప్పదు అతను.

పరిచయం పెరిగాక, సుందర్ లో వచ్చిన మార్పుల్ని గమనించింది. తన తిండి తినటం, తన డబ్బుతో బట్టలు కొనుక్కోవటం అతనికి కాస్త కష్టమనిపించినట్లుంది. ఎలాగైనా డబ్బు సంపాదించాలన్న తాపత్రయం కనిపిం చాయి. రోజుల తరబడి ఈ పెంకుటింట్లో ఒంటరిగా పడుకుని ఆలోచించి పథకం వేశాడు.

ఒకరోజు సుందర్ తను వేసిన మాస్టర్ ప్లాన్ చెప్పాడు. విని విస్తుపోయింది. అలాంటివి కథల్లో జరుగుతాయేమో

తప్ప, నిజంగా జరగటం అసంభవమనిపించింది. అయినా అతన్ని నిరుత్సాహ పరచడం ఇష్టలేక మౌనంగా వింటూ వుండిపోయింది. అంతా చెప్పి "ఎలావుంది నా ప్లాను!" అడిగాడు గర్వంగా.

"బ్రహ్మాండంగా వుంది!" అంది తను.

"అయితే మనం ప్రారంభిద్దామా పని..."

"అలాగే!" అంది తను.

ఆ తర్వాత నాలుగు రోజులకు మద్రాసుకు బయలుదేరి వెళ్ళాడు. మళ్ళీ అతని దగ్గరనుండి ఉత్తరం రాలేదన్న విషయం గుర్తొచ్చి మళ్ళీ కాస్త నిరుత్సాహం కలిగింది.

"రోజా! రోజా!" అంటూ వీధిలోంచి పిలిచారు.

"ఎవరూ?" అంటూ వెళ్ళి తలుపు తీసింది.

ప్రక్కింటి చటర్జీగారు కనుపించారు. ఆయనకు నలభై సంవత్సరాల వయసుంటుంది. తెలుగు దేశంలో ఉద్యోగం చేసి వచ్చాడు. అందువల్ల తెలుగు బాగా మాట్లాడుతాడు.

"మీరా? ఏమిటి?" అడిగింది రోజా.

"నీకు ఉత్తరం వచ్చిందమ్మాయి. ఎక్స్‌ప్రెస్ డెలివరీ. సంతకం చేయించుకుని గాని ఇవ్వడానికి వీల్లేదన్నాడు. నేనే తీసుకున్నాను" అన్నాడు చటర్జీ.

"థాంక్స్! ఏదీ తెచ్చారా?"

"ఇంట్లో వుంది. నువ్వు వచ్చావో లేదో చూద్దామని వచ్చాను."

"కాస్త త్వరగా పంపిస్తారా? నేను దానికోసమే ఎదురు చూస్తున్నాను."

"అవునవును. చదివితే అర్ధమయింది అది ఎంత ముఖ్యమైన ఉత్తరమో. అలాంటిదానికోసం ఆత్రుతగా ఎదురుచూడటంలో తప్పులేదమ్మా?" అన్నాడు చటర్జీ.

రోజా నమ్మలేకపోయిందా మాటలు.

"మీరు చదివారా?"

"ఆఁ! వద్దనుకుంటూనే ఉబుసుపోవక చదివాను."

"దాంట్లో విషయాలు తెలుసుకోవడం మీ క్షేమాని కంత మంచిదిగాదు. త్వరగా ఉత్తరం తెచ్చి ఇవ్వండి" అంది రోజా.

"నాకలా కనిపించలేదు. అది చదివాక నాకు తమాషా ఐడియా వచ్చింది. నీతో బేరం చేద్దామనుకున్నాను."

"బేరమా? నాతోనా?"

"ఆఁ! నీతోనే! ఉత్తరంలో విషయాలు మరిచిపోయేందుకూ, నీ ఉత్తరం నీ కిచ్చేందుకూ, ప్రతిఫలంగా ఈ రాత్రి నేను నీతో గడపాలి. ఇష్టమేనా?"

కాళ్ళ కాటికి లాగుతుంటే కళ్లు మరో పెళ్ళాన్ని వెతుకుతున్నట్లుంది చటర్జీ వాలకం. ఒక్క క్షణం ఆలోచించింది. చటర్జీ కేసిచూసి "అలాగే! వెళ్ళి ఉత్తరం తీసుకురండి!" అంది రోజా.

చటర్జీ వెళ్ళిపోయాడు. రోజా లోనికొచ్చి ఇల్లంతా వెతికి సుందర్ వదిలి వెళ్ళిపోయిన హాండ్ స్టిక్ తెచ్చి తలుపు వారగా పెట్టింది.

పదినిముషాల తర్వాత తెల్లటి పంచెకట్టి, లాల్చీ వేసుకుని, వాట్నిండా సెంటు పులుముకుని వచ్చాడు చటర్జీ. వస్తూనే జేబులోంచి ఉత్తరంతీసి అందించాడు. దాన్నందుకుని జాకెట్టులో దోపుకుంది రోజా! అతనే తలుపులు మూశాడు. పైకి సింహంలా దూకాడు. తప్పించుకొని తలుపువారకు చేరింది. అక్కడ అంతకుముందే వుంచిన చేతికర్ర తీసుకుని భద్రకాళిలా హుంకరిస్తూ పైకెత్తింది.

చటర్జి చూసి బిక్కచచ్చిపోయాడు. నోట మాట లేకుండా నిలబడ్డాడు.

"వెళ్లు! స్కౌండ్రల్!" తిట్టింది.

మాట్లాడకుండా తలుపు తెరచుకుని వెళ్ళిపోయాడు. వెంటనే తలుపులు మూసి గొళ్ళెంపెట్టి, ఉత్తరంతీసి చదివింది. అందులో పెద్దగా వివరాలు రాయలేదు సుందర్. తను వెళ్ళిన పని అయిందనీ, నాల్రోజుల్లో వస్తున్నాననీ, అప్పటికి తను వలవేసి పట్టుకోమన్న చేపను ఎలాగైనా చేజిక్కించుకోమని రాశాడు.

చటర్జీకి ఉత్తరంలో అర్థమయ్యే విషయాలు ఏవీ లేనందుకు సంతోషపడింది రోజా! కానీ పోలీసులకు రిపోర్టిచ్చి తనపైన అనుమానంగా వుండటంతో వాళ్లు తన వెంట పడతారు. ఎందుకయినా తను మరోక్షణం అక్కడుండటం మంచిది కాదనిపించింది. గబగబ బట్టలు సూట్ కేస్ లో సర్దుకుంది. కిటికీలన్నీ మూసి తలుపులకు గొళ్ళెంబెట్టి తాళం వేసింది.

సూట్ కేస్ తో సహా టాక్సీఎక్కి 'హౌరా' స్టేషనుకు పోనిమ్మంది. దిగి డబ్బిచ్చి స్టేషనులోకి వెళ్ళింది. బండ్ల రాకపోకలు తెలిపే బోర్డుకేసి చూసింది. మరుసటి దినం ఉదయందాకా మద్రాసుకు రైలు లేదు. ఉన్నా ఆమె వెళ్ళదలచుకోలేదు. సింగామియా సంగతి చూడవలసిన అవసర ముండడంతో, సుందర్ కు టెలిగ్రాం ఇచ్చింది, తన్ను హోటల్ పారడైజ్ లో కలుసుకోమని. ఆతర్వాత మరో టాక్సీ ఎక్కి పారడైజ్ కు వెళ్ళి రూం తీసుకుంది. దోవపొడుగునా, చటర్జీ గానీ, పోలీసులుగాని వెంట వస్తున్నారేమోనని చూచుకుంటూనే వుంది. కానీ ఎవ్వరూ వెంటబడకపోవడంతో ధైర్యం కలిగింది.

# 3

సుందర్ నిద్రలేచాడు. కిటికీలోంచి సూర్యకిరణాలు బెడ్ మీద పడుతున్నాయి. లేచి టైం చూసుకున్నాడు పదయింది. గబగబ స్నానంచేసి బట్టలు మార్చుకుని, బెల్ నొక్కి బాయ్‌ని పిలిచాడు. వాడు రాగానే కావలసిన టిఫినుకు ఆర్డరు చేశాడు.

బాయ్‌కోసం ఎదురు చూస్తూండగా, ఆనంద్, మోహన్ ఇద్దరూ లోనికి వచ్చారు.

"ఇప్పుడేనా లేవడం?" అడిగారిద్దరూ ఒక్కమారే కుర్చీల్లో కూర్చుంటూ.

"ఆఁ! మోహన్ నువ్వు దొంగవని తెలుసుగానీ, అంత డేర్ డెవిల్ వనుకోలేదు" అన్నాడు సుందర్.

"జి.పి.ఒ.లో గొడవను గురించా?" అడిగాడు అతను తాపీగా.

"ఆఁ! నువ్వు చేసిన పనికి, నేను జాగ్రత్తగా లేకుంటే, వాళ్ళకు చిక్కిపోయేవాడినే. చావదన్నే వాళ్ళు. అయినా ఆ కవరు నాకివ్వడంలో నీ ఉద్దేశం ఏమిటి?"

"ఏముంది? ఎటూ నీకివ్వవలసిందేగా ఆ డబ్బు. అక్కడే ఇచ్చాను" అన్నాడు అతను.

"నేను చచ్చాను. అది చూడగానే ప్రాణం పైనే పోయింది."

"అది సరే! అందులో ఎంత వుంది?" అడిగాడు ఆనంద్.

"రెండు వేలు!"

"మిగిలిందికూడా మేము సిద్ధంచేశాం. మన ప్లాన్ ప్రారంభం ఎప్పుడు చేద్దాం!" అడిగాడు ఆనంద్.

"నాదేం ఆలస్యం లేదు. ఇక్కడ మనం చేసుకో వలసిన ఏర్పాట్లన్నీ చేసుకుందాం. ఈలోగా నాకు కలకత్తానుండి సమాధానం వస్తుంది. వెంటనే ఆక్షన్ ప్రారంభ మవుతుంది" అన్నాడు సుందర్.

"ఇంపాలా ఎయిర్ కండిషన్డ్ కారొకటి వారం దినాలకు అద్దెకు తీసుకోవాలి. హోటల్ డ్రీమ్‌లాండ్‌లో రెండు కాటేజీలు అద్దెకు తీసుకోవాలి!" చెప్పి ఆగాడు సిగరెట్ ముట్టించుకునేందుకు.

"అవి సులభంగానే ఏర్పాటు చేయవచ్చు. నేనడిగేది వేరే విషయాల గురించి" అన్నాడు ఆనంద్.

"ఈ వూళ్ళోకల్లా ఐరన్‌స్క్రాప్ ఎక్కువున్న కంపెనీ ఏది."

"సౌత్ ఇండియా స్టీల్ కంపెనీ!"

"వాళ్ళ డిపో ఎక్కడుంది?"

"అవడి దగ్గర."

"అక్కడ ఇన్‌చార్జిగా పనిచేసే దెవరో, ఎన్ని టన్నుల స్టాకుందో తెలుసుకోవాలి. అతన్ని చిన్నగా వల్లో వేసుకుని మన ప్లాన్ నచ్చచెప్పాలి. అందుకు ప్రతిఫలంగా అతనికి ఐదువేలు ఇస్తామని చెప్పాలి. అక్కడ మన పని మొత్తం అరగంటసేపు మాత్రమే!" అన్నాడు సుందర్.

"ఓకే! అదంతా నేను కట్టుదిట్టం చేస్తాను" అన్నాడు మోహన్.

"ఈలోగా కలకత్తా నుంచి సమాచారం అందగానే, నేనూ, ఆనంద్ ఇద్దరం విమానంలో వెళ్ళి ప్రోగ్రాం ఫిక్స్ చేసుకొస్తాం!" అన్నాడు సుందర్.

"ప్లానయితే బాగుంది. అంత సులభంగా అవతల మనిషి మనల్ని నమ్ముతాడని నీకు ధైర్యం వుందా?" అడిగాడు మోహన్.

"వుంది గాబట్టే ప్రయత్నాలు చేస్తున్నాను. మీరు డబ్బు తెచ్చారు. దాంతో మీ పనయిపోయింది. ఇక పైన మీరు చెయ్యవలసిందల్లా నే చెప్పినట్టు వినటమే!" అన్నాడు సుందర్.

బాయ్ వచ్చి టిఫిను కాఫీ సర్వ్ చేశాడు. మరో రెండు కాఫీలు తెమ్మని పురమాయించాడు సుందర్. అవికూడా వచ్చాయి. అందరూ త్రాగారు.

అంతలోనే పోస్ట్ మెన్ వెతుక్కుంటూ వచ్చి, టెలిగ్రాం అందించి సంతకం తీసుకున్నాడు. పోస్ట్ మెన్ వెళ్ళిపోయాక చించి చదివాడు.అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"ఎక్కడ్నుంచి టెలిగ్రాం?" అడిగాడు ఆనంద్.

"కలకత్తా నుండి.అక్కడ అన్ని ఏర్పాట్లు పూర్తయినాయి. మనం ఇవాళే వెళ్ళాలి. మనం తిరిగొచ్చేలోగా మోహన్ మిగిలిన ఏర్పాట్లన్నీ చేస్తాడు. ఓ.కే." అన్నాడు సుందర్.

ఆనంద్ మోహన్ కేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"అలాగే చేస్తాను."

"మేము అక్కడ ఎప్పుడు బయలుదేరేది నీకు తెలియ పరుస్తాను. నువ్వు ఇంపాలా తీసుకుని ఎయిర్ పోర్టుకు రా. డ్రీమ్‌లాండ్ లో రెండు రూములు బుక్ చేసి వుంచు. అవడిలో ఆ డిపో ఇన్ ఛార్జితో అన్ని వ్యవహారాలు తేల్చి వుంచుకో. ఒక మంచి పార్టీ ఇవ్వాల్సి వుంటుంది. ఆ వచ్చే వ్యక్తి ఒక రాత్రికిక్కడ వుండదలనుకుంటే

మంచి అందమైన అమ్మాయిని మనం అతనికి సరఫరా చెయ్యాలి. అదిగూడా చూసి వుంచు'' అన్నాడు సుందర్, అతని చేతికి ఐదు వేల రూపాయలు లెఖ్ఖపెట్టి ఇస్తూ.

''అలాగే!''డబ్బు అందుకుంటూ చెప్పాడు మోహన్.

సుందర్ ఫోనందుకుని ఇండియన్ ఎయిర్ లైన్స్ బుకింగ్ ఆఫీసుతో మాట్లాడాడు. సాయంత్రం ఆరు గంటలకు కలకత్తా పోయేందుకు విమానం వుందని చెప్పారు వాళ్ళు. ఫోన్ పెట్టేసి ''ఆనంద్! మనం మౌంట్ రోడ్ వెళ్ళి రెండు టిక్కెట్లు బుక్ చేద్దాం. మోహన్ తన పని మొదలు పెడతాడు.'' అన్నాడు. వెంటనే బట్టలు మార్చుకుని సిద్ధమైనాడు'' తలుపులు మూసి తాళం వేసి అందరూ వెలుపలికొచ్చారు.

టాక్సీ ఎక్కారు ముగ్గురూ.

రివ్వుమని దూసుకుపోయింది మౌంట్ రోడ్ వైపు.

మోహన్ మిగిలిన ఇద్దరిదగ్గర శెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

ఆనంద్, సుందర్ ఎయిర్ లైన్స్ ఆఫీసులోని కెళ్ళారు. టిక్కెట్లు కొనుక్కున్నారు. పేర్లు మార్చుకున్నారు. సిల్క్ పాలెస్ లోనికెళ్ళి ఖరీదైన రెండు సూట్లుకొన్నారు. ఒక వి. ఐ. పి.సూట్ కేస్ కూడా ఖరీదు చేశారు.

మళ్ళా హోటల్ కు వెళ్ళేందుకు టాక్సీ కుదుర్చుకున్నారు.

''కలకత్తానుండి వచ్చిన పేపర్ లో చివర్న రోజా అని వుందే! ఎవరామె?'' అడిగాడు ఆనంద్. అతనికి ఆడవాళ్ళంటే పెద్ద వీక్ నెస్ వుంది.

''ఆమె నా భార్య'' చెప్పాడు సుందర్.

"ఏం చేస్తూంటుంది."

"అందరు ఆడవాళ్ళలాగే నాతో కాపురం చేస్తుంటుంది. నా పనుల్లో సాయం చేస్తుంది."

"నీ మాస్టర్ ప్లాన్ ఆమెకు తెలుసా?"

"తెలుసు. దీని వెనుకనున్న బ్రెయిన్ చాలామటుకు ఆమెదే!"

"అందంగా వుంటుందా?"

ఆ ప్రశ్నతో రక్తం వడిగా ప్రవహించింది సుందర్ శరీరంలో.

"మన స్నేహితం వ్యాపారరీత్యా మాత్రమే! నా భార్య అందచందాలు, వివరాలు నీ కనవసరం!" అన్నాడు కోపంగా సుందర్.

ఆనంద్ తను అతని భార్యను గురించి ప్రస్తావించడం నచ్చలేదని అర్థంచేసుకున్నాడు. కానీ ఆ పేరులోనే ఒక రకమైన మత్తు, అందం అతనికి కనుపించాయి. ఆమెను చూసే అవకాశంకోసం తొందరపడసాగాడు.

తిరిగొచ్చాక ఇద్దరూ మౌనంగానే వుండిపోయారు. భోజనాలు ముగించి కాసేపు రెస్ట్ తీసుకున్నారు. నాలు గంటల ప్రాంతంలో గది ఖాళీ చేస్తున్నామని చెప్పి బిల్ తెప్పించుకుని డబ్బిచ్చి పంపారు.

ఐదింటికల్లా మీనంబాకం విమానాశ్రయంలో అడుగు పెట్టారు. సెక్యూరిటీ చెక్ ముగిసేసరికి మరో ముప్పావు గంట పట్టింది. విమానంవచ్చి ఆగింది. అందరూ ఎక్కారు. ఆనంద్ కు విమానం ఎక్కడం అదే మొదటిసారి. సుందర్ అంతకుముందో రెండుసార్లు ప్రయాణం చేశాడు.

ఆరింటికల్లా తలుపులు మూతపడ్డాయి. వెంటనే రన్ వే మీద విమానం పరుగెత్తసాగింది.

ఎనిమిదిన్నరకల్లా విమానం డమ్‌డమ్ విమానాశ్రయంలో దిగింది. సుందర్ ఆనంద్ ఇద్దరూ దిగి టాక్సీ ఎక్కి "పారడైజ్ హోటల్‌కు పోనీ!" అన్నారు.

కలకత్తా వీధులకేసి చూస్తూ మౌనంగా కూర్చున్నాడు ఆనంద్. వున్నట్టుండి "మీ ఇంటికి వెళ్ళనవసరంలేదా?" అడిగాడు.

"ఎందుకు?"

"మీ ఆవిడను కలుసుకునేందుకు."

"ఆమెను చూసేందుకే వెళుతున్నది."

"హోటల్‌లో బసచేసిందా?"

"ఆఁ! మన ప్లాన్ నెరవేరేదాకా నేను హోటల్‌లో వుండమని చెప్పాను" అన్నాడు సుందర్.

టాక్సీ హోటల్ కాంపౌండ్‌లోకి దూరింది.

రిసెప్షన్ కౌంటర్ ముందు నిలబడ్డాడు సుందర్.

"సారీసార్! నో వేకెన్సీస్!" అన్నాడు కౌంటర్‌లో వున్న వ్యక్తి.

"మద్రాసునుండి వచ్చాం! సింగిల్ రూమయినా ఫరవాలేదు!"

"ఏదేలేవు సార్! ట్రిబుల్ రూంవుంటే ఒకమ్మాయి రెండ్రోజులక్రితం రాత్రిపూటవచ్చి బలవంతంచేసి తీసుకొంది" అన్నాడతను.

"ఆమెనడుగు మనుష్యుల్నిద్దరినీ మరో రూం ఖాళీ అయ్యేదాకా అకామిడేట్ చేస్తుందేమో?" అన్నాడు సుందర్.

"సారీ! ఒంటరిగా వుందామె! నేనెలా అడిగేది? మీరే వెళ్ళి ట్రై చెయ్యండి. రూం నెంబరు అరవై రెండులో వుంది" అన్నాడతను.

ఆనంద్‌ను అక్కడే వుండమని, సుందర్ లోని

కెళ్ళాడు.

మెల్లగా వెతుక్కుంటూ అరవై రెండో నెంబరు గది వద్ద కెళ్ళాడు. తలుపులు మూసివున్నాయి. కిటికీలకున్న కర్టెన్లుకూడా బిగించి వుంచారు. లోపలెవరుందీ ఏం చేస్తున్నదీ చూసేందుకు వీలుకాలేదు సుందర్ కు.

తలుపు ప్రక్కనేవున్న బజ్జర్ నొక్కాడు.

రెండు నిమిషాల తర్వాత గుమ్మం తలుపులు తెరుచు కున్నాయి. వాటిమధ్యనుండో బట్టతల వెలుపలకు తొంగి చూసింది. సుందర్ అతనికేసి చూశాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి. విస్కీ వాసన గుప్పుమని కొట్టింది.

"ఎవరు కావాలి?" అడిగాడతను.

"ఈ గదిలో వున్న అమ్మాయికోసం వచ్చాను" అన్నాడు సుందర్ తొణక్కుండా.

"అమ్మాయా? ఎవరూ లేరే! నా వైఫ్ వుంది."

"అబద్ధం చెప్పి లాభంలేదు! ఆమే నన్ను రమ్మంది. మర్యాదగా వెళ్ళి చెప్పు. లేకంటే పోలీసులకు రిపోర్టు చేస్తాను. సింగామియా యిలా ఎవరో అమ్మాయిలతో హోటల్ లో కలుసుకుంటున్నాడని పేపర్లలో వేయిస్తాను!" అన్నాడు సుందర్ తొణక్కుండా.

ఆగంతకుడు తలుపు పైనున్న చెయ్యి తీసేసాడు.

"నన్నెలా తెలుసు నీకు!" అడిగాడు సింగామియా.

"నిన్నే కాదు! నీతో వున్న అమ్మాయిని కూడా తెలుసు!"

"నువ్వెవరు?"

"సుందరేశన్, సదరన్ స్టీల్ కార్పొరేషను నాదే! నీ ఫోటో చాలా సార్లు పేపర్లో చూశాను" అన్నాడు సుందర్.

"లోపలకు రా!" అన్నాడు సింగామియా త్రోవ వదులూ. సుందర్ అతన్ని అనుసరించాడు.

బెడ్ పైన నగ్నంగా పడుకొనున్న రోజా సుందర్‌ను చూడగానే కన్నుకొట్టింది.

"రోజా! అతన్ని రమ్మని చెప్పి, నన్ను రప్పించావెందుకు?" అడిగాడు సింగామియా.

"మీ హోటల్‌కు వస్తానంటే మీరే వద్దన్నారు. అందుకని రమ్మన్నాను. ఇతనేమో నిన్న వచ్చి వెళ్లాడు. ఈ దినం వీలుకాదన్నాను. వినకుండా వచ్చాడు" సర్ది చెప్పింది.

"మీ ఆనందానికి అడ్డం రాదలచుకోలేదు! మీతో నాకు పనుంది" అన్నాడు సుందర్.

"చెప్పు!" సిగరెట్ ముట్టించుకుంటూ అన్నాడు.

"లక్షల టన్నులకొద్దీ స్క్రాప్ ఐరన్ జపాన్‌కు ఎక్స్‌పోర్టు చేసేందుకు మీరు ఆర్డరు సంపాదించినట్లు తెలిసింది. మా దగ్గర ఐదు లక్షల టన్నుల స్టాకుంది. నేను ఆర్డరు కోసం ప్రయత్నం చేశాను. చిక్కలేదు."

"అయితే!"

"మా సరుకు కూడా మీరే తీసుకోవాలి!"

"నా దగ్గర కావలసినంత వుంది. పైగా డబ్బుకూడా లేదు. రెండు నెలలు ఆగగలిగితే తీసుకుంటాను."

"అలాగే! కానీ స్టాకు వాగన్‌లలోకేసి డాకుమెంట్లు బ్యాంకు ద్వారా పంపుతాను. దానివల్ల తొంభై శాతం డబ్బు బ్యాంకు ఇస్తుంది. మీరు విడిపించుకున్నాకే మిగిలింది తీసుకుంటాను" అన్నాడు సుందరేశన్‌గా చలామణీ అవుతూన్న సుందర్.

"అందుకు నా కభ్యంతరం లేదు! కానీ మీ దగ్గరున్న

స్టాను నేను చూడాలి!" అన్నాడు సింగామియా.

"చూపిస్తాను. నాతో మద్రాసుకు వస్తారా?"

"వస్తాను. రేపు ఉదయం విమానంలో పోదాం! మళ్ళా తిరిగి సాయంత్రం వస్తాను" అన్నాడు సింగామియా.

"ఓ యస్! అయితే రేపే మనం వెళ్ళేందుకు టిక్కెట్లు బుక్ చేస్తాను" అన్నాడు సుందర్.

"అవసరం లేదు. నా స్వంత విమానం వుంది. అందులో వెళ్దాం. రోజా! నువ్వుగూడా వస్తావా? సరదాగా వెళ్ళొద్దాం!" అన్నాడు సింగామియా.

"వస్తాను. నా కూడా మద్రాసు చూడాలని వుంది" అంది రోజా.

"గుడ్! మొత్తం ముగ్గురమన్నమాట!"

"లేదు! నా ఫ్రెండ్ కూడా ఒకతనున్నాడు. నలుగురం వెళ్దాం. మీకేం అభ్యంతరం లేదుగా?" అడిగాడు సుందర్.

"నాకేం అభ్యంతరం లేదు. మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. వెళ్ళండి" అన్నాడు సింగామియా.

"వస్తాను. వచ్చినపని కాకున్నా అసలు పనయింది" అన్నాడు సుందర్ సెలవు తీసుకుంటూ.

## 4

సింగామియా అతన్ని వెలుపలికి పంపి తలుపు గొళ్ళెం పెట్టి మంచంమీద రోజా పక్కన కూర్చున్నాడు.

"మీకు స్వంత విమానం వుందా?" అడిగింది రోజా ఆశ్చర్యంగా.

"ఉంది!" అన్నాడు మళ్ళీ విస్కీ గ్లాసు అందుకుంటూ.

"వీళ్ళకు మరెవ్వరూ దొరకలేదు కాబోలు. మీ వెంట పడ్డారు" అంది రోజా తనపైన ఏ విధమైన అనుమానం అతనికి రాకుండా వుండాలన్న ఉద్దేశ్యంతో.

"దొరక్క కాదు! నన్ను దొరకబుచ్చుకునేందుకు. డబ్బున్న ప్రతివాడూ ఒక బాధకున్న నమ్మకం ఇలాంటి బెధకలకుంటుంది. ఇన్నేళ్ళుగా ఈ వ్యాపారంలో వున్న నాకు మద్రాసులో వున్న కంపెనీలు, వాటి ఓనర్లు, వాటి వ్యాపారపద్ధతులు తెలీకని, ఏదో రకంగా బుట్టలో వేసుకొని, నానుంచి డబ్బు గుంజాదామని వాళ్ళ ఐడియా. వీళ్ళేదో గ్యాంగుకు సంబంధించిన మనుషుల్లా వున్నారు" అన్నాడు సింగామియా.

రోజా ఊపిరి ఆగిపోయింది. కత్తితో ఎవరో గుండెల్లో పొడిచి నట్లనిపించింది. ఇంత సులభంగానే సుందర్ అసలు రూపం కనిపెట్టిన సింగామియా ఏం చెయ్యదలచుకున్నాడో ఆమెకు అనూహ్యంగా వుంది. అతనికున్న డబ్బు, పలుకుబడి, హోదాతో నిలువునా చంపి, గొయ్యితీసి పాతిపెట్టినా అడిగేవాళ్ళుండరన్న విషయం ఆమెకు అవగాహనకొచ్చింది.

సింగామియా చెయ్యి రోజాపైన వేశాడు. చల్లగా తగిలింది. అంతకుముందుదాకా నిప్పులు గ్రక్కుతున్నట్లున్న ఆమె వొంట్లో అంత చల్లదనం ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు.

"ఎమిటలా డల్‌గా వున్నావు?" అడిగాడు సింగామియా.

"ఏం లేదు! వాళ్ళ గురించి మీరు చెపుతుంటే భయం పుట్టింది. డబ్బు కోసం ఏమైనా చేసేవాళ్ళలా వున్నా రన్నప్పట్నించీ నాకు భయంగా వుంది. రేపు

మీతో నేను రాను!'' అంది రోజా.

"నీకేం భయంలేదు. వాళ్ళను ఉక్కు బంధాల్లో ఇరికించేందుకు అన్ని ఏర్పాట్లు చేస్తాను. నాతో రా! నువ్వంటే నాకు చచ్చేంత మోజుగా వుంది. విమానం నీకిచ్చేస్తాను. మంచి బంగళా కొనిపెడతాను. డబ్బిస్తాను. నీకేం కావాలన్నా క్షణాల్లో అమరుస్తాను. నాతో వుండు'' అన్నాడు సింగామియా ఆమెను బలంగా తన కౌగిట్లోకి లాక్కుంటూ.

"ఉంటాను. కానీ రేపు మాత్రం నన్ను వాళ్ళతో రమ్మని పిలవద్దు!'' అంది రోజా తన అసలు రూపం అతను అర్థం చేసుకుని, వాళ్ళకు చేసే శాస్తి, తనకూ చేస్తాడన్న భయంలో.

"నిన్నొదిలిపెట్టి క్షణం కూడా వుండను. నువ్వు వెంబడుంటే నాకు ధైర్యంగా వుంటుంది. వాళ్ళనెలా ఏడిపిస్తానో చూద్దువుగాని రా!'' అన్నాడు.

అతనితో వాదించి లాభంలేదని రోజా చివరకు "సరే! అలాగే వస్తా!''నంది.

ఆ తర్వాత అలా గంటసేపు ఆమెకు ఊపిరాడనివ్వలేదు సింగామియా. అలసిపోయి మంచంపైన వాలిపోయాడు.

రోజాకు ఎటూ పాలుపోలేదు. సుందర్‌ను కలుసుకుని వాళ్ళ నిజరూపాల్ని అతను తెలుసుకున్నాడనీ, మళ్ళీ అతని ఛాయలకు రాకుండా వెళ్ళిపొమ్మని హెచ్చరిద్దామనుకుంది. అందుకు సుందర్ ఎక్కడ దిగిందీ చెప్పలేదు. ఫోన్ చేసి కౌంటర్‌ను పిలిచి అడుగుదామనుకుంది. సింగామియా తను వాళ్ళ తాలూకు మనిషని గ్రహిస్తాడేమోనని భయం పుట్టి, జరగవలసిందేదో జరుగుతుందన్న నిర్ణయాని

కొచ్చి, తనూ మంచంపైన వాలిపోయింది.

తిరిగి మళ్ళా వొళ్లు తెలిసేసరికి గదంతా పగటి వెలుగుతో తెల్లగా మెరిసిపోతూంది. ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతూన్న సింగామియా మాటలు వినిపించాయి. కదలకుండా అలాగే పడుకుని ఆలకించసాగింది. అతను సంభాషణ ముగించి, మంచం వద్దకొచ్చి "గంట తొమ్మిదయింది. మరో గంటలో మనం మద్రాసుకు బయలుదేరుతున్నాం. వెళ్ళి స్నానం చేసిరా డ్రెస్ చేసుకుందువుగాని!" అన్నాడు

రోజా లేచి వొళ్ళు విరుచుకుంటూంటే విస్తుపోయి చూడసాగాడు.

బాత్‌రూం తలుపు మూసుకుని బోల్ట్ వేసుకుంది. గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి తను విన్నది తలచుకుంటే.

మద్రాసులో సదరన్ స్టీల్ కంపెనీతో మాట్లాడి తన దగ్గరకొచ్చిన ముఠా సంగతి చెప్పి, వాళ్ళను తీసుకుని విమానంలో వస్తున్నాననీ, వాళ్ళను అరెస్టు చేసేందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లు చేసి సిద్ధంగా వుంచమనీ చెప్పాడు సింగామియా. ఆ తర్వాత ఆఫీసుకు ఫోన్ చేసి విమానంలో వెంటవచ్చేందుకిద్దరు ఉక్కు కడ్డీలాంటి మనుషుల్ని అవసరమైతే పదిమందితో పోరాడగలిగే వాళ్ళను ఎయిర్‌పోర్టుకు పంపమన్నాడు. సుందర్ జీవితాంతం కమ్ములు లెఖపెట్టడం ఖాయమని నిర్ణయాని కొచ్చింది రోజా. అలాంటి వానితో ఈ పరిస్థితుల్లో అనుబంధం త్రెంచుకోవడం, తనకు క్షేమమన్న విషయం అర్థమైంది. అతనేమయినా తను బాధపడకూడదనుకొంది. అతన్ని తెలియనట్లే ప్రవర్తించదలచుకొంది.

స్నానంచేసి వెలుపలికొచ్చేసరికి, సింగామియా రివాల్వరు తుడుస్తూ కూర్చున్నాడు. వ్రేలెడంత పొడవుంది. ఫినిషింగ్‌నుబట్టి అది ఏదో విదేశీ తయారై వుండాలనుకొంది.

"కానీ త్వరగా డ్రస్ చేసుకో!" మందు గుండు నింపుతూ హెచ్చరించాడు.

"రివాల్వరు ఎందుకు?"

"నా డబ్బునుండి నన్ను నేను కాపాడుకునేందుకు. ఇది ఎప్పుడూ నాతో వుంటుంది."

"ఎవరన్నా మిమ్మల్ని చంపుతారని భయంగా వుందా?"

"భయంకాదు! అనుమానం."

"అయినా వాళ్లు మిమ్మల్ని చంపుతారనుకోను. మీ డబ్బు కావలసినవాళ్లు అలాంటి పని చేస్తారా?"

"ఇంత పెద్ద పథకం వేసినవాళ్లు ఎంతకయినా తెగించే వుంటారు" అన్నాడు సింగామియా.

"ఎందుకనో నా కలాగనిపించడంలేదు! వాళ్ళ దగ్గర స్టాక్ లేకుంటే రేపు మీ కేం చూపిస్తారు? ఆ తర్వాత ఏం పంపుతారు? బ్యాంకు వాళ్ళ దగ్గర డబ్బెలా తీసుకొంటారు? మీరే ఏదో పొరబడి వుండాలనిపిస్తోంది." అంది రోజా.

"మద్రాసులోనే పెరిగాను నేను. వాళ్లు చెప్పే కంపెనీలోనే కూలీగా చేరి మేనేజర్నయినాను. ఇప్పుడు దాని ఓనరయిన సుందరేశన్‌ను నేను పెంచాను. వాళ్ళ దగ్గరున్న స్టాకంతా ఎప్పుడో కొనేశాను. ఇన్ని తెలిసి కూడా వాళ్ళను అనుమానించటం తప్పంటావా?" అడిగాడు సింగామియా.

రోజాకు మరి నోట మాటరాలేదు.

సుందర్ తనతో ఈ ప్లాను గురించి చాలాసార్లు చర్చించాడు. అతను చెప్పేది విన్నప్పుడు ఎంత సులభంగా మనిషి డబ్బు సంపాదించగలడో అర్థమయింది. అప్పుడప్పుడూ తనకూడా కొన్ని ఉచిత సలహాలిచ్చింది. చాలా బాగున్నాయన్నాడు సుందర్.

అంత గొప్పగా, కట్టుదిట్టంగా, ఊహించి వేసిన ప్లాను పేకమేడల్లా తన కళ్ళముందే కూలిపోతుంటే ఆమెకు వింతగాను, విచిత్రంగాను, భయంగాను, అనిపించసాగింది.

గబగబ బట్టలు మార్చుకుంది. గ్రే కలర్ సారీ కట్టుకుని, అదే రంగు జాకెట్ తొడుక్కుంది. లావుపాటి కొప్పు వచ్చేలా హెయిర్ స్టయిల్ మార్చుకుంది. నుదుట చిన్న తిలకం బొట్టు పెట్టింది. సాండిల్స్ తొడుక్కుని, హాండ్ బాగ్ అందుకొంది.

"రోజా!" టై కట్టుకుంటూ పిలిచాడు సింగామియా.

వెళ్ళి దగ్గరగా నిలబడింది.

"ఇది నీ దగ్గర వుంచు. నాకు వాళ్ళవల్ల ప్రమాదముందని ఊహించిన మరుక్షణం దీనితో నీకు ఇష్టమైనంతమందిని చీల్చి చంపు. ఏం భయంలేదు. ఆ తర్వాత గొడవలన్నీ నేను చూసుకుంటాను. సరేనా?" అడిగాడు సింగామియా.

"నాకు భయమండీ!"

"నేనున్నాగా? ధయిర్యంగా కాల్చు!"

కాల్చమంటే తన్ను కూడా అనుమానిస్తాడేమో నన్న ఊహతో "అలాగే!" అంది. రివాల్వరు అందుకొని బ్యాగ్ లోకి తోసింది.

బ్రాండ్ కేస్ చేత్తో పట్టుకుని సింగామియా ముందు గది దాటాడు. ఆ తర్వాత రోజా వచ్చింది. తలుపులకు తాళం వేసి, కీ రింగు కోటులో వేసుకున్నాడు.

"మీ వెంట రావడం ఎవరన్నా చూస్తే బాగుండదేమో?" అంది రోజా.

ఆ మాటలు వినిపించుకోకుండానే ఎలివేటరువేపు నడిచాడు సింగామియా. ఇంక అతన్ని తప్పించుకోవాలనుకుని లాభంలేదని రోజాకూడా వెంట నడిచింది.

కౌంటర్‌లో తాళాలిచ్చి పోర్టికోలోకి వచ్చారు.

విమానంలాంటి పొడవుపాటి లేటెస్ట్ మోడల్ ఫోర్డు కారు ఆగివుంది. తెల్లటి యూనిఫాంలో వున్న చప్రాసీ వంగి సలాం చేశాడు. సింగామియా డోర్ తెరచి రోజాను ఎక్కమన్నాడు. ఆమె ఎక్కి ఒక మూలగా వొదిగి కూర్చుంది. అతనుకూడా తలుపు మూశాడు.

లోపలంతా చల్లగా వుంది. మల్లెపూల మత్తెక్కించే వాసన వస్తూంది.

"కారు ఎ. సీ యా?"

"అఁ! మన విమానం కూడా ఏ. సి. చేసిందే!" అన్నాడు సింగామియా.

కారు మెత్తగా, వేగంగా కలకత్తా వీధుల్లోని వాహనాల్ని ఈదుకుంటూ పోసాగింది. ఎంత పెద్ద గతుకులోపడ్డా వొళ్లు కదలడంలేదు. రోజాకు స్వర్గం మబ్బులమీద ఎక్కి ప్రయాణం సాగిస్తున్నట్లుతోచింది.

"మీ ఫ్యామిలీ ఈ వూళ్ళోనే వుందా?" అడిగింది పక్కన.

"నా కెవ్వరూ లేరు! ఒంటరిగాణ్ణి!" అన్నాడు సింగామియా.

అంత డబ్బున్న మనిషికి సంసారంలాంటి దేదీ లేక పోవడం అసహజంగానూ, విచిత్రంగానూ తోచింది. ఆ సంభాషణ కొనసాగించడం ఇష్టంలేక అంతటితో ఆ పేసి విండోగుండా వెలుపలకు చూడసాగింది రోజా.

కారు ఎయిర్ పోర్టు చేరింది.

సింగామియా దిగగానే ఉక్కు దుక్కుల్లాంటి ఇద్దరు మనుషులు వచ్చి నిలబడ్డారు.

"అంతా సరిగ్గా వుందా?" అడిగాడు గంభీరంగా.

వాళ్లు సమాధానంగా తలూపారు.

సింగామియా వెంట రోజా నడిచింది.

సుందర్ ఆనంద్ ఎదురొచ్చారు.

సింగామియాకు ఆనంద్ ను పరిచయం చేశాడు. రోజా వాళ్ళిద్దర్నీ తనకు తెలీనట్లే సన్ గాగుల్స్ లోంచి ఎయిర్ పోర్టు సర్వే చేయసాగింది. ఆమె మనస్సునిండా సుందర్ కు జరగబోయే ప్రమాదం గురించే ఆలోచనలున్నాయి.

"మనం ప్లేన్ వద్ద కెళ్దాం!" అన్నాడు సింగామియా.

అందరూ అతన్ని అనుసరించారు. ఒక చిన్న 'డకోటా' దగ్గర ఆగారు. ముచ్చటగా వుంది ప్లేన్. లోనికెక్కారు. మొత్తం 12 సీట్లున్నాయి. నాలుగు సీట్లు విడిగా వున్నాయి. వాటి చుట్టూ కవరింగు వుంది. సింగామియా రోజా ఇద్దరూ ఆ చిన్న కాబిన్ లోకి వెళ్ళారు. మిగిలిన వాళ్ళంతా తమతమ సీట్లలో సర్దుకున్నారు. విమానం బయలుదేరింది.

## 5

"వాళ్ళిద్దరూ జీవితంలో ఇలాంటి ప్లేన్ ఎక్కి వుంటారనుకోను!" అన్నాడు సింగామియా, రోజాను చేత్తో అదుముతూ.

"వాళ్ళ సంగతి నాకు తెలియదుగానీ, నావరకు నేను విమానం ఎక్కడం ఇదే మొదటిసారి" అంది రోజా.

"ఎలా వుంది?"

"వండర్ ఫుల్ గా వుంది!"

"నాతో వుంటావా?"

"ఆఁ! అంతకన్నా ఈ జీవితానికి మరో మంచిదారి ఏముంటుంది?"

"గుడ్! అలావుండాలి" అన్నాడు సింగామియా.

విమానం జోరుగా పోతూంది. అందరూ మౌనంగా కూర్చున్నారు. సుందర్ కు హుషారుగావుంది. ఆనంద్ కు ఆనందం పట్టపగ్గాలు లేకుండా వుంది. డబ్బు వుండటంలో గల గొప్ప సింగామియాను చూడగానే అతనికి అర్థమయింది.

గంట సేపయింది విమానం బయలుదేరి.

"ఆరొందల కిలోమీటర్ల దూరం వచ్చాం. అంటే దాదాపు విశాఖపట్నం ప్రాంతంలో వున్నాం!" అన్నాడు సింగామియా.

ప్రక్కనున్న ఫోన్ బజర్ మ్రోగింది. రిసీవరు తీసుకొని "హల్లో!" అన్నాడు.

"బాస్! మనం దారితప్పినట్లున్నాం!" అన్నాడు పైలట్.

"వాట్! నాన్సెన్స్! నిజంగానా!" అడిగాడు.

"అవును బాస్! విశాఖపట్నం ఎయిరోడ్రోంను కాంటాక్టు చెయ్యలేకపోతున్నాను. ఏయాంగిల్ లో పోతున్నదీ కూడా తెలియటం లేదు. ఆ ఇండికేటర్ చెడిపోయినట్లుంది. దానివల్లే దారితప్పాను" అన్నాడు మళ్ళా.

"గాస్ నిండా వుందా?"

"వుంది!"

"ఎన్ని కిలోమీటర్లు పోగలం!"

"రెండు వేలు!"

"అయితే పోనీ, మధ్యలో ఏదైనా ఎయిరోడ్రాం దొరుకుతుందా చూడు. కాంటాక్టు చిక్కగానే దిగే సెయ్. అరథమయిందా?" అడిగాడు సింగామియా.

"అరథమయింది బాస్!" అన్నాడు అవతలవేపునుండి పైలట్.

సింగామియా ఫోన్ క్రింద పెట్టాడు. మనస్సు చెడిపోయింది. చాలా పెద్ద ప్రమాదంలో తను చిక్కుకు పోయినట్లు తెలుసుకున్నాడు.

రోజాకు పరిసితి పూరిగా అరథంగాకున్నా, చూచాయగా కొంత తెలిసింది. బెంబేలుపడిపోయింది.

"ఏమయిందట?" అడిగింది మెల్లగా.

"ఏంలేదు! విమానం దారి తప్పింది. ఎటు పోతూందో తెలియటంలేదు."

"ప్రమాదమా!"

"ప్లేన్‌లోవున్న గ్యాస్ అయిపోయేలోగా ఎక్కడైనా దిగిపోవాలి! లేకుంటే అందరం గాల్లోనే మారీమంటాం!"

"అంతేనా?" అంటూ భోరుమని ఏడ్చింది. క్షణం ముందు కన్న రంగుల కలలన్నీ చెదిరిపోయాయి. ఇప్పుడు ప్రాణాలు నిలుపుకోవడమెలాగానన్న ఆలోచన మాత్రమే మిగిలింది.

"ఈ సంగతి అందరికీ చెప్దామా?"

"వద్దు!"

"ఏం!"

"భయపడి గల్లంతుపడతారు. మన పైలట్ చాలా తెలివిగలవాడు. ఇంతకన్నా గడ్డు సమస్యల్ని ధైర్యంతో ఎదుర్కొన్నాడు. నన్ను చాలాసార్లు కాపాడాడు. అతనే ఏదో ఒకదారి చూస్తాడు. నువ్వు నిర్భయంగా వుండు. చావే తప్పదనుకుంటే ముందు నేను ఛస్తాను. ఆ తర్వాతే నువ్వు" అన్నాడు సింగామియా.

అతని మాటలతో రోజాకు కొంత ధైర్యం కలిగింది.

మరో అరగంట గడిచింది.

సింగామియా ఫోనో రెండు నిమిషాలు పైలట్‌తో మాట్లాడాడు. రోజావేపు తిరిగి "ఇంకా అతనికి సరైన రూటు చిక్కలేదుట!" అన్నాడు.

మాట్లాడకుండా కూర్చుంది రోజా.

సింగామియా సిగరెట్ వెలిగించుకొని లేచాడు. కాక్‌పిట్ వైపుకు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన రెండు నిముషాలకు సుందర్ కాబిన్ ద్వారం దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

"అతను ఎందుకు వెళ్ళాడు?"

"తెలీదు!" అంది రోజా.

"మన ప్లాన్ గురించి ఏమన్నా పసిగట్టాడా?"

"మనం అంటే... ఎవరు? నువ్వెవ్వరు? ఎందుకిలా వచ్చావ్?" అడిగింది రోజా.

"అప్పుడే నన్ను మరచిపోయావా? గాలానికి గుచ్చి ఎరలా వేశాను నిన్ను చేపను పట్టుకోనేందుకు. నువ్వు గాలాన్ని వదిలి చేపనోట్లో దూరావా?" అడిగాడు అక్కసుతో సుందర్.

"అనవసరంగా మాట్లాడకు! నోర్మూసుకుని వెళ్ళి కూర్చో" అంది ధైర్యంగా.

ఆ మాటనగానే అతని వెనుకనున్న ఇద్దరూవచ్చి

సుందర్‌ని పట్టుకుని లాక్కుపోయారు. కాబిన్‌లోంచి గమనించి చూడసాగింది. అతని వెంటవున్న ఆనంద్ ఏదో సర్ది చెప్పాడు. దాంతో అక్కడ సద్దు మణిగింది.

మరో అరగంట గడిచింది. కాక్‌పిట్ వైపునుండి తూలుతూ వచ్చాడు సింగామియా.

"డియర్ ఫ్రెండ్స్! మనం పెద్ద ఆపదలో చిక్కుకున్నాం. మన పైలట్ దారితప్పాడు. మరేదారిని పట్టుకోలేకపోయాడు. మరో పదిహేను నిముషాల్లో మన విమానంలోవున్న గ్యాస్ అయిపోతుంది. వెంటనే అది ధామ్మని కూలిపోతుంది. మీమీ శక్తియుక్తుల్ని అనుసరించి మీమీ ప్రాణాలు పోగొట్టుకోకుండా తప్పించుకునేందుకు దారులు వెతుక్కోండి!" అన్నాడు సింగామియా.

అందరూ అప్రతిభులై లేచి నిలుచున్నారు.

"కావాలని మమ్మల్ని ఆపదలో పడేశావ్!" అన్నాడు సుందర్.

"షటప్! మీ ఇద్దరూ అదృష్టవంతులు. మిమ్మల్ని శ్రీకృష్ణ జన్మస్థానంలో జీవితాంతం పడేసేందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లు చేశాను. ఈ ప్రమాదం ముంచుకొచ్చి కనీసం చచ్చేందుకన్నా అవకాశం కల్పించినవాణ్ణయినాను. మీ అసలు బ్రతుకు నాకు తెలుసు. మీ ప్లాన్లు నాకు తెలుసు" అన్నాడు సింగామియా.

ఆనంద్ సుందర్‌కేసి కోపంగా చూశాడు.

సుందర్ తలదించుకున్నాడు.

"మనం ఎవ్వరం బహుశా బ్రతకం. మనం సముద్ర మట్టానికి ఆరువేల అడుగుల ఎత్తునున్నాం. అక్కడ్నుంచి విమానం కూలిపోవడమంటే మొత్తం పొడిపొడిగా

మారటమే! చేసిన తప్పులకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం ప్రకటించుకోండి. భగవంతుణ్ణి తలచుకోండి! చావుకు సన్నద్ధులు కండి!'' అంటూ కాబిన్ లోకి వచ్చాడు.

అతని మాటలన్నీ విన్న రోజా ఏడుస్తూ అతనిపైన పడింది.

సింగామియా ఆమెను లాలించాడు. ధైర్యం చెప్పాడు. చచ్చేందుకు కావలసిన ఆత్మస్థయిర్యం చేకూర్చుకోనేందుకు కలసిన చేయూత నందించాడు.

ఎర్రలైటు వెలిగింది.

విమానం రయ్యిమని కూలిపోసాగింది. సెకండుకు వందల అడుగుల చొప్పున క్రిందకి, తోక తెగిన చుక్కలా రివ్వుమని గాలిని చీల్చుకుంటూ, చీకటిని కోసుకుంటూ రాలిపోసాగింది.

అందరూ గుడ్లు తేలవేశారు.

చెవులు చిల్లులు పడేట్లు భీకరమైన శబ్దం వినిపించింది. ఆ తర్వాత ఏం జరిగిందీ ఎవ్వరికీ తెలీలేదు.

# 6

వీపులోంచి రక్తం కారుతున్నట్లు దేంతోనే కోస్తున్నట్లు అనిపించింది రోజాకు. కళ్ళు తెరచే ప్రయత్నం చేసింది. కానీ రెప్పలు విడివడలేదు. బలవంతంగా బరువునంతా భుజాలపై తోసి పెల్లికింతలా తిరిగింది.

సూర్యుడి వేడికిరణాలు రెప్పలకి తగిలి మండాయి. కళ్లు తెరచుకున్నాయి. చూసింది రోజా. ఆకాశం, అందులో కణకణ మండుతున్న ఎండగుండా కనుపించినా చూడలేని తెల్లటి సూర్యబింబం.

మెల్లగా లేచి కూచుంది. పది గజాల దూరంలో విమానం ముక్కముక్కలయి కనుపించింది. తనో పెద్ద

కొండరాయిపైన పడుంది. చుట్టూ ఎటుచూసినా పెద్ద పెద్ద చెట్లు కనిపించాయి. వందల అడుగుల లోతున లోయలున్నాయి. మోచేతికిపైన కుడిచెయ్యి తెగి రక్తం కారుతూంది. చీరతో తుడుచుకుంది. మెల్లగా కాళ్ళలోకి శక్తి తెచ్చుకొని లేచి అటూ ఇటూ చూసింది. విమానం చుట్టు, అందులో ప్రయాణించిన వాళ్ళు పడున్నారు. పైలట్ కాలిపోయి నల్లటి తారులా మాడిపోయాడు.

సుందర్, ఆనంద్ ప్రక్క ప్రక్కనే పడివున్నారు. వాళ్ళ చేతుల్ని తీసుకొని చూసింది. నాడి కొట్టుకుంటున్నట్లనిపించింది. సింగామియా బోరగింతలా పడివున్నాడు. వెళ్ళి అతన్ని వెల్లకిలా త్రిప్పింది. నుదుటపైన పెద్ద గాయమై రక్తం కారుతూంది. స్పృహ లేకుండా పడి వున్నాడు. అతని అనుచరులిద్దరూ విమానం ఫ్రేములో ఇరుక్కుపోయి చచ్చారు.

ఎక్కడైనా నీళ్ళు దొరుకుతాయేమోనని చుట్టూ చూసింది. కనుచూపు మేరలో ఎక్కడా ఏమీ కనుపించ లేదు.

దూరంగా పడివున్న బాండ్ కేస్ దగ్గర కెళ్ళి చూసింది. అది ఆమెకు బాగా గుర్తే! దాన్ని సింగామియా తీసుకొచ్చాడు. తెరచి చూసింది. అందులో బ్రాందీ బాటిల్స్, సిగరెట్ పెట్టెలు, అగ్గిపెట్టెలు కొంత కరెన్సీ వున్నాయి. ఒక బాటిల్ ఓపెన్ చేసి, ముగ్గురి మొహాలపైన కొద్దికొద్దిగా చిలకరించింది. మిగిలింది తను త్రాగింది.

ముగ్గురూ గాఢనిద్రలోంచి మేలుకొన్నట్లుగా లేచి కూర్చున్నారు. జరిగిన ఘోరం చూడగానే మతులు పోయాయి.

సింగామియా కుడికాలు పైకెత్తలేక పోయాడు. అల్యూమినియం ముక్కేదో అతని కాలి కండరంలో దూరినట్లుందని చెప్పాడు.

"ఇదేం ప్రాంతం?" సుందర్ అడిగాడు.

"నాకేం తెలుసు?" అంది రోజా.

"నీకు తెలుసా?" సింగామియాను చూసి అదే ప్రశ్న వేశాడు.

"తెలీదు!"

"మమ్మల్నేదో చెయ్యాలనుకున్నావ్! ఇప్పుడు చూశావా? లేచి కూర్చోలేకున్నావ్?" అన్నాడు సుందర్ అవహేళనగా.

సింగామియా మాట్లాడకుండా తలవంచుకున్నాడు. ఆనంద్ కాళ్లు చేతులు సర్దుకుని మెల్లగా లేచి వొళ్ళు విరుచుకున్నాడు.

రోజా బాండ్ కేస్ చూసి పట్టుకుంది వాళ్ళకు కాస్త దూరంలో.

"ఈ అడవిలో అన్నిరకాల మృగాలున్నట్లున్నాయి. నీ పెట్టెలో రివాల్వరు ఏదైనా వుందా?" అడిగాడు ఆనంద్.

"లేదు!" అంది రోజా.

"ఏముంది దానిలో?"

"డబ్బు, బ్రాందీ సీసాలు" చెప్పింది రోజా.

"సరేలే. వెళ్దాం పద మనం" అన్నాడు సుందర్.

"ఎక్కడికి?"

"నడిస్తేగానీ తెలీదు. ఇక్కడుంటే ఇంకో రోజులో ఛస్తాం. ముందుకుపోతే బ్రతికే అవకాశం దొరకొచ్చుగా?"

"నన్నుకూడా తీసుకుపోండి!" అన్నాడు సింగా మియా.

"నో! నీ సంగతి మాకు అవసరంలేదు. మమ్మల్ని జైల్లో పెట్టాలనుకున్నావ్. అలాంటి నిన్ను రక్షించడం మహాపాపం. నువ్వు ఇక్కడే ఏ క్రూరమృగం వాతనో పడి చావాలి! రోజా! రా! వెళ్దాం!" అన్నాడు సుందర్.

"అది అన్యాయం! అతన్ని ఆపదల్లో వదిలేసి వెళ్ళడం తప్పు. అతన్ని మనతో తీసుకుపోదాం! బ్రతికినా చచ్చినా ఒకటిగానే..." అంది రోజా.

"వీల్లేదు! అతన్ని నమ్ముకుని వుండదలచుకుంటే వుండిపో. మేము వెళ్తాం!" అన్నాడు ఆనంద్.

సింగామియా భయంగా అందరికేసి చూశాడు. రోజా అతనికేసి చూసింది. ఆమె కళ్ళల్లోకి దీనంగా చూశాడు. ఆమె గుండె ద్రవించింది. మెల్లగా వచ్చి అతనిప్రక్కన కూర్చుంది.

"నీకేం భయంలేదు! నేనున్నాను. చచ్చినా నీతో నే ఛస్తాను" అంది రోజా.

"రోజా! నువ్వు... నువ్వు... దేవతవు!" అన్నాడు కళ్ళు చెమర్చుకుంటూ.

సుందర్, ఆనంద్ ముందుకు కదిలారు.

రోజా సుందర్‌ను పిలిచింది.

"ఏం కావాలి?" అడిగాడు సుందర్.

"డబ్బుకోసం ఎంత నీచానికైనా పాల్పడగలవు నువ్వు. నన్నూ, సింగామియాను సురక్షితంగా ఏదైనా ఊరు చేర్చు. నీ సంగతి పట్టించుకోవడం మానేస్తాం! అందుకు ప్రతిఫలంగా పాతికవేలు అడ్వాన్సుగా ఇస్తాను. ఊరు చేరాక రెండు లక్షలిస్తాను" అంది రోజా.

"అఖర్లేదు!" అన్నాడు సుందర్.

"అలా కాదు! తన ఆస్తిలో సగం రాసిస్తాడేమో అడుగు. అతన్ని మోసుకొని పోతాను" అన్నాడు ఆనంద్.

"ఇస్తాను" అన్నాడు సింగామియా.

సుందర్, ఆనంద్‌ను వారించాడు. కానీ ఆనంద్ వినకుండా వెనక్కి వచ్చాడు. రోజా, ఆనంద్ కలసి సింగామియాను లేవదీశారు. అతను రెండు చేతుల్నూ ఇద్దరి భుజాలపైన వేసి కుంటుకుంటూ నడవసాగాడు.

వాళ్ళున్నది ఎత్తైన పెద్ద బండలాంటి కొండ. అక్కడ్నుంచి క్రిందికి దిగేందుకు సరైన మార్గంలేదు. కొండల్ని ఎక్కాలన్న ప్రయత్నంతో వచ్చేవాళ్ళ దగ్గరయితే రకరకాల పనిముట్లు ఉంటాయి. ప్రమాదంలో చిక్కుకుని అక్కడ చిక్కుకున్న వాళ్ళుకావటంవల్ల, ఏ విధమైన పనిముట్లు వాళ్ళ దగ్గరలేవు. కొండ భాగం ఒకవైపు చక్కగా చెక్కినట్లు నున్నగావుంది. దాదాపు ముప్ఫయి అడుగుల క్రిందకు దిగితే కాస్త భూమి కనిపిస్తుంది. అక్కడ్నుంచి దూకితే కాళ్ళు విరుగుతాయి.

సుందర్ అక్కడే నిలుచుని చాలాసేపు చూశాడు. దూకుదామని రెండు మూడుసార్లు ప్రయత్నించాడు. కానీ కాళ్ళు రెండుగా విరుగుతాయన్న భయంతో ఆ ప్రయత్నాన్ని మానుకున్నాడు.

అంతలోనే ఆనంద్, రోజా, సింగామియా అక్కడకు జేరారు.

"ఏం? ఇక్కడ ఆగావేం?" అడిగింది రోజా.

ముప్ఫయి అడుగుల క్రిందున్న నేలను చూపించాడు సమాధానంగా.

"దూకలేకపోయావా?" అడిగింది కోపంగా.

సుందర్ సమాధానం చెప్పకుండా నిలుచున్నాడు.

సింగామియా, ఆనంద్ కొన్ని క్షణాలు తర్జన భర్జన చేశారు. కానీ ఏ విధమైన మార్గము తోచలేదు.

"ఒక పనిచేస్తే" అన్నాడు ఆనంద్.

"ఏమిటీ?" అడిగింది రోజా.

"నీ చీర దాదాపు ఐదున్నర మీటర్లుంది. అంటే దాదాపు పదిహేడు అడుగులుందన్నమాట. దాన్ని రాయికి కడదాం ఒక్కొక్కరం దాన్ని ఆధారంగా జారిపోదాం. పోతే పదమూడు అడుగులు మాత్రమే మిగులుంది. అది దూకేయచ్చు. పెద్దగా దెబ్బలు తగలక పోవచ్చు. ఆ పట్టు వదిలేప్పుడు ఒంట్లోవున్న బరువంతా భుజాల్లోకి తెచ్చుకోగలిగితే చాలు" అన్నాడు.

"వండర్‌ఫుల్. నీ ఐడియా బావుంది!" అన్నాడు సుందర్.

"నీ కనవసరం!" కోపంగా అన్నాడు ఆనంద్.

వెంటనే రోజా చీర విప్పేసింది. ఆనంద్ దాన్ని రాయికి కట్టాడు. ముందు ఆనంద్, తర్వాత సింగామియా, ఆపైన రోజా జారారు. క్రిందకు దూకిన ఆనంద్, సింగామియా రోజా చీరపట్టు వదలగానే నేలమీద పడకుండా తమ చేతుల్తో పట్టుకున్నారు. ఆఖరున సుందర్ కూడా దాని సాయంతోనే దిగాడు.

నలుగురూ అడవిలో పడ్డారు.

కీచురాళ్ళు రొదచేస్తున్నాయి. సరైన దోవేది కనుపించలేదు. గ్రుడ్డి ఎద్దుల్లా నడిక సాగించారు. అందరికీ నాలుక పిడచకట్టుకుపోతూంది. తాగేందుకు నీళ్ళుగానీ, తినేందుకు తిండిగానీ కనుపించలేదు. చెట్లకేసి చూశారు,

అన్నీ చేదు మొక్కలు, ముళ్ళపొదలు. నాలుగైదు మైళ్ళు నడిచారు.

సింగామియా కాలునొప్పి ఎక్కువగా వుందన్నాడు. ఆనంద్ కాసేపు విశ్రాంతి తీసుకుందామని సూచించాడు. రోజా సరేనంటూ చతికిలపడిందో చెట్టు మొదట్లో.

బాండ్ కేస్ లోంచి బ్రాందీబాటిల్ తీసి తను కాస్త తాగి, కాస్త సింగామియాను త్రాగమంది. సింగామియా కొద్దిగా త్రాగి ఆనంద్ కిచ్చాడు. ఆనంద్ బాటిల్ ఖాళీ చేశాడు. దానికేసి ఆత్రంగా చూడసాగాడు సుందర్. అతనికి దాహం ఎక్కువగావుంది.

"రోజా!" పిలిచాడు సింగామియా.

"ఏమిటి?" అడిగింది.

"అతనికూడా కాస్త ఇవ్వు!" అన్నాడు.

"వద్దులెండి!" అంది కోపంగా.

"తప్పు! మనమంతా చావు బ్రతుకుల మధ్య కొట్టుకుంటున్నాం. మనలాగే అతనికీ దాహం వుండివుంటుంది. బహుశా అడిగేందుకు జంకుతున్నాడు. కాస్త ఇవ్వు రోజా!" అన్నాడు సింగామియా.

ఇంకో బాటిల్ తీసి సుందర్ కిచ్చి కొద్దిగా త్రాగి మిగిలింది ఇవ్వమని చెప్పింది. సుందర్ సగం బాటిల్ ఖాళీచేసి మిగిలింది ఇచ్చాడు.

సింగామియా బాండ్ కేస్ పైన తలపెట్టుకుని పడుకున్నాడు.

విపరీతమైన చలి పుట్టుకురాసాగింది. వొణికిపోవడం మొదలెట్టాడు. ఆనంద్ సింగామియా వొళ్ళు చూశాడు. కాలిపోతున్నట్లుంది.

"బాగా జ్వరం తగిలింది రోజా!" అన్నాడు.

"ఆ గాయాలు నొప్పిచేసి వుంటాయి" అంది రోజా.

"ఛస్తారేమో! ఆ స్తీ మునకన్నా రానీ పారెయ్యమను" అన్నాడు సుందర్.

"నోర్ముయ్యి! ఇరవైనాలుగు గంటలూ డబ్బుతప్ప మరో ధ్యాసలేదు నీకు. రాని స్తే మాత్రం ఏంచేస్తావ్. నువ్వు మాత్రం ఈ దారి తెలియని అడవిలోంచి ఏ పులి నోట్లోనో పడకుండా క్షేమంగా బయటపడగలవని గ్యారంటీ వుందా!" అంది రోజా కోపంగా.

ఆనంద్ నోటువిప్పి కష్పాడు సింగామియాకు.

రోజా సిగరెట్ అంటించి, అతని నోట్లో పెట్టి రెండు దమ్ములు లాగమంది. సింగామియా బలవంతంగా సిగరెట్ త్రాగాడు. దగ్గొచ్చింది. లాభంలేదని సిగరెట్ పారేశాడు.

"మన విమానం కూలిపోయిన విషయం ప్రభుత్వానికి తెలిసి వుంటుంది. మనకోసం బహుశా వాళ్ళు వెతుకుతూ వుండవచ్చు. మనం అక్కడే వుండి వుండవలసింది" అన్నాడు ఆనంద్.

"లాభంలేదు! కలకత్తా వదలగా మన విమానానికి కంట్రోలుతో కనెక్షను పోయింది. ఎటుపోయి వుంటుందో ఊహించడం సాధ్యంకాదు వాళ్ళకు. మెల్లగా మనమే ఈ అడవినుంచి బైటపడాలి!" అన్నాడు సుందర్, అతన్ని వాళ్లు అభిప్రాయం అడగకున్నా.

## 7

సింగామియాకు వొణుకు తగ్గింది. మెల్లగా నిద్రలోకి జారాడు. అతన్ని ఆనుకుని రోజా పడుకుంది. తనరూపం తనకే విచిత్రంగావుంది. చీర కాస్తాపోయింది. పెట్టీకోట్ మాత్రం మిగిలింది. జాకెట్ వేసుకునుంది. తలంతా రేగిపోయివుంది.

"రోజా!" పిలిచాడు ఆనంద్.

"ఏమిటి?"

"నేను అలా వెళ్ళి తినేందుకేమయినా పండ్లలాంటివి ఏవన్నా దొరుకుతాయేమో చూస్తాను. నువ్వు అతన్ని కనిపెట్టుకుని వుంటావా?" అడిగాడు.

"ఊఁ!" అంది.

ఆనంద్ లేచి, సుందర్‌ని వెంటరమ్మన్నాడు. తన కాకలిగా లేదని రానన్నాడు. ఆనంద్ వెళ్ళిపోయాడు. అతను కనుమరుగు కాగానే సుందర్ లేచి రోజాదగ్గర కొచ్చి కూర్చున్నాడు.

"ఏం మళ్ళీ దగ్గరకొచ్చావ్?" అడిగింది రోజా.

"ఆ వెధవ వాడిచావు వాడు చస్తాడు. నువ్వురా. మనిద్దరం వెళ్ళిపోదాం" అన్నాడు.

"మళ్ళా ఆ మాటన్నావంటే కాల్చిపారేస్తాను" అంది రోజా.

"నువ్వు రాకుంటే నీ ఖర్మ! ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములువాడి అన్న విషయం అర్ధమయ్యేట్లు చేశావ్. సంతోషమే! కనీసం ఆ బ్రాండ్ కేస్ పడెయ్యి. నా తోవన నేను వెళ్ళిపోతాను" అన్నాడు సుందర్.

"ఇవ్వను" అంది రోజా.

"మర్యాదగా ఇస్తేసరే! లేకుంటే బలవంతంగానైనా పీక్కుపోతాను" అన్నాడు సుందర్.

"నువ్వు మనిషివికాదు!"

"అది ఋజువుచేద్దామనే నా బాధంతా!" అంటూ సింగామియా తలక్రిందున్న బ్రాండ్ కేస్ పైన చెయ్యి వేశాడు.

"మర్యాదగా చెయ్యితియ్! లేకుంటే ఏం చేస్తానో

నాకే తెలీదు!'' అంది రోజా.

"నువ్వేం చేస్తావో నాకు తెలుసు. అలవాటు ప్రకారం మిగిలిన బట్టలుకూడా విప్పి డాన్స్ చేస్తావ్! అంతే!'' అంటూ కేస్ బలంగా లాగాడు. అది అతని చేతుల్లోకి వచ్చింది. సింగామియాకు మెలకువొచ్చింది. జరిగింది తెలుసుకో నేందుకు ఎక్కువసేపు పట్టలేదు. లేచి కూర్చున్నాడు.

తన హ్యాండ్ బ్యాగ్ పోయినందుకు బాధపడింది రోజా! అదే వుండివుంటే సుందర్ని రివాల్వరులో కాల్చి చంపివుండేది.

"సుందర్! ఆ కేస్ ఇలా ఇవ్వు!'' అన్నాడు కోపంగా కూర్చునే.

"ఇవ్వను'' అన్నాడు సుందర్.

"మర్యాదగా చెప్తున్నాను ఇచ్చెయ్యి. లేకుంటే...'' అంటూ చెయ్యి పాంటుజేబులో పెట్టాడు.

"ఏంచేస్తావ్ రా పందీ! నన్నూ ఆనంద్ను జైల్లో తోద్దామనుకున్నావు! అందుకే నీకీ శిక్ష!'' అన్నాడు ముందుకు కదుల్తూ.

"చేతులెత్తు!'' అరిచాడు సింగామియా.

సుందర్ వెనక్కి తిరిగి చూశాడు.

చిన్న రివాల్వరు సింగామియా చేతుల్ని అలంకరించింది.

"అందులో గుండ్లున్నాయా!'' అనుమానంగా అడుగుతూ చేతులు పైకెత్తి నిలుచున్నాడు.

"అనుమానంగా వుందా?'' అంటూ గాల్లోకి పేల్చాడు రివాల్వరు సింగామియా.

బ్రాండ్ కేస్ విసిరి పడేశాడు. అదొచ్చి రోజాదగ్గర

పడింది. వెనకనుంచి వచ్చిన ఆనంద్ జరుగుతున్న గొడవ చూసి తిన్నగా సుందర్ దగ్గరకొచ్చి చాచి లెంపకాయ కొట్టాడు. తల దిమ్మదిరిగి క్రిందపడ్డాడు సుందర్.

"నువ్వటు వెళ్ళగానే అతను చేసిందిది!" అంది రోజా.

"ఫరవాలేదు! నేను టెమ్ప్టు వచ్చాను. ఒక ఫర్లాంగు దూరంలో చిన్న నీళ్ళగుంట వుంది. చాలా మడ్డిగా వున్నాయి నీళ్లు. అయినా త్రాగవచ్చు, ఫరవాలేదు. నేను కాస్త త్రాగాను. బాగానే వున్నాయి" అన్నాడు ఆనంద్.

"అయితే వెళ్దాం!" అంది రోజా. అంతా ఆనంద్‌ను అనుసరించారు. సుందర్‌ను ఎవ్వరూ పట్టించుకోలేదు. అయినా వాళ్ళవెంట నడవడం మొదలెట్టాడు. చెట్లను, తీగల్ను తప్పుకొంటూ నడిచారు. పదడుగుల వ్యాసంలో వున్న చిన్న నీళ్ళగుంట కనుపించింది.

అందరూ అక్కడ మొఖాలు కడుక్కుని, కడుపు నిండా నీళ్లు త్రాగారు. పోయిన ప్రాణాలు సగం లేచి వచ్చినట్లయింది. వచ్చి గట్టుమీదవున్న పెద్ద టేకు చెట్టు క్రింద కూర్చున్నారు.

"తినేందుకేమీ దొరక్కేటట్లు లేదు!" అంది రోజా.

"టెస్టి చేశాను. ఏ విధమైన పండ్లచెట్లూ లేవు. అన్నీ టేకు చెట్లే!" అన్నాడు.

"అయితే మనం మధ్య ప్రదేశ్ అడవుల్లో వుండి వుండాలి. దేశంలోవున్న అన్ని అడవుల్లోకీ, అక్కడే టేకు చెట్లు అధికంగా వున్నాయి" అన్నాడు సింగామియా.

"అయితే ఈ అడవుల్లో నేకదూ బందిపోటు దొంగలు విపరీతంగా తిరిగేది!" అంది రోజా భయంగా.

"అవును! తలలు ఊచకోతకోసే దుర్మార్గులుండే దిక్కదే!" అన్నాడు సింగామియా.

సుందర్‌కు పై ఊపిరి పైనేపోయింది. అబద్దాలు చెప్పి, మనుషుల్ని మోసంచేసి డబ్బు సంపాదించడం అతని వృత్తి. అతనికి దొంగలు, హంతకులు, హత్యలులాంటి వంటే చచ్చేంత భయం.

"అనవసరంగా చంపుతారా?"

"ఆఁ!"

"మనదగ్గరేమీ లేదుగా! ఎందుకు చంపుతారు?"

"ఏమిలేనందుకే! ఏమన్నావుంటే తీసుకుని, తమ రహస్యాలు పోలీసులకు చెపుతారేమోనని చంపేస్తారు" అన్నాడు సింగామియా.

"అంటే చావు ఎటూ తప్పదన్నమాట."

"వాళ్ళ కళ్ళల్లో పడితే అంతే!" అన్నాడు సింగామియా.

# 8

అందరికీ ఆకలి ఎక్కువయింది. ప్రేగులు అరుస్తున్నాయి. ఒకర్నొకరు అలవయితే తినేట్లుగా వున్నారు.

"మనం ఇక్కడ ఇలా కూర్చుని లాభంలేదు. ముందుకు పోదాం! బ్రతికి బైటపడే మార్గమేదన్నా కనిపించవచ్చు" అన్నాడు ఆనంద్.

"అలాగే! నడుద్దాం పదండి!" అన్నాడు.

రోజా లేచింది. రెక్కపట్టుకుని సింగామియాని లేపింది. ఆనంద్ రెండో రెక్క తన భుజంపైన వేసుకొన్నాడు. ఇద్దరి భుజాలపైన బరువువేసి ఈడ్చుకుంటూ నడవటం మొదలెట్టాడు సింగామియా.

ఒక మైలు నడిచారు. ఆ బాటంతా ముళ్ళమయం.

అందులో కుడివేపు పెద్ద లోయ. ఎడంవైపు ఎత్తైన కొండ. ఏ మాత్రం కాలుజారినా ఎముకలు పిండయి పోతాయి అక్కడినుంచి లోయలో పడితే. అలాగే నడిచారు అందరూ. త్రోవలో తినేందుకు పనికొచ్చే వస్తువేది కంటబడలేదు ఎవ్వరికీ.

లోయలోంచి దూరంగా తెల్లటి పొగ ఆకాశంలోకి వుండలు చుట్టుకుంటూ పైకిలేవడం కనిపించింది రోజాకు. అది సింగామియాకు చూపించింది. అతనుకూడా తదేకంగా చూచి "అవును. మనమెలాగైనా అక్కడకు చేరాలి! అక్కడేదో గూడెం వున్నట్లుంది. మనుషులున్నారు గాబట్టే అలా పొగవస్తూంది" అన్నాడు.

"కానీ అక్కడకు ఎలా వెళ్ళాలి? మనం లోయపైనున్నాం. ముందు ఇక్కడ్నుంచి దిగి లోనికెళ్ళాలి. అక్కడికెళ్ళాక మనకు ఆ గూడెం ఏవైపు వున్నదీ కనుపించదు. అందువల్ల బహుశా ఆ ప్రాంతానికి చేరడం కష్టమేమో?" అన్నాడు సింగామియా తనే మళ్ళీ.

"అలాని ప్రయత్నం మానేస్తామా! మెల్లగా వెళ్దాం! చావు కానీ, బ్రతుకుగానీ ముందు మనం మనుషుల్లో పడాలి!" అన్నాడు ఆనంద్.

"అది రైటన్నమాట!" వంతపలికాడు సుందర్. "కానీ వాళ్లు బందిపోటు దొంగలైతే త్వరగానే మనల్ని స్వర్గానికి పంపుతారు."

అతని మాటల్ని ముగ్గురూ వినన ట్లే ముందుకు నడవసాగారు.

ఆనంద్ కీ అనుభవం వింతగావుంది. రోజాకు భయంగా, సింగామియాకు ప్రాణాంతకంగా తయారైంది.

మెల్లగా తీగలు పట్టుకుంటూ, చెట్లవేళ్ళను ఆధారం

చేరుకుంటూ ఒక్కొక్క అడుగే క్రిందికి దిగసాగారు లోయలోకి. ఆ లోయ దాదాపు వెయ్యి అడుగుల లోతున వుంది. వాళ్ళ వెనుకగా సుందర్ దిగుతున్నాడు. అతని కెలాగైనా బాండ్ కేస్ కొట్టెయ్యాలన్న కోరికగావుంది. అందులో లక్షరూపాయలకు తక్కువుండదని తెలుసు. అది చేజిక్కించుకొని, చిన్నగా ఈ అడవిలోంచి బైట పడితే, కాలుమీద కాలేసుకుని దర్జాగా కూర్చుని బ్రతకొచ్చునన్న ఆశ ఎక్కువకాసాగింది. కానీ సింగామియా జేబులోనున్న రివాల్వరు అతన్ని ప్రయత్న విముఖుణ్ణి చేసింది.

దూరంగా ఎక్కడో పులి గాండ్రింపులు వినిపించాయి.అందరూ ప్రాణువులై కదలకుండా నిలబడ్డారు.

"దగ్గర్లో ఎక్కడో పులి వున్నట్లుంది. అరుస్తూంది. విన్నారా?" అడిగాడు ఆనంద్.

"ఆఁ! అది పులి అరుపులాగా వుంది" అన్నాడు సింగామియా.

"దానికి నరవాసన తెలుస్తుందటగా?" భయంగా అడిగింది రోజా.

"మనం నలుగురమున్నాం దాన్ని చంపలేమా!" సుందర్ అడిగాడు.

"ముందు నువ్వెళ్ళి దాంతో యుద్ధం చెయ్యి? ఆ తర్వాత మేము సాయం వస్తాం!" వ్యంగ్యంగా చెప్పాడు ఆనంద్.

పులిగాండ్రింపులు బాగా దగ్గరకాసాగాయి.

అందరి ముఖాల్లోనూ భయం క్రమ్ముకొచ్చింది.

"అదుగో ఆ చెట్టెక్కితే మనమంతా!" సూచించాడు సుందర్.

అందరూ గబగబా చెట్టెక్కే ప్రయత్నంలో వున్నారు. సుందర్ ముందెక్కేశాడు. ఆ తర్వాత రోజా ఎక్కింది. ఆ తర్వాత సింగామియాను ఎక్కించేందుకు ఆనంద్ ప్రయత్నం చెయ్యసాగాడు. అతని కాళ్ళల్లో సత్తువ లేకపోవడంవల్ల ఎంత ప్రయత్నంచేసినా సింగామియా వల్ల కావడంలేదు. మూడుసార్లు మొదలుదాకా ప్రాకి, పట్టుచిక్కక జారిపోయాడు.

"ఆనంద్! నావల్ల కాదు. వస్తే ఆ పులినోట్లో పడనాచ్చస్తాను. నువ్వెక్కు" అన్నాడు అతన్ని బలి చెయ్యడం ఇష్టంలేక.

"అలాకాదు! చావైనా ఏమైనా ఇద్దరికీ కలిసే వస్తుంది. మళ్ళీ ప్రయత్నించండి!" అన్నాడు ఆనంద్.

కృతజ్ఞతతో సింగామియా కళ్ళు ఆర్ద్రమయినాయి. దొంగయినా అతనిలోని మానవత్వం మేలుకొంది. తోటి మనిషికోసం తన ప్రాణాల్నికూడా ఖాతరు చెయ్యడం లేదతను. తన డబ్బు, హోదా, దర్జా అన్నీ ఎప్పుడో నిరుపయోగమయినాయి. ఇప్పుడు ప్రాణాలు నిలబెట్టుకోడం కోసం వ్యర్థప్రయత్నం సాగిస్తున్న మామూలు మనిషి తను.

అంతలోనే పెద్దపులి వచ్చింది. ఏడడుగుల పొడవుంది. పొడవుపాటి నల్లటి చారలో, పసుపుపచ్చ రంగులో వుందది. దానితల పెద్ద సెర్చిలైట్ లాగుంది. వాసన చూసుకుంటూ, చెట్లలోంచి రావడం కనుపించింది.

"ఆనంద్! వచ్చేసింది" అన్నాడు సింగామియా.

"మీరు ధైర్యంగా వుండండి. ఆ రివాల్వరు నాకివ్వండి" అన్నాడు ఆనంద్.

సింగామియా గబగబా తీసిచ్చాడు.

తలపైకెత్తి రోజానడిగి బాండ్ కేస్ తీసుకున్నాడు. దాన్ని సింగామియాకు అందించి "అందులో ఖాళీ బాటిల్సున్నాయిగా. వెలుపలకుతీసి పట్టుకోండి" అంటూనే రివాల్వరు పెద్దపులికేసి గురిచూడసాగాడు.

అది చెట్టుమొదట్లో నిలబడున్న ఆనంద్‌ను, సింగామియాను చూడగానే, ఆశగా, ఆత్రంగా నోరు తెరిచింది.

రివాల్వరు పేల్చాడు. గుండు నోట్లోకి దూరింది. దాని దెబ్బకు పులి తిరగబడింది. తన్నుకోసాగింది. రెండునిముషాలు పొర్లి కింతలు పెట్టింది. ఆ తర్వాత మెల్లగా లేచింది. కానీ దాని కాళ్ళు స్వాధీనంలో లేవు. నడవలేకుండావుంది. ఆనంద్‌కి దగ్గరగా రావాలన్ని, భూమ్మీద ప్రాకసాగింది.

"వండర్ ఫుల్ షాట్!" అన్నాడు సింగామియా.

"దానికి ఛస్తుందో లేదో!" అనుమానంగా చూశాడు.

"ఛస్తుంది. మరోమారు పేల్చు. చాలా పవర్ ఫుల్ గుండ్లవి" అన్నాడు సింగామియా.

"వద్దు! మనకు ముందుముందు అవసరంగావచ్చు. అనవసరంగా వేస్టు చేసినందువల్ల తర్వాత మనమే ఇబ్బందుల్లో పడతాం!" అన్నాడు ఆనంద్.

ఒకగజం ముందుకుప్రాకి, ఆ తర్వాత దానివల్లకాక తల, వాల్చేసింది పెద్దపులి.

"చచ్చింది!" చెట్టుపైనుండి అరిచాడు సుందర్.

"ఇంక దిగిరా!" అన్నాడు ఆనంద్.

అతని మాటలు పూర్తయ్యేలోపలే క్రిందకు దిగింది రోజా. ఆనంద్‌ను ఆనందంతో కౌగలించుకుంది. సింగామియాకూడా అతనితో కరచాలనంచేసి "ఇంత ధైర్యం సమయస్ఫూర్తివున్న మనిషివి దొంగవెందుకయినావు" అడిగాడు.

"ఖర్మసార్! ఖర్మ! మరేం లేదు!" అన్నాడు ఆనంద్.

పెద్దపులిదగ్గరకంటూ వెళ్ళి నిలుచుని చూశారు. జూలో ఇనుపబోనులో వున్నప్పుడు చూడటానికీ, ఇలా అడవిలో చూడటానికీ ఎంతో భేదం కనుపించింది.

"ఎవరి దగ్గరన్నా బాకుందా?" అడిగాడు ఆనంద్.

"ఎందుకు?"

"పులిగోళ్లు కోస్తాను. రోజాకు దండ చేయించవచ్చు" అన్నాడు ఆనంద్.

సింగామియా తన కిరింగు ఇచ్చాడు. అందులో చిన్న నైఫ్ వుంది. దాని సాయంతో ఆనంద్ పులిగోళ్లుకోసి జేబులో వేసుకున్నాడు.

## 9

అక్కడ్నుంచి ముందుకు కదిలారు. గంటమూడయింది. ప్రొద్దుగూకేందుకు మరో మూడుగంటల టయిముంది. ఆలోగా తాము లోయ పైభాగాన్నుండి చూసిన గూడెం చేరుకోవాలన్న తాపత్రయం ప్రతిఒక్కరిలోనూ వుంది. మాట్లాడకుండా నడవసాగారు. చెట్లకు పాముకుబుసాలు వ్రేలాడుతున్నాయి. దూరంగా అక్కడక్కడా ఎండుటాకులమీద ఏదో జంతువులు నడుస్తున్నట్లు శబ్దం వినిపించసాగింది. ఆశబ్దం వచ్చినప్పుడల్లా అందరూ ఆగి చుట్టూ చూడసాగారు. అందరికన్నా ముందు ఆనంద్ నడవసాగాడు.

రోజా భుజంపైన చెయ్యివేసుకుని కాస్త తేలికగానే నడవడం నేర్చుకున్నాడు సింగామియా. కాలి నొప్పి మాత్రం తగ్గలేదు.

మరో రెండుగంటలు నడిచారు.

ఉన్నట్టుండి పెద్దకోతుల గుంపొకటివచ్చి వాళ్ళపైన

పడింది. రోజా చేతులోవున్న హాండ్ కేస్ లాక్కు పోయాయి. చెట్టెక్కి కూర్చుని దాన్ని తెరచాయి. దాంట్లోవున్న బ్రాందీబాటిల్సు క్రిందపడి పగిలిపోయాయి. నోట్లు గాలికి గాలిపటాల్లా ఎగరడం మొదలెట్టాయి.

"డబ్బు! డబ్బు! ఎగిరిపోతూంది!" అందినన్నినోట్లు దొరకబుచ్చుకుందామని పరుగెత్తాడు సుందర్. పైన చూస్తూ పరుగెత్తడంలో క్రిందెక్కడో పాముపైన కాలు వేశాడు. అది కాస్తా కాటువేసింది. దాంతో అమ్మా అంటూ అరచాడు. ఆ అరుపు వినగానే పరుగెత్తాడు ఆనంద్ అటువేపు. రెండుచేతుల్తో కాలుపట్టుకొని "పెద్ద పాము అటెళ్ళిపోయింది. నన్ను కరచింది. ప్రాణం పోతోంది" పెద్దగా ఏడ్చాడు.

ఆనంద్ అటు చూపించినవేపు చూచాడు. ఏమీ కను పించలేదు.

"ఆనంద్! నన్ను బ్రతికించు" అన్నాడు దీనంగా సుందర్.

ఆనంద్ వంగి అతని కాలికేసి చూశాడు. కాటేసిన చోట చుట్టూ చెమటపట్టింది. అంతలో రోజా కూడా పరుగెత్తుకొచ్చింది.

"ఏమైంది?" అడిగింది.

"పాముకరిచింది!" అన్నాడు ఆనంద్.

"బాగా అయింది. ఛాదస్తపు, దుర్మార్గుడా" అంది రోజా కోపంగా.

"తప్పు. నీ జాకెట్ విప్పు" అన్నాడు.

"ఎందుకు?"

"తర్వాత చెప్తాను. ముందువిప్పు" అన్నాడు.

మాట్లాడకుండా విప్పి అందించింది. ఆనంద్ అందు

కుని దాన్ని మెలిదిప్పి త్రాడులా చేశాడు. పాముకరచిన చోటికి పైవేపు కాలికి బాగా బిగించికట్టాడు. జేబు లోంచి సింగామియా దగ్గర తీసుకొన్న తాళాలగుత్తి వెతికిలాగాడు. దాంట్లోంచి పెన్ నైఫ్ తీసి బ్లేడ్ లాగాడు. సుందర్ ను కళ్ళుమూసుకోమన్నాడు.

"ఏంచేస్తావ్?" అడిగింది రోజా.

"చూస్తూండు" అన్నాడు ఆనంద్.

మెల్లగా కత్తిమొనను పాము కాటేసినచోట బలంగా పొడిచి రౌండ్ గా త్రిప్పాడు. ఆ నొప్పికి తట్టుకోలేక సుందర్ "అమ్మో! బాబూ!" అంటూ అరుపులు పెట్టాడు. ఆనంద్ కత్తి వెలుపలకు లాగేశాడు. రక్తం వెలుపలికి చిమ్ముకొచ్చింది. రెండునిముషాలు అలా రానిచ్చాడు ఆనంద్. ఆ తర్వాత రెండు చేతుల్తో కాలిని గట్టిగా పట్టుకుని తన బలమంతా ఉపయోగించి పిండినట్లు చేశాడు. ఇంకొంత రక్తం వచ్చింది.

"పాడుడబ్బు! కన్నూమిన్నూ కానకుండా దానికోసం పరుగెత్తడమెందుకు? ప్రాణాలకిలా అపాయం తెచ్చుకోవడమెందుకు?" అన్నాడు సింగామియావచ్చి, చూసి జరిగినఘోరం అర్థంచేసుకుని.

"డబ్బుకోసం ఏమైనా చేసేరకం. ఆనంద్ అనవసరంగా అతన్ని గురించి తంటాలుపడుతున్నాడు. తనప్లాను సవ్యంగా జరిగితే వాళ్ళిద్దర్నీ మోసం చెయ్యాలని ప్లాను వేశాడు. దేవుడు మొత్తానికే ఎసరుపెట్టాడు!" అంది రోజా.

## 10

పదినిముషాల తర్వాత సుందర్ కళ్లు తెరచాడు.

"ఎలావుంది?" అడిగాడు ఆనంద్.

"నీరసంగా వుంది."

"నొప్పి పైకెక్కుతున్నట్లుందా? లేక పట్టినచోటనే వుందా?"

"ఎక్కడాలేదు" అన్నాడు సుందర్.

"అయితే! లేచిరాపోదాం!" అన్నాడు ఆనంద్.

"నేను నడవలేను. నన్ను సాయంపట్టి నువ్వే తీసుకు పోవాలి!" అన్నాడు సుందర్.

సరేనంటూ ఆనంద్ సుందర్‌ను లేవదీసి అతని చేతిని తన మెడచుట్టూ వేసుకుని తను నడుస్తూ అతన్ని నడిపిస్తూ ముందుకు సాగాడు. ఎప్పటిలాగే సింగామియాకూడా రోజా భుజంపైన తలపెట్టుకుని బరువంతా ఆమెకేస్తూ నడవసాగాడు.

"మన పథకం పతనమైపోయింది చూశావా?" అన్నాడు సుందర్.

"దానిసంగతి మరచిపో! ముందు ప్రాణాలతో ఈ అడవిలోంచి బయటపడితే చాలనిపిస్తోంది నాకు!" అన్నాడు ఆనంద్.

"నా కలాగనిపించడంలేదు. మమ్మల్ని రెండు పెద్ద ప్రమాదాల్లోంచి తప్పించావ్. నీ సాయంతో మనం ఖచ్చితంగా ప్రాణాల్తో బయటపడతాం. సింగామియా కూడా బైటపడతాడు. ఇప్పుడిలా మనతో తిరిగిన మనిషి నాగరిక ప్రపంచంలో అడుగుబెట్టగానే మామూలుసితికి వచ్చేస్తాడు. కానీ మనం క్రిమినల్స్‌లా మిగిలిపోతాం. అడవిదాటాక అతను మనల్ని వేటాడుతాడు. అక్కడ మనల్ని మనం రక్షించుకునేందుకు, నీ ఉపాయాలు, సమయస్ఫూర్తీ దేనికి పనికిరావు. ఏ డబ్బుకు ఇక్కడ విలువలేదో,ఆడబ్బే అక్కడ మనల్ని అణచిపెడుతుంది."

"అయితే ఏంచేద్దామంటావ్."

"సింగామియాతో బేరం పెడదాం! ప్రాణాలతో బయటపడాలంటే అతని ఆస్తిలో సగం రానిమ్మని అడుగుదాం. అందుకు ఒప్పుకోకపోతే అతన్నివదిలేద్దాం. రోజా ఆడది. దానివల్ల ఏమీకాదు. ఇద్దరూ ఛస్తారు ఇక్కడే!" అన్నాడు సుందర్.

"అందువల్ల మనకు వచ్చేదేమిటి?"

"మనల్ని గురించి తెలిసిన మనుషులిద్దరుండరు. మరో పథకమేదన్నా వేద్దాం. డబ్బు సంపాదించుకుందాం" అన్నాడు సుందర్, ఆనంద్ తనదోవకు వస్తున్నందుకు సంతోషపడుతూ,

ఆనంద్ ఆలోచించాడు. సుందర్‌తో వాదించి లాభం లేదనిపించింది. మృత్యుముఖంనుండి బయటపడగానే అతని మెదడు మళ్ళీ మామూలుదారిలోనే నడుస్తూంది. సింగామియా మంచితనం, అతన్ని ఎందుకో ఆకర్షించింది. అతన్నెలాగైనా ఏ ఆపదా లేకుండా ఈ అడవిలోంచి బయటపడెయ్యాలనిపించింది. అది పైకి చెప్పకుండా సుందర్‌తో "సరే! మాట్లాడుతాను. ఏమంటాడో చూద్దాం!" అన్నాడు.

"నువ్వొద్దు! నన్ను మాట్లాడనీ. ఇలాటి వ్యవహారాల్లో ఎలామాట్లాడాలో నీకు అర్థంకాదు" అన్నాడు సుందర్.

"సరే! నువ్వు మాట్లాడు. కానీ ఒక్క విషయం మరచిపోవద్దు. నీగురించి తెలుసుకోవలసిందంతా రోజాద్వారా తెలుసుకున్నాను. నన్ను మోసంచేద్దామని ప్రయత్నించావా, నీకింతకుముందు పోసిన ప్రాణాల్ని నిర్దాక్షిణ్యంగా తోడేస్తాను. జాగ్రత్త!" అన్నాడు.

"ఛ! అలా ఎప్పటికీ చెయ్యను. మనిద్దరం ఒకటే!" అన్నాడు సుందర్.

మాటల్లో వీళ్ళిద్దరూ వెనుకపడిపోయారు. రోజా సింగామియా బాగా ముందుకు వెళ్ళారు. చెట్లు అంత దట్టంగా లేకపోవడంతో దూరంగా వాళ్ళు కనుపించ సాగారు.

"అయ్యో! అయ్యో!" పెద్దగా రోజా కేకలు పెట్టడం విని, సుందర్ ని భుజంపైనుండి క్రిందకు దించి అటు కేసి పరుగెత్తాడు.

"ఏమయింది?" అడిగాడు ఆనంద్.

"యూరిన్ కెళ్ళొస్తానని అటువెళ్ళాడు. అక్కడేదో మాటు పెట్టినట్లున్నారు. లోపలకు కూలిపోయాడు" అంది రోజా.

సుందర్ పాక్కుంటూ వచ్చాడు, ఆనంద్ రోజాల వద్దకు.

ఆనంద్ వెళ్ళి చూశాడు. ఏదో మృగాన్ని పట్టు కునేందుకు పెట్టిన మాటులో చిక్కుపోయాడు సింగా మియా. వొంగి కూర్చుని లోనికి చూశాడు. నలభై అడుగులపైనేవుంది అగడ్త. అందులో బోర్లాపడివున్నాడు సింగామియా.

పెద్దగా పిలిచాడు. అతను పలకలేదు. కదులుతా డేమోనని నిద్దష్పగించిచూశాడు. కానీ అతనిలో చలనం లేదు.

"అంతలోతున పడివున్నాడు. ప్రాణాలున్నాయో, లేవో!" అంది రోజా.

"అదే నేనూ చూస్తున్నాను. కదలికలేకుండా పడి వున్నాడు!" అన్నాడు ఆనంద్.

"మన పనికాకుండానే చచ్చినట్లున్నాడు రోగ్!" అన్నాడు సుందర్.

అతనిమాట వినడంతో అంగ డ్డలోకి కళ్లు చిట్లించి చూడ సాగాడు ఆనంద్. సింగామియా శరీరం కొద్దిగా కదలినట్లు గమనించాడు.

"ప్రాణంపోలేదు రోజా! అతను బ్రతికే వున్నాడు. కదులుతున్నాడు" చెప్పాడు ఆనందంగా.

రోజాకూడా వంగి చూసింది. బ్రాసరీ, పెట్టీకోట్ తప్ప ఆమె వొంటిపైన మరే బట్టా లేదు. అయినా ఆమెకు తను స్త్రీననే విషయంగానీ, ఇద్దరు మగవాళ్ళ మధ్య వున్నానన్న విషయంగానీ, గుర్తులేవు.

"బ్రతికించాడు!" అన్నాడు సుందర్.

అతనికేసి అసహ్యంగా చూసింది రోజా.

"మీరు ఇక్కడే వుండండి. నేను వెళ్ళి ఏదైనా తాడు లాంటి తీగలుగానీ, మర్రిచెట్టు ఊడలుగానీ దొరుకుతా యేమో చూస్తాను" అన్నాడు ఆనంద్.

"అలాగే!" రోజా అంది అతను ఖాళీచేసిన స్థలంలో కూర్చుంటూ.

"ఆనంద్!" పిలిచాడు సుందర్.

ముందుకు వెళ్ళబోతున్న మనిషి ఆగి వెనక్కి తిరిగి ఏమిటన్నట్లు చూశాడు.

"ఇంతకన్నా మంచి అవకాశం రాదు మనకి. ఇప్పుడే పెట్టు బేరం. సగం ఆస్తి ఇస్తేనే వెలుపలకు లాగుతానని చెప్పు. లేకుంటే అక్కడే వదలివేసిపోతానని బెదిరించు. చచ్చినట్లు ఒప్పుకుంటాడు" అన్నాడు సుందర్.

"సరేలే! ముందు అతన్ని రక్షించే మార్గం చూడనీ!" అంటూ కదలి ముందుకు వెళ్ళాడు ఆనంద్.

"మళ్ళా ఏదో అతనికి నూరిపోసినట్లున్నావ్!" అనుమానంగా చూస్తూ అడిగింది రోజా.

"నీ కనవసరం! డబ్బువ వాళ్ళే కాదు సర్వస్వం అమ్ముకునే రంకు ముండవు. నిన్ను నమ్మటం నాదే తప్పయింది. ఇలా వాడివెంటపడి నమ్మల్ని మోసం చేస్తావనుకోలేదు!" అన్నాడు సుందర్ కోపంగా.

"నువ్వేదో పెద్ద తెలివిగలవాడవని అనుకున్నానే! అది నాదే తప్పు. నీ అంత నీచుడ్ని నేను ఎప్పుడూ చూడలేదు. నీతో కొన్నిదినాలు గడిపానన్న విషయం గుర్తుకొస్తే నా శరీరంపైన నాకే అసహ్యంగా వుంది!" అంది రోజా.

"ఉంటుంది. ఆ బంగారు పిచిక చేతికి చిక్కిందిగా. ఈ అడవిలోంచి బైటపడ్డాక వాడి అసలు రంగు తెలుస్తుంది. అప్పుడు మళ్ళా నే నేగతి నీకు!" అన్నాడు సుందర్.

"అటువంటి గతిపడితే నీ దగ్గరకు మాత్రం రాను. ఉరిపోసుకుని చస్తాను."

"అంతదాకా ఎందుకు! అదేదో ఇప్పుడే చావు!" అంటూ ఆదమరచివున్న తరుణంలో నెట్టాడు వెనక్కి సుందర్. రోజా పెద్దగా అరుస్తూ అగడ్తలోపడిపోయింది.

'పీడ వదలింది!' అనుకున్నాడు.

అరగంటయినా ఆనంద్ రాలేదు. వెలుతురును చీకటి నంజుకొని తినసాగింది. చిక్కంగా చుట్టూ పేరుకుంది. హోరుమని వీస్తున్న గాలికి తలలూపుతున్న పెద్దపెద్ద టేకుచెట్లు దయ్యాల్లా వున్నాయి. ఆనంద్ త్వరగావస్తే బాగుండుననుకున్నాడు. మరో అరగంట గడిచింది.

ఆనంద్ కేదన్నా ప్రమాదం జరిగిందేమోనన్న భయం వేసింది.

అగడ్తలోకి వంగిచూశాడు. రోజా, సింగామియా

ఇద్దరూ కూర్చునివున్నారు. వాళ్ళు చావనందుకు కోపంగా వుంది సుందర్ కు.

అంతలో ఆనంద్ వచ్చాడు. అతని నెత్తిన లావుపాటి తీగలమోపువుంది. దాన్ని క్రిందపడ్రోసి "రోజా ఏదీ!" అడిగాడు సుందర్ ను.

"ఆమెకూడా ప్రియుడి దగ్గరకు వెళ్ళింది" అంటూ అగడ్తవేపు చూపించాడు.

ఆనంద్ వంగిచూశాడు. రోజా కనుపించింది. ఆనంద్ ను చూడగానే చెయ్యిఊపింది. చీకట్లో తను ఏంచేసేందుకు వీలుపడదని అర్థంచేసుకుని తెల్లారిందాకా సర్దుకొని అక్కడే ధైర్యంగా వుండమని చెప్పాడు.

"సరే!" నని పెద్దగా అరచింది రోజా.

తెచ్చిన మోపువిప్పి, తీగల్ని సరిచేస్తూ కూర్చున్నాడు. సుందర్ కూడా అయిష్టంగానే అతనికి సాయంచెయ్యసాగాడు ఆ పనిలో.

"రోజాను నువ్వు తోసేశావా?" అడిగాడు ఆనంద్.

"లేదు! ఆమే దూకింది."

"అబద్ధాలు చెప్పకు. నువ్వింత నీచాతినీచంగా ఎందుకు ప్రవర్తిస్తున్నావో నాకు అర్థంగావటంలేదు. ఎదుటివాళ్ళు సుఖపడ్డా చూచి ఓర్చుకోలేని తత్త్వం లాగుంది నీది. నీకు ప్రాణాలు పోయడం ఒక్కటే నేను జీవితంలో చేసిన పెద్ద నేరమనిపిస్తుంది" తీగలకు ముళ్ళు వేస్తూ అన్నాడు ఆనంద్.

"నన్నన్యాయంగా నిందిస్తున్నావ్. నాకేం తెలీదు. రోజా నిజంగానే కాలుజారి పడిపోయింది" అన్నాడు సుందర్.

అతనితో మాట్లాడేందుకు్కూడా మనసొప్పలేదు

ఆనంద్ కు. తనపనిలో నిమగ్నమయిపోయాడు.

నాలుగైదు గంటలు ఓపిగ్గా శ్రమపడ్డాక అరవై అడుగులపాడవున్న తాడులాంటిదాన్ని తీగలతో తయారు చేశాడు. దాని ఒక చివర్ని ఒక పెద్ద చెట్టు మొదలుకు బాగా బిగించికట్టాడు. బలంగా గుంజిలాగాడు. ముడి బిగుసుకుంది. రెండో చివర్ని తెచ్చి అగడ్తలోకి దించాడు. దాని కొసవెళ్ళి సింగామియాను తాకింది.

అగడ్త పైన నిలబడి అరచి చెప్పాడు దాన్ని పట్టుకుని మెల్లగా పైకిరమ్మని.

సింగామియా ప్రయత్నించాడు. రోజాకూడా సాయం చేసింది. పట్టుమని పదడుగులు ఎక్కకముందే జర్రున క్రిందికి జారిపోసాగాడు. వొళ్ళంతా పుండులా వుండటం, దానికితోడు రెండుదినాలుగా తిండిలేకపోవడం అతన్ని నిర్వీర్యుణ్ణి చేశాయి.

ఆనంద్ ఎదురు చూసివాసి లాభంలేదని నిర్ణయించుకుని రోజాను ట్రై చెయ్యమన్నాడు. అరగంట అవస్థపడి రోజా మెల్లగా పైకొచ్చింది.

"అంత అజాగ్రత్తగా ఎందుకున్నావ్?" అడిగాడు ఆనంద్.

సుందర్ ఏంచెప్పివుంటాడో ఆమెకు అర్థమయింది. జరిగిన నిజం చెప్పటంకన్నా, అతని సాయంతో మెల్లగా సింగామియాను పైకి లాక్కురావడం అవసరమన్న భావం కలిగింది.

"తెయిందేదో అయింది. అతన్నెలా పైకి లేవడం. బాగా నీరసించిపోయాడు. పదసార్లు ప్రయత్నించినా ఫలితం లేకపోయింది" అంది రోజా.

"ఫరవాలేదు. అతన్ని ఘట్టిగా పట్టుకోమందాం.

మనం ముగ్గురం తీగల్ని పట్టుకుని పైకిలాగుదాం. వచ్చేస్తాడు పైకి" అన్నాడు ఆనంద్.

అతని ఆలోచన రోజాకు నచ్చింది.

"ఆ పర్వతాన్ని మనం లాగగలమా! తిండితిని రెండ్రోజులయింది!" అన్నాడు సుందర్.

"నోరుమూసుకుని చెప్పింది చెయ్యి" అన్నాడు కోపంగా.

సుందర్ మౌనంగా వుండిపోయాడు.

ఆనంద్ అగడ్డలోకి తొంగిచూసి నోటిచుట్టూ రెండు చేతులూ అడ్డంపెట్టి తను ఆలోచించిన పథకం సింగా మియాకు పెద్దగా వివరంగా చెప్పాడు.

సింగామియా తీగల్ని వొంటికి కట్టుకుని ముడివేసుకున్నాడు. రెండుచేతుల్తో పైభాగం పట్టుకొన్నాడు. పైన ఆనంద్, సుందర్, రోజా ముగ్గురూ బలంగా దాన్ని లాగడం మొదలెట్టారు. వాళ్ళ ముగ్గురి శక్తంతా ఉపయోగిస్తే సింగామియాని పైకిలాగేందుకు అరగంట పట్టింది.

అందరూ పైనచేరారు.

ఆ ప్రమాదంలోంచి ప్రాణాలు పోకుండా తప్పించుకున్నందుకు సంతోషంగావుంది సింగామియాకు,ఆనంద్ కు.

# 11

"ఇక్కడ మాటుపెట్టారంటే చుట్టుప్రక్కల మనుషులెవరో వున్నట్లే. తాము పెట్టిన మాటులో ఏదైనా మృగం పడిందేమో చూసేందుకు రోజూ వస్తారు. తెల్లారిందాకా మనం ఇక్కడేవుందాం. వాళ్లెవరన్నా వస్తే, వాళ్ళసాయంతో దారి తెలుసుకోవచ్చు!" అన్నాడు ఆనంద్.

మనుషుల పేరు వినగానే రోజాకు ఆనందం వేసింది.

సింగామియాకూడా ఆనంద్ ఆలోచనను సమర్థించాడు.

అందరూ అగడ్త ప్రక్కనేవున్న చెట్టు మొదట్లో చేరబడ్డారు.

"నిద్ర వస్తోంది!" అంది రోజా.

"పడుకొని విశ్రాంతి తీసుకో!" అన్నాడు ఆనంద్.

"ఈలోగా ఏ అడవిదయ్యమో వచ్చి మనల్ని బిర్యానీలా నంజుకుని తింటుంది. ఆమె ఒక్కతేం ఖర్మ! అందరం నిద్రపోదాం!" అన్నాడు సుందర్.

"దయ్యాలూ గియ్యాలూ ఏవీలేవు. మీరు పడుకోండి. నాకు నిద్ర రావడంలేదు. నేను మేలుకొనే వుంటాను" అన్నాడు ఆనంద్.

"నాకు నిద్రరావడంలేదు!" అన్నాడు సింగామియా.

అందరూ అలాగే కూర్చున్నారు. నిద్రవస్తున్నా భయానికి ఆపుకున్నారు. తెల్లవారుబోతున్నట్లు సన్నగా వెలుగు కనిపించింది. ఆ వెలుగులోనే గుర్రాల డెక్కల శబ్దం కూడా వినిపించింది.

"ఎవరో వస్తున్నట్లున్నారు. అలా చెట్లవెనక్కి నక్కుదాం" అన్నాడు ఆనంద్ ముందు దారితీస్తూ.

అందరూ అతన్ని అనుసరించారు.

అంతలోనే నాలుగు గుర్రాలొచ్చి అగడ్త దగ్గర ఆగాయి. వాటిపైనున్న బుర్రమీసాలవాళ్ళు దిగారు. మెల్లగా నడచుకొంటూ అగడ్తదగ్గరకొచ్చి చూశారు.

"మన మాటు చెదరిందే. ఏదో మోఖం పడినట్లుంది!" అన్నాడొకడు హిందీలో.

మిగిలిన ముగ్గురూ వెళ్ళి తొంగిచూశారు.

"లోప లేదీలేదే!" అంటూ ఆలోచిస్తూ నిలుచున్నారు.

చెట్టుకు కట్టివున్న తీగలకుప్ప కనుపించింది.

"అరేయ్! ఈ ప్రాంతంలో ఎవరో మనుషులు తచ్చాడుతున్నారు. అది చూశావా?" అంటూ చూపించాడు ఒకడు చెట్టుకు మిగిలిన ముగ్గురికీ.

అందరి దగ్గర పెద్ద రైఫిల్స్ వున్నాయి. నడుంచుట్టు వున్న తోలుపటకా నిండా గుండ్లువున్నాయి.

వాళ్ళను చూడగానే చంబల్ వాలీ డెకాయిట్స్ని సులభంగానే గుర్తుపట్టాడు సింగామియా. అంతకుముందు పులిని చూచినా ఆనంద్ కు, మిగిలిన వాళ్ళకు భయంపుట్ట లేదు. కానీ ఆ ఆగంతకుల్ని చూడగానే భయంపుట్టింది. పచ్చినెత్తురు త్రాగే కసాయివాళ్ళలాగున్నాయి ఆకృతాలు.

"తప్పించుకుందామా?" అడిగాడు ఆనంద్ రహస్యంగా.

"వద్దు! వాళ్ళకు తెలీనిదేదీ వుండదీ అడవిలో. ఎంతోసేపు వాళ్ళ కళ్ళుగట్టి తిరగలేం!" అన్నాడు సింగామియా.

"అయితే లొంగిపోదామా?"

"ఆఁ!"

"మన ప్రాణాలకు ముప్పు తెస్తారేమో?"

"ఏం ఫరవాలేదు. వాళ్ళను నాకు వదిలెయ్. నేను చూసుకుంటాను" అన్నాడు సింగామియా.

సుందర్ వాళ్ళను చూడగానే భయపడిపోయాడు. సింగామియా వాళ్ళముందుకుపోబోతుండగానే పైప్రాణాలు పైనేపోయాయి. వాళ్ళ చేతుల్లో చావడం ఇష్టంలేక పోయింది. బ్రతికున్నంతసేపు, చావును దూరంగా వుంచాలన్నదే అతని పద్ధతి. అందుకే మిగిలినవాళ్ళ గతే

మైనా తనకు అవసరం లేదనుకుని, అక్కడ్నుంచి చెట్ల లోకి వెళ్ళిపోయాడు.

అంతలోనే బందిపోటుదొంగలు మిగిలిన ముగ్గుర్నీ చుట్టుముట్టేశారు. తుపాకీలు బారుచేశారు. ముగ్గురూ చేతులెత్తారు.

"ఎవరు మీరు?"

"దారితప్పిన విమాన ప్రయాణీకులం. మేముప్రయాణం చేస్తున్న విమానం కూలిపోయింది. అందరూ చని పోయారు. మేముమాత్రం మిగిలాం. రెండురోజులనుండి అడవిలో దారీ తెన్నూ తెలీకుండా తిరుగుతున్నాం. రాత్రి ఈ మాటులో ఇతను పడిపోయాడు. అతన్ని రక్షించుకొనే ప్రయత్నంలో రాత్రంతా ఇక్కడే గడిపాం!" అన్నాడు ఆనంద్.

"మీరు పోలీసుల్లాగున్నారే!"

"కాదు! నా పేరు ఆనంద్. మద్రాసులో జేబుదొంగ తనాలు చేస్తూ బ్రతుకుతుంటాను. ఆమె పేరు రోజా. క్లబ్బులో డాన్సు చేస్తూంటుంది. ఇక ఇతని పేరు సింగా మియా. కలకత్తాలో పెద్దవ్యాపారి. విమానంకూడా వారిదే. దాంట్లోనే ప్రయాణంచేస్తూ ఈ స్థితికివచ్చాం" అన్నాడు ఆనంద్ మళ్ళీ.

"ఈ మాటు జంతువులకాదు పెట్టింది. పోలీసుల కోసమే, వాళ్ళ జవాన్లకు" అన్నాడు ఒకతను.

"మేము పోలీసులంకాదు!"

"మీరు చెప్పేది నిజమని మేమెలా నమ్మాలి."

"మాకు తగిలిన ఈ దెబ్బలు, వొంటినిండా మిగిలిన గాయాలు చూడండి."

"మేము పోలీసులమైతే ఈ స్థితి కొందుకొస్తాం!"

అన్నాడు ఆనంద్.

"అంతవరకు అవసరంలేదు. నాకంపెనీ అడ్రసు ఇస్తాను. మీరువెళ్ళి నన్ను బందీగా పట్టుకున్నామని రెండులక్షలిస్తే వదుల్తామని మా మేనేజరుకు ఫోన్‌లో చెప్పండి. మీకా డబ్బు వస్తుంది. అదివచ్చాక మమ్మల్ని వదలండి" అన్నాడు సింగామియా.

లక్షలు అన్న అక్షరాలపైన అతను నొక్కి నొక్కి చెప్పడంతో, వాళ్ళ తలలు దిమ్మతిరిగిపోయాయి.

"అయితే నడవండి" అన్నారు వాళ్లు.

ముగ్గురి చేతులుకలిసి సన్నటి పగ్గంలాంటి తాడుతో కట్టేశారు. ఆ తాడు గుర్రపు జీనుకు కట్టుకొన్నాడు ఒకతను. అతని గుర్రంముందు దాని వెనుక బాధితులు, వాళ్ళవెనుక మిగిలిన ముగ్గురు బందిపోట్లు గుర్రాలపైన.

చెట్లచాటునుండి, అలా గంట నడకతో చిన్న పల్లె లాంటి గూడెం చేరారు.

చాలామంది ఆడవాళ్ళు, పిల్లలు గుంపుగా వచ్చారు చూసేందుకు.

# 12

సింగామియానూ, ఆనంద్‌ను, రోజాను, తీసుకెళ్ళి ఒక పెద్ద గుహలాంటి దాంట్లోపెట్టి వెలుపల తలుపులుమూసి తాళం పెట్టారు.

"మాకు బాగా ఆకలిగా వుంది. తినేందుకేమయినా పెట్టండి!" అడిగాడు సింగామియా హిందీలో.

ఒకతను అరగంటలోతిరిగొచ్చి కమ్మటి కోడికూరా, ఒక పెద్ద చపాతీల దొంతర, మంచినీళ్ళు అందించి పోయాడు.

ఆ తర్వాత అరగంటకు ఇంకొకతను వచ్చి "సిగరెట్లు

కావాలా?" అడిగాడు.

"కావాలి!" అన్నాడు సింగామియా.

గోల్డ్ ఫ్లాక్ పాకెట్, అగ్గిపెట్టె విసరేశాడు.

"మీ నాయకుడెవరు?"

"ఢాకూ షేర్ హేమ్‌సింగ్!" అన్నాడు వాడు మీసం మెలిత్రిప్పుతూ. అతను వెళ్ళిపోయాడు.

సింగామియా సిగరెట్ త్రాగుతూ మౌనంగా కూర్చున్నాడు.

"ఏమిటలా వున్నారు?" అడిగింది రోజా.

"ఆ హేమ్‌సింగ్ గురించి విన్నావా? అతను నెత్తురు త్రాగుతాడు. చంబల్ వాలీలోకల్లా బలవంతుడైన బందిపోటు అతనే. ఒకవిధంగా వీళ్ళకంతా చక్రవర్తిలాంటి వాడు. తనమాట వినని వాళ్ళని నిలువునా నరుకుతాడు. అతను చేసిన హత్యలకు లెఖ్ఖలేదు. నాలుగైదుసార్లు పోలీసులతో తలబడి తనే గెలిచాడు. ఈ మధ్యనే, అంటే వారం దినాలక్రితం, తను ఖచ్చితంగా లొంగిపోదలచుకున్నానని ప్రభుత్వానికి వర్తమానం పంపేడు. ఆ రోజు నేను భోపాల్‌లో వున్నాను. గవర్నమెంటుకు చాలా ఆనందంగావుంది. అతనిపైనున్న కేసుల్ని కొట్టి వేస్తానంది" అన్నాడు సింగామియా.

"నాకు తెలిసి లొంగలేదు" అన్నాడు ఆనంద్.

అంతలో వెలుపల జనంలో కలకలం బయలుదేరింది. ఇద్దరు బందిపోటుదొంగలు ఒకశవాన్ని గుర్రానికి కట్టి లాక్కొచ్చారు. దాన్ని తెచ్చి సింగామియాకు చూపించి "ఇతన్ని మీరు చూశారా?" అడిగారు.

ఎవ్వరికీ నోటమాటరాలేదు. అది సుందర్ శవం. ప్రాణాలు కాపాడుకునేందుకు అడవిలోకి వెళ్ళినందుకు

అతనికి పట్టిన దుర్గతికి ముగ్గురికీ బాధకలిగింది.

"తెలుసు! మా స్నేహితుడే! విమానం కూలిపోయాక కనుపించలేదు. చచ్చిపోయాడనుకున్నాం. మీ కెక్కడ దొరికింది శవం?" అడిగాడు సింగామియా.

"శవంకాదు! మనిషే దొరికాడు!" అన్నాడు దొంగ.

"చంపేశారెందుకు?"

"పరుగెత్తాడు, కాల్చాను. చచ్చాడు" అన్నాడు నిర్లిప్తంగా.

మరోగంటకు హేమసింగ్ కార్లో వచ్చాడు. అతని వెనుక కొన్ని పోలీసువాన్లు వచ్చాయి. కార్లో అతని వెంట ఇద్దరు ఖద్దరుచొక్కావాలాలు, మరో ఇద్దరు పోలీసు ఆఫీసర్లు దిగారు. తన అనుచరుల కందరికీ తను లొంగి పోయినట్లు ప్రకటించి అందర్నీ ఆయుధాలు తెచ్చి ఇచ్చేసి లొంగిపొమ్మన్నాడు. పెద్ద గుట్టలా పడ్డాయి తుపాకీలు. ఎవరో బంధితుల గురించి చెప్పగానే వరి లెయ్యమన్నారు. తలుపులు తెరవబడ్డాయి.

సింగామియా పోలీసు ఆఫీసర్లను కలుసుకుని జరిగిన గొడవ మొత్తం చెప్పగానే, ఆ విమానం గురించి తమ ప్రభుత్వంకూడా వెతుకుతూందనీ ప్రాణాలతో కొంత మందన్నా బైట పడ్డందుకు సంతోషంగా వుందనీ చెప్పాడు.

వాళ్ళతోటే భూపాల్ చేరారు. అక్కడ్నుంచి కల కత్తాకు విమానం ఎక్కుతుంటే "నేను రాను!" అంది రోజా.

"ఏం? మనను మార్చుకున్నావా?" అడిగాడు సింగామియా.

"లేదు! ట్రయిన్ లో పోదాం!" అంది భయంగా.

"ఫరవాలేదు! ప్రమాదాలు రోజూ రావు. ఆనంద్ వెళ్లి మూడు టిక్కెట్లు పట్రా!" అన్నాడు సింగామియా.

"నే నెందుకు సార్ మీతో!" ఆనంద్ అన్నాడు సింగామియాతో.

"నా ప్రాణాల్ని కాపాడినందుకు! నిన్ను నా ప్రైవేట్ సెక్రటరీగా తీసుకుంటున్నాను" అన్నాడు సింగామియా.

"నేను దొంగను" అన్నాడు ఆనంద్.

"కాని దెవ్వరు? నరరూప రాక్షసుడైన ఛాకా హేమ్ సింగ్ ను మన్నించగల ప్రభుత్వం మనది. నిన్ను నేను మన్నిస్తున్నాను. వెళ్ళి టిక్కెట్లు తీసుకురా!" అన్నాడు.

అరగంట తర్వాత విమానం ఆకాశంలోకి లేచింది.

"నీకు విమానం కావాలా?" అడిగాడు సింగామియా, రోజాను ప్రేమగా చూస్తూ.

"వద్దు! మీ పాదాల చెంత నే బ్రతక నివ్వండి చాలు!" అంది రోజా.

సింగామియా హృదయం ఆనందంతో పొంగిపోయింది.

—: ఐ పో యిం ది :—

# మంచు మనిషి

రమణశ్రీ

ఫోన్ బెల్ గణగణమంటూ మ్రోగింది.

ఎలక్ట్రిక్ రేజర్‌తో షేవ్ చేసుకుంటున్న బ్రిగేడియర్ జైల్‌సింగ్ ఎడంచేతితో రిసీవరు అందుకున్నాడు.

"గుడ్ మార్నింగ్ బ్రిగేడియర్ సాబ్!" స్నోస్మైల్ హోటల్ రిసెప్షనిస్ట్ కంఠం మృదుమధురంగా విన్పించింది.

"గుడ్ మార్నింగ్ బేబీ. ఏమిటి విశేషాలు?" అడిగాడు జైల్‌సింగ్.

"మీకోసం మిష్టర్ జయాల్ వచ్చారు. పైకి పంపించమంటారా?"

"సారీ బేబీ, చిన్నపనిలో వున్నాను. రెండునిమిషాలు అతనికి కమ్మని కబుర్లు చెప్పి, ఆ తరువాత పైకి

పంపించు" అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి బాత్ రూంలోకి పరిగెత్తాడు సింగ్.

హాట్ వాటర్ షవర్ తిప్పి సోప్ అందుకున్నాడు సింగ్.

అయిదునిమిషాలు గడిచాయి.

బాత్ రూం తలుపు తెరచుకొని బయటకు రాగానే, ఎదురుగా సోఫాలో కూర్చొనివున్న జయాల్ కన్పించాడు.

"గుడ్ మార్నింగ్ సింగ్ జీ" సోఫాలోంచి లేచి విష్ చేశాడు జయాల్.

"గుడ్ మార్నింగ్ మిష్టర్ జయాల్, సారీ ఫర్ ది లేట్ అండ్ ట్రబుల్" జయాల్ కు ఎదురుగా కూర్చుని సిగరెట్ అంటిస్తూ అన్నాడు సింగ్.

"నెవర్ మైండ్ సర్! మరో అరగంటలో సమావేశం ప్రారంభమవుతుంది. మిమ్మల్ని స్వయంగా తీసుకురమ్మని సిన్హాగారు పంపించారు."

"థాంక్స్. టిఫిన్ చేసి బయల్దేరుదాం" రూంసర్వీస్ కోసం కాలింగ్ బెల్ ప్రెస్ చేస్తూ అన్నాడు.

ఉదయం ఎనిమిది గంటలయింది. ఇంకా సూర్యుడు స్పష్టంగా కన్పించడంలేదు. బయట సన్నగా మంచు తుంపరలు పడుతున్నాయి.

"సింగ్ జీ, మీ రూంలో ఫైర్ ప్లేస్ లేదా?" అడిగాడు జయాల్.

"ఎక్కడో వుండేవుంటుంది. దాని అవసరం నాకు రాలేదు."

ఆశ్చర్యపోయాడు జయాల్. "వాట్ సింగ్ జీ, ఈ డార్జిలింగ్ లో ఫైర్ ప్లేస్ చెంతలేకుండా మీరు యీ రాత్రి అంతా గడిపారా?" అడిగాడు.

"ఎస్ మిస్టర్ జయాల్, నేను బ్రిగేడియర్‌ను. అహర్నిశలూ సరిహద్దుల దగ్గర అప్రమత్తతతో వుండే మేము, ఫైర్‌ప్లేస్‌లకు అలవాటుపడితే కష్టం. ఆ చలి మా శరీరాలకు దడిచి పారిపోవలసిందే!" నవ్వాడు జైల్‌సింగ్.

రూంసర్వీస్‌బోయ్ వచ్చి వేడివేడి టిఫెన్, విస్కీ టేబుల్స్‌పైన సర్ది వెళ్ళిపోయాడు.

పదినిమిషాలలో టిఫెన్ పూర్తిచేసి బయటపడ్డారిద్దరూ.

జయాల్ టాక్సీపిలిచి, ఎక్కడికి వెళ్ళాలో చెప్పాడు.

మరుక్షణం టాక్సీ ఇండియన్ మౌంటనీరింగ్ ఇన్‌స్టిట్యూట్ వైపు దారితీసింది.

* * *

జైల్‌సింగ్ హిమాలయాలవద్ద చైనా సరిహద్దులలో భారత సైన్యంలో బ్రిగేడియర్‌గా పనిచేస్తున్నాడు.

1962 లో చైనాతో యుద్ధం సంభవించినప్పుడు, ఏమాత్రం అనుభవం లేకుండానే, హిమాలయాలపై సంచరించుతూ, సరిహద్దులను కాపాడవలసి వచ్చింది భారత సైన్యం. అప్పుడే అతనిలోగల పర్వతారోహణ మీది వుత్సాహం రెట్టింపు అయింది.

యుద్ధం ముగిసింది. మంచుపర్వతాలలో సంచరించే సుశిక్షితులైన సిబ్బందిలేనిలోటు భారత ప్రభుత్వానికి ఆ యుద్ధంలో స్పష్టంగా కన్పించింది.

వెంటనే ప్రభుత్వం కార్యాచరణకు పూనుకుంది.

అప్పటికే డార్జిలింగ్‌లో పేరుకు పనిచేస్తున్న ఇండియన్ మౌంటనీరింగ్ ఇన్‌స్టిట్యూట్‌ను బాగా అభివృద్ధి పరిచి, ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన డాక్టర్ సిన్హాను ఆ ఇన్‌స్టిట్యూట్‌కు ప్రిన్సిపాల్‌గా నియమించింది.

ఆ తరువాత ముఖ్యమైన సైనిక సిబ్బందిని శిక్షణకై ఆ ఇన్‌స్టిట్యూట్‌కు తరలించింది.

అలా ఆ ఇన్‌స్టిట్యూట్‌కు వచ్చిన మొదటిజట్టులో ఒకడు బ్రిగేడియర్ జైల్‌సింగ్.

సహజంగా పర్వతారోహణయందు వుత్సాహంగల జైల్‌సింగ్ వచ్చిన అవకాశాన్ని చక్కగా సద్వినియోగం చేసుకున్నాడు.

ప్రిన్సిపాల్ సిన్హాగారి ప్రత్యేక అభిమానానికి పాత్రుడయ్యాడు.

ప్రతిసంవత్సరం ఇన్‌స్టిట్యూట్ వార్షికోత్సవాలకు పిలుపు వస్తూనే వుంటుంది. ఎన్నిపనులున్నా, సింగ్ ఆ వుత్సవాలకు హాజరవుతూనే వుంటాడు.

అలాగే యీ సంవత్సరం వార్షికోత్సవాలకు గూడా, తప్పకుండా రమ్మని, యీ వార్షికోత్సవానికి యిటీవల ఎవరెస్ట్ నధిరోహించిన ప్రొఫెసర్ దయాళ్ బృందం ముఖ్య అతిథులుగా వస్తున్నారని, వారి పర్వతారోహణ విశేషాలు తెలుసుకోవచ్చునని వుత్తరం వ్రాసారు సిన్హా గారు.

ఎంతో వుత్సాహంతో, తాను యీ వుత్సవానికి హాజరవుతున్నట్లు ప్రిన్సిపాల్ సిన్హాగారికి టెలిగ్రామ్ యిచ్చి, డార్జిలింగ్‌కు ప్రయాణమయ్యాడు జైల్‌సింగ్.

డార్జిలింగ్‌కి వచ్చేటప్పటికి అతనికోసం స్నోక్రెస్ట్ హోటల్‌లో రూం బుక్ చేసి వుంచారు సిన్హాగారు.

## 2

ప్రొఫెసర్ దయాళ్ చిన్నగా గొంతు సవరించుకొని చెప్పటం ప్రారంభించారు. ఆ హాలులో సమావేశమైన వారంతా ఆయన చెప్పేది శ్రద్ధగా వినసాగారు.

"జంటిల్మెన్ అండ్ లేడీస్!

సరిగ్గా మూడు నెలల క్రితం భారత ప్రభుత్వంనుండి నాకు పిలుపు వచ్చింది.

ఎవరెస్టను అధిరోహించే బృందానికి నన్ను నాయకత్వం వహించమని ఆజ్ఞాపించారు. మొదట్లో నేను ఆశ్చర్యపోయాను. ఎవరెస్ట శిఖరాన్ని అధిరోహించడమంటే మాటలు కాదు. అది మన భారతదేశ గౌరవ ప్రతిష్టలను పణంగా పెట్టిచేసే సాహసకార్యం. ఏ మాత్రం విఫలమైనా, ప్రపంచ దేశాలమధ్య మనకు చిన్నతనంగా వుంటుంది.

ఆలోచించి చెబుతానని మాట యిచ్చాను.

వెంటనే నా గురుతుల్యులు, మిత్రులు సిన్హాగారిని కలుసుకొని సంప్రదించాను. ఆయనగారు ఆనాడు నాకిచ్చిన ప్రోత్సాహంతోనే, నేను ఎవరెస్ట అధిరోహించగలిగాను.

సిన్హాగారిని సంప్రదించిన వెంటనే, నా అంగీకారాన్ని తెలియచేశాను ప్రభుత్వానికి. వెంటనే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

పర్వతారోహణకు పూనుకోవడం చాలా కష్టమే గాక, మిక్కిలి వ్యయమైనదన్న విషయం మీకు తెలియనిది కాదు. మా సాహస యాత్ర పూర్తి కావడానికి మొత్తం ఆరులక్షల రూపాయలు ఖర్చయింది.

మా బృందంలో మొత్తం పదకొండు మంది సభ్యులం. ఆ పదకొండుమంది వరుసగా, నేను, మిష్టర్ దేవరాజ్, లాల్ ఖన్నా, కిరణ్ దాస్, జోగీందర్ సింగ్, రామదాసు, ప్రొఫెసర్ మూర్తి, డాక్టర్ హరేరామ్, కర్నల్ రెడ్డి, శ్రీమతి జుబేదా, కుమారి సంఘమిత్ర.

మొత్తం మా బృందంలో పదకొండుమందిమి గాక,

800 మందలమంది షెర్పా స్త్రీ- పురుషులను ఏర్పాటు చేసుకున్నాం. వారికి రోజుకు అయిదురూపాయలు కూలి. ఒక్కొక్కరు 27 కిలోల బరువును ఎత్తుకున్నారు. మొత్తం మా వస్తువుల బరువు 19 టన్నులు.

మే 6 వ తేదీన అంతా కలిసి బయలుదేరాం.

అయిదు రోజులకు మేమంతా 'ఖుంబు' లో ప్రవేశించాం. అక్కడ 1300 మీటర్ల ఎత్తు వుంటుంది. అక్కడ ఎండ బాగా మండిపోయేది. గాలి కనుక సరిగా వీచకపోతే, ఎండకు మా వొళ్ళు బొబ్బలు పొక్కేది. మేము ఒంటికి ఎన్నో క్రీమ్స్ రాసుకొనే వాళ్ళం. ఎండకు పెదాలు పగిలిపోయేవి. నవ్వుతున్నా, మాట్లాడుతున్నా, పగిలిన పెదాలు మంట పుట్టేవి ఇక పైకి ఎక్కుతున్న కొలదీ మేము స్పెషల్ స్పెట్స్‌ను తప్పనిసరిగా ధరించేవాళ్ళం. లేకపోతే అల్ట్రావైలెట్ కిరణాలు కళ్ళమీద పడితే గుడ్డితనం వస్తుంది.

పర్వతాలపై గంట కొక వాతావరణం వుండేది. ఓ క్షణంలో మండిపోయే ఎండ, మరుక్షణంలో గజగజ లాడించే చలి, మమ్మల్ని నిజంగా ఏడిపించేవి.

అయితే ఎప్పుడూ కూడా మా దగ్గర వాతావర్ణము నకు అనువైన దుస్తులను రెడీలో వుంచుకొనే వాళ్ళం.

మా ప్రయాణంలో ముఖ్యమైన మజిలీ 'త్యాంగ్ బోచ్', ఇది 3,900 మీటర్ల ఎత్తున వుంది. అక్కడినుండి ఎత్తైన పర్వతాలను చూడగలం.

అక్కడవరకు మా సామానులను చేరవేసిన వారి కందరికీ డబ్బులిచ్చి పంపేశాం. వారిలో బలంగా వుండి, కొంచం ఎత్తు ప్రదేశాలు ఎక్కడంలో అనుభవం గల వారిని ఓ 120 మందిని మాతో వుంచుకున్నాం. వీరు ఎవరెస్ట్ పర్వతంమీద ఒక్కొక్క మజిలీకి మా సామా

నును అంచెలంచెలుగా చేరవేసేవారు.

ముందుగా ఎవరెస్ట్ దిగువ రక్షణ మజిలీని చేరుకున్నాం. అక్కడనుండి మరో నాలుగురోజులు ప్రయాణం చేసి 'ఖుంబు' మంచునదిని దాటి ఎవరెస్ట్‌మీద మొదటి మజిలీని చేరుకున్నాం. అక్కడ కొన్ని రోజులు హాయిగా గడిపాం. ఇక అక్కడినుండే అసలైన ఎవరెస్ట్ శిఖరారోహణ ప్రారంభమవుతుంది.

ముందు ఎవరెస్ట్ శిఖరాన్ని చేరుకోవాలంటే, మంచి దారి కనుక్కోవాలి కదా! అందుకు కొంతమంది దళ సభ్యులు, షెర్పాలు ముందుకు పోయారు.

అక్కడ పెద్ద పెద్ద మంచు కొండలు దొంతరలుగా కన్పిస్తాయి. వాటి వెనుక మంచువాగులు ప్రవహిస్తూ వుంటాయి.

అప్పుడప్పుడు లోయలలో పేరుకుపోయిన మంచు కరిగి క్రిందకు ప్రవహిస్తూ వుంటుంది.

పైనుండి మంచు బండలు క్రిందకు జారుతున్నప్పుడు, చాలా జాగ్రత్తగా వుండాలి. లేకపోతే అవి ప్రాణాపాయం కలిగిస్తాయి. పైనుండి మంచు దిమ్మలు రాకెట్లు దూసుకువస్తున్నట్లు దూసుకువస్తాయి. అవన్నీ గుట్టలుగా ఓచోట పేరుకుపోతాయి. వాటినే మనం 'లేటరల్ మొరయిన్స్' అంటాం.

మంచు దిబ్బలు క్రిందకు జరిగే సమయంలో, ప్రయాణం చేసే దిక్కుకు అడ్డంగా నెరలు ఏర్పడతాయి. వీటి వెడల్పు 15 మీటర్ల గరిష్ట పరిమితి వరకు వుంటుంది. కొండలను ఎక్కేటప్పుడు నిజంగా యివే పెద్ద అడ్డంకులు. ఒకొక్కసారి నెరలమధ్య పల్చగా మంచు పేరుకుపోయి నెర కనబడదు. కానీ ఇది చాలా ప్రమాదకరమైనది. పొరబాటున మనం కాలు అక్కడ పెట్టామంటే,

నెర లోపలకు దిగిపోయి, మంచులో సమాధి అయిపోతాం.

అక్కడ పర్వతాలను ఎక్కడం చాలాకష్టం. అవి చాలా నిటారుగా వుంటాయి. అంతేకాదు పైనుండి ఎప్పుడు మంచువిరిగి క్రిందకు పడుతూనే వుంటుంది. ఒక్కొక్కసారి అకస్మాత్తుగా కొండచరియలు కూలుతూ వుంటాయి. అప్పుడు పెద్దబాంబు ప్రేలిన శబ్దం వస్తుంది. ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా, ఆ మంచుబండల క్రింద మన ఆనవాళ్లుకూడా దొరకవు.

గుట్టలుగా పోగయిన మంచుబండలను, మధ్యమధ్య అగాధాలవలె వుండే నెరలను దాటటానికి అల్యూమినియం నిచ్చెనలను, కొయ్యదుంగలను వుపయోగించేవాళ్ళం.

ముందు వెళ్తున్నవాళ్ళమంతా దారిపొడుగునా రంగు జండాలను పాతేవాళ్ళం. మా వెనుకవచ్చేవాళ్ళు, ఆ జండాలను గుర్తించి మమ్ములను అనుసరించేవాళ్ళు.

ఓసారి గొప్ప ప్రమాదం సంభవించింది. మా దళం యావత్తూ ప్రాణాలను కోల్పోయేవాళ్ళం. ఒకచోట మంచుకొండల మధ్య ఓ పెద్ద నెర ఏర్పడివుంది. దానిని దాటటానికి అల్యూమినియం నిచ్చెనను ఏర్పాటుచేశాం.

ఇక అంతా ఆ నిచ్చెనమీద మోకుసహాయంతో నెరను దాటసాగాం. అయితే దురదృష్టవశాత్తూ, మంచు బాగా కరిగి ఆ నెర పెద్దదయింది. అంతే పెళ్ళబీటుగా నిచ్చెన మొత్తం అగాధంలో కూలిపోయింది.

అయితే అదృష్టం మా పక్షానవుంది. అప్పటికి సగం మంది నెరదాటారు. మిగిలిన సగంమంది అగాధంలో పడిపోయినా, అంతా కలిపి కట్టుకున్న మోకువలన అగాధంలో పడినవాళ్ళం క్రిందకు జారిపోక అలాగే వ్రేలాడసాగాం. అలా వ్రేలాడిన వారిలో నేనూ

వున్నాను.

ఓ అరగంటపు అతికష్టంమీద మమ్మల్ని పైకిలాగారు.

ఇన్ని కష్టాలు వచ్చినా, మేము బాగానే పురోగమించాం. జూన్ 10 వ తారీఖున 5,900 మీటర్ల ఎత్తున మొదటి మజిలీ ఏర్పాటు చేసుకున్నాం.

ఇక ఎవరెస్ట్ శిఖరం ఎక్కడానికి మాకు ఎనిమిది వారాలు మాత్రమే వున్నాయి.

మరో మూడురోజులకు రెండవ మజిలీని చేరుకున్నాం. ఇది 6,000 మీటర్ల ఎత్తునవుంది. పశ్చిమ కూమ్‌నుండి మంచు జారడం యిక్కడే ప్రారంభమవుతుంది. మరో నాలుగు రోజులకు 6,400 మీటర్ల ఎత్తున వున్న ప్రదేశానికి చేరాం.

అక్కడ మాత్రం కొండ ఎక్కడం చాలాకష్టం. మెల్లగా ప్రాకుతూ ఎక్కాలి. అక్కడ ప్రాంతమంతా నిట్టనిలువుగా వుంటుంది. దానికే మనం 'ల్హోట్స్ఫేస్' అంటాం.

ల్హోట్స్ఫేస్ వద్ద గొడ్డళ్ళతో మంచును నరికి మెట్లుగా తయారుచేసుకొనే వాళ్ళం. పట్టుదొరకడానికి అక్కడక్కడ ఇనప మేకులుకొట్టే వాళ్ళం.

చిట్టచివరకు 8,000 మీటర్ల ఎత్తునవున్న 'సౌత్ కోల్'ను చేరుకొని అక్కడ ఓ స్థిరమైన గుడారం వేసుకున్నాం.

అప్పుడే వాతావరణం బాగా చెడిపోయింది. పెద్ద పెద్ద గాలులతోబాటు, మంచు తుఫాన్‌లా కురిసేది. అక్కడ మంచు తుఫానులు తగ్గేవరకు ఓ పదిరోజులు ఖాళీగా కూర్చుండిపోయాం.

వాతావరణం క్రమేపీ మెరుగుపడింది. వైర్‌లెస్ ద్వారా మాకు ఎప్పటికప్పుడు ఢిల్లీనుండి సమాచారం

అందుతూ వుండేది. మా కోసం ప్రత్యేకంగా ఆలిండియా రేడియోవారు రోజుకు అయిదుసార్లు వాతావరణ వివరాలు ప్రకటించేవారు.

జూలై 19 వ తారీకు ఎవరెస్టు ఎక్కడానికి చివరి ప్రయత్నాలు ప్రారంభించాం. అక్కడ మేము ముగ్గురు చొప్పున ఒక దళంగా విడిపోయాం. ప్రారంభ సన్నాహాలు పూర్తి చేసుకొని రెడీగా వున్నాం.

20వ తారీకు వాతావరణం బాగుపడింది. మాది మొదటి దళం. మా దళంలో నేనూ, డాక్టర్ హరేరాం, కుమారి సంఘమిత్ర వున్నాం. సౌత్ కోల్ వైపునుండి ఆరోహణ ప్రారంభించాం.

మేం ముగ్గురం కలిసి, ఓ నైలాన్ తాడును కట్టుకున్నాం. మాకు కావలసిన సామానంతా వీపుకు కట్టుకున్నాం. మూడు ఆక్సిజన్ సిలిండర్‌లు, నిమ్మరసం ఫ్లాస్కు, చేతులకు గ్లోవ్స్, కాళ్ళకు మేజోళ్ళు, నల్లద్దాల కళ్ళజోళ్ళు, స్వెట్స్, కెమెరా, టార్చి వగైరాలు అన్నీ అందుబాటులో అమర్చుకున్నాం. మొత్తం ఒకొక్కళ్ళం 25 కిలోల బరువు మోయవలసి వచ్చింది.

ముగ్గురం బయలుదేరాం. ఆక్సిజన్ సిలిండర్లు మూతికి బిగించుకొన్నందువలన మాకు మాట్లాడుకోవడానికి అవకాశం వుండేదికాదు. చుట్టూ మంచు విపరీతంగా కురుస్తోంది. ఎంతవరకు సైగలతోనే కాలం గడిపేవాళ్ళం.

ఇంకా 210 మీటర్లువుంది శిఖరం. చాలా నిదానంగా ప్రాకుతున్నాం. కొండబాగా ఏటవాలుగా వుంది. అడుగడుగునా జారిపోయేది. ప్రక్కన పెద్దపెద్ద అగాధాలు.

అంతలో హఠాత్తుగా వాతావర్ణంలో మార్పువచ్చింది. గాలి బాగా వీయసాగింది. ఆ గాలికి లేచిన మంచు మూలంగా దారి కనబడటం మానేసింది. ఆ పరిస్థితిలో

శిఖరాన్ని అధిరోహించడం వీలుబడదని అనుకున్నాం.

హారేరామ్ మా ముగ్గురిలో ముందు వున్నాడు. పైన వాతావరణం చాలా దారుణంగా వున్నట్లు సంజ్ఞ చేసి చెప్పాడు హారేరామ్. ముందుకు వెళ్ళడం కష్టమనికూడా సూచించాడు. ఏం చేద్దామన్నట్లు ప్రశ్నార్థకంగా చూశాడు.

ఓ రెండు నిమిషాలు ఆలోచించాను. అంతవరకు కష్టపడివచ్చి, వెనక్కు తిరగడానికి ప్రాణమొప్పలేదు. ప్రాణత్యాగానికైనాకూడా సిద్ధపడి పైకి సాగిపొమ్మని ఆజ్ఞాపించాను.

నిజంగా నేను ఆ సమయంలో తీసుకున్న నిర్ణయం చాలా ప్రమాదకరమైనది. శిఖరంపైకి ఎక్కేకొలది వాతావరణంలో విపరీతమైన మార్పులు వస్తాయి. నిజానికి మా ప్రాణాలకన్న గొప్పదికాదు శిఖరారోహణం. కానీ ఆ పరిస్థితి విచిత్రమైనది. మిక్కిలి ఉద్రేకపూరితమైనది. ఒక్క నా ప్రాణమేకాదు నా సహచరులిద్దరిప్రాణాలు కూడా సర్వతాలవ పణంగా బెట్టి ముందుకు సాగిపొమ్మని ఆజ్ఞ యిచ్చాను.

నా మాటమీద గౌరవంతో డాక్టర్ హరేరామ్, మిస్ సంఘమిత్రకూడా ఏం మాట్లాడలేకపోయారు. ఇక మేమంతా మా ప్రాణాలమీద ఆశవదులుకొని ముందుకు నడిచాం.

దిగువ మజిలీలో వున్నవారు క్రిందకు వచ్చేయమని పదేపదే హెచ్చరించసాగారు. మేం మా దృఢ నిశ్చయాన్ని మరోసారి పునరుద్ఘాటించి పైకి ప్రాకడం మొదలుపెట్టాం.

చివరకు జులై 29వ తేదీన విజయం సాధించాం.

చావుతప్పి కన్ను లొట్టపోయినా, ఎవరెస్ట్ శిఖరం మీద కాలుమోపాం. ఆ దిగ్విజయ వార్తను దిగువ మజిలి

లోని మిత్రులకు, సిన్హా గారికి, భారత ప్రభుత్వానికి వుత్సాహంగా వైర్‌లెస్ ద్వారా తెలియచేశాం.

నిజంగా ఆ శిఖరాన్ని అధిరోహించిన ఆ క్షణం ఎంతటి మహత్తరమైన అనుభూతిని కల్గించిందో నేను మాటలలో చెప్పలేను. మా శరీరాలన్నీ వుద్వేగంతో ఒక్కసారిగా కంపించాయి.

అక్కడ భారతదేశపు పతాకాన్ని ఎగురవేసి బిగ్గరగా 'జై భారత్' అని అరిచాం. మాలో మేం ఒకరినొకరు కౌగలించుకొని ముద్దులు పెట్టుకున్నాం. శిఖరంమీదనే ఒకరోజు పూర్తిగా రెస్ట్ తీసుకున్నాం. కెమరాలో రీల్స్ అయిపోయేంతవరకు స్నాప్స్ తీసుకున్నాం. మా గుర్తుగా అక్కడ కొన్ని వస్తువులను భద్రపరిచాం.

మరుసటిరోజు స్వీట్స్ తిని, నిమ్మరసం తీసుకొని బయలుదేరాం. మాకు క్రిందనుండి మిత్రుల అభినందనల పరంపర వైర్‌లెస్ సెట్‌లోనుండి వినబడుతోంది. వాళ్ళంతా మాకు ఉత్సాహాన్ని కల్గించడానికి పాటలు పాడసాగారు.

మెల్లగా దిగటం ప్రారంభించాం. దిగివచ్చేటప్పుడు కూడా చాలా శ్రమపడ్డాం.

చిట్టచివరకు ఆ భగవంతుని దయవలన క్షేమంగా దిగువ మజిలీని చేరుకున్నాం.

అక్కడ మా మిగిలిన మిత్రులు అంతా ఆనందోద్వేగాలతో మమ్మల్ని ఆలింగనం చేసుకొని హార్దిక స్వాగతం పల్కారు.

మా సాహసక్రియకు ఉత్తేజితులైన మరో బృందం కర్నల్ రెడ్డి నాయకత్వంలో ప్రొఫెసర్ మూర్తి, జాబేదాలు శిఖరారోహణకు తయారయ్యారు.

అయితే వాళ్లు బయలుదేరబోయే సమయానికి వాతావరణం విపరీతంగా చెడిపోయింది. 'వాతావరణ పరిస్థితి విషమిస్తోందని, మంచుతుఫాన్ రాబోతున్నదని, వెంటనే క్రిందకు ప్రయాణమవ్వమని' ఢిల్లీనుండి వైర్‌లెస్ మెసేజ్ వచ్చింది.

పాపం మా మిత్రబృందమంతా ఎంతో నిరుత్సాహాన్ని పొందింది.

అంతా కలిసి క్రిందకు ప్రయాణమయ్యాం.

మా తిరుగుప్రయాణంలో ఒకగొప్ప విశేషం జరిగింది. నిజంగా అది ఒక మరపురాని సన్నివేశం. అలాంటి దృశ్యం ఎదురవుతుందని మేం కలలోగూడా వూహించలేదు.

ఆ రోజు సరిగ్గా సౌత్ కోల్ నుండి దిగువ మజిలీని చేరుకోబోతున్నాం. అంతలో ఇంతవరకు ప్రపంచంలో ఏ మానవుడు చూడని దృశ్యాన్ని మేం చూశాం. ఆ హిమవత్పర్వత సానువుల్లో మాకు అపూర్వమైన మంచు మనిషి సాక్షాత్కరించాడు.

హిమవత్పర్వత సానువుల్లో మానవులు చొరలేని ప్రదేశాలలో కొన్ని భయంకరమైన జంతువులు విహరించేయని మనకు కొన్ని గ్రంథాలు చెబుతున్నాయి. అయితే దీనికి సాక్ష్యాధారాలు బహుస్వల్పం.

మొదట్లో మేం భ్రమపడ్డామేమోననుకున్నాం. కానీ జరిగినది యథార్థమని తెలిసిన తరువాత మా ఆశ్చర్యానికి మేరలేకపోయింది.

ఆ రోజు అంతా టిఫిన్ చేసి సుడారాలలో విశ్రాంతి తీసుకొంటున్నారు. నేనూ, మిసెస్ జుబేదా కెమేరాలు తీసుకొని బయటకు వచ్చాం. రమణీయమైన ప్రకృతిని కెమేరాలలో బంధిస్తూ చాలాదూరం నడిచాం.

ఒకచోట హఠాత్తుగా ఆగిపోయాము. క్రింద మంచు మీద పెద్దపెద్ద పాదముద్రలు కన్పించాయి. ఒక్కసారి ఆశ్చర్యపోయాం. ఆ పాదం కొలత షుమారు రెండడుగులు వుంది. సామాన్యంగా మనిషి పాదం ఏడునుంచి ఎనిమిది అంగుళాలు వుంటుంది. మరి ఆ అడుగులు ఎవరివి?

ధైర్యం చేసి ఆ అడుగులను అనుసరించాం. కొద్దిదూరం నడిచేసరికి ఆ అడుగులు మాయమయ్యాయి. గబగబ సాధ్యమయినంతవరకు ఆ అడుగులను ఫోటోలు తీశాం.

తరువాత యీ విషయమంతా మా బృందంతో ముచ్చటిస్తే, అంతా నవ్వారు. అదేదో మంచు మృగమయి వుంటుందని అన్నారు. కానీ నా అనుమానం నివృత్తి కాలేదు. ఆ పాదముద్ర సరిగ్గా మనిషి పాదముద్రనే బోలివుంది. కాకపోతే పరిమాణంలో పెద్దది.

నేను అది జంతువుకాదని, మనిషి అయివుండాలని వాదించాను. కానీ నా వాదన నెవరూ లక్ష్యపెట్టలేదు. అయితే కర్నల్ రెడ్డి మాత్రం నాతో ఏకీభవించి, ఆ అడుగుల తాలూకు ప్రాణిని కనుగొనడానికి నాతో సిద్ధమయ్యాడు.

ఆ రాత్రి మేం నిద్రపోలేదు. టార్చిలైట్లు తీసుకొని ఇద్దరం బయలుదేరాం.

దాదాపు మూడుగంటల అన్వేషణ పిదప మా శ్రమ ఫలించింది. ఓ మంచుదిమ్మ ప్రక్కనే ఏదో ఆకారం కన్పించేసరికి, టార్చిఫోకస్ అటువైపు తిప్పాము.

అంతే, ఆ ఆకారాన్ని చూసి అదిరిపోయాం.

అచ్చు మనిషిలా వుందా ఆకారం. అతని శరీరమెంతో పెద్దది. దాదాపు పదకొండు అడుగుల ఎత్తువుండవచ్చు. చేతులు చాలా పొడుగైనవి. మెడమాత్రం సన్నగా వుంది. శరీరమంతా దట్టమైన వెంట్రుకలతో కప్పబడి

వుంది. వెంట్రుకల పొడవు దాదాపు ఏడు అంగుళాలు వున్నాయి. ఆ ఆకారం శరీరమంతా బూడిదరంగులో వుంది. ముఖకవళికల ప్రకారం, చప్పిడిముక్కు, దూసుకు పోయే చిన్న కళ్లు, విశాలమైన నుదురు ప్రత్యేకతను కల్గి స్తున్నాయి. ఖాతీ దాదాపు ఓ మీటరు పొడవుంది. తోక ఏమైనా వుందేమోనని పరిశీలనగా చూశాం. ఏమీ లేదు.

మా టార్చ్ వెలుగు ఒక్కసారి అతనిపై పడగానే, మంచుమనిషి అదిరిపడి లేచి మావైపు తిరిగాడు. అతను మావైపు సూటిగా చూశాడు. అప్పుడతని ముఖభంగిమలు అచ్చు మనిషి ముఖభంగిమలను పోలి వున్నాయి. అతను మమ్మల్ని చూసి, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళి పోయాడు.

అతను వెళ్ళిపోయిన తరువాత మేం చేసిన పొరబాటు గుర్తుకు వచ్చింది. మేం వచ్చేటప్పుడు కమేరా తెచ్చి వుంటే, మంచుమనిషిని ఫోటో తీసి వుండేవాళ్ళం. మంచి ఛాన్స్ తప్పింది.

ఇద్దరం గూడారాన్ని చేరుకున్నాం. ఈసారి మా మాటలను కొంచం విశ్వసించారు. మనిషి ఆకారంలో వుంది కాబట్టి ఆ ప్రాణిని 'మంచుమనిషి'గా సంబోధించ సాగాం.

మంచుమనిషి మళ్ళీ కనబడతాడేమోనని దాదాపు మూడురోజులు ఎదురుచూశాం. లాభంలేకపోయింది. చివ రకు విసుగుచెంది క్రిందకు ప్రయాణమయ్యాం. నాకు మాత్రం మంచుమనిషిని మరోసారి చూడాలనేవుంది.

అంతా కలిసి కొంతదూరం ప్రయాణించాం. అప్పుడు వుదయం ఎనిమిది గంటలయింది. హఠాత్తుగా ఓ చోట ఆగిపోయాను. ఎదురుగా నేను ఎదురుచూసే అద్భుతం

నిలబడివుంది. మంచుతో కప్పబడిన ఓ పెద్ద ఆకారం నాకు కన్పించింది.

వెంటనే అందరికీ సైగ చేసి చూపించాను. అంతా ఆ మంచుమనిషిని చూసి ఆశ్చర్యపోయారు.

అంతలో గుర్తువచ్చింది. చటుక్కున ఫ్లాష్ కెమేరా తీసి క్లిక్ మనిపించాను.

అప్పటివరకు మావైపు ఆశ్చర్యంగా చూస్తున్న ఆ మంచుమనిషి ఫ్లాష్ వెలుగు పడగానే, గిరుక్కున వెనక్కు తిరిగి కైలాస ప్రర్వత శ్రేణిలోకి నడిచిపోయాడు.

అంతా మంచుమనిషిని కనిబెట్టినందుకు నన్నెంతో పొగిడారు. మంచుమనిషి గురించి వూహాగానాలు చేసుకుంటూ క్రిందకుదిగాం క్షేమంగా.

క్రిందకు విజయవంతంగా దిగిన మాకు సిన్హాగారు ఘనమైన స్వాగతం పల్కటం, తరువాత నాకు బిరుదు నిచ్చి గౌరవించడం, అంతా మీకు తెలిసిందేకదా!

ఇప్పటివరకు మీ అందరిముందు నా యాత్రావిశేషాలు వివరించడానికి తగిన అవకాశాన్ని కలిగించిన సిన్హాగారికి, శ్రద్ధగావిన్న మీకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. శెలవ్."

తన సుదీర్ఘ వుపన్యాసాన్ని ముగించి కుర్చీలో కూర్చున్నారు ప్రొఫెసర్ దయాళ్.

హాలు అంతా కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

ప్రిన్సిపాల్ సిన్హాగారు, మిగిలిన పర్వతారోహకు లందర్నీ పేరుపేరునా సభికులకు పరిచయం చేశారు.

## 3

"గుడ్ మార్నింగ్ సర్."

"మార్నింగ్. కమాన్ బోయ్" నవ్వుతూ ఆహ్వానించారు ప్రిన్సిపాల్ సిన్హా.

బ్రిగేడియర్ జైల్‌సింగ్ గంభీరంగా లోపలికి ప్రవేశించి, ప్రిన్సిపాల్‌కు ఎదురుగావున్న మరోకుర్చీలో కూర్చున్నాడు.

"ప్రొఫెసర్ దయాళ్, మీట్ మిస్టర్ జైల్‌సింగ్, బ్రిగేడియర్" పరిచయం చేశారు సిన్హా.

"గ్లాడ్ టు మీట్ యు సర్" షేక్‌హాండిచ్చాడు సింగ్.

"సేమ్ టు యు" చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"వాట్ మై బోయ్, ఏమిటి విశేషాలు? ఇంకా ఎన్ని రోజులు నీకు శెలవుంది?"

"మరో అయిదురోజులు వుంది సర్. ఇంకా రెండు నెలలు శెలవ్‌ను పెంచుదామని చూస్తున్నాను."

"ఎందుకు? ఎక్కడికన్నా టూర్ ప్రోగ్రాముందా?"

"ఎస్ సర్. అందుకు మీ సలహా, ప్రొఫెసర్‌గారి సహాయం నాకు కావాలి."

చిన్నగా నవ్వారిద్దరూ.

"హిమాలయాల్లోని సౌత్‌కోల్ వరకు ఓసారి వెళ్ళి రావాలనివుంది సర్. మంచుమనిషి గురించిన స్పష్టమైన వివరాలు సేకరించాలి" చెప్పాడు సింగ్.

"మంచుమనిషి గురించా?" ఆశ్చర్యంగా ముందుకు వంగాడు ప్రొఫెసర్.

"అవును సర్. మీరు నిన్న మీ ఎవరెస్ట్ శిఖరారోహణ గురించి చెబుతూ, మంచుమనిషి గురించి తెలియచేశారు గుర్తుందా? అప్పటినుండి ఆ మంచుమనిషి గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాను. నిన్న మా మిలటరీ చీఫ్ తోనూ, ప్రభుత్వాధికారులతోనూ ట్రంక్‌ఫోన్‌లో చర్చించి, చివరకు వారి సలహాపై ఒక నిర్ణయానికి, అంటే మంచుమనిషి గురించి పూర్తివివరాలు సేకరించా

అని నిర్ణయించుకున్నాను."

"మెడియర్ బ్రిగేడియర్" చిన్నగా అన్నారు సిన్హా. "మంచుమనిషిగురించి హఠాత్తుగా నీకు ఎందుకు ఇంట్రెస్ట్ కలిగింది? అందులోనూ దీనిగురించి ప్రభుత్వాధికారులను సంప్రదించవలసిన అవసరం ఎందుకు కలిగింది?"

చిన్నగా నవ్వాడు జైల్‌సింగ్.

"ప్రొఫెసర్ దయాళ్ గారు మంచుమనిషి గురించి చెప్పినప్పుడు నాకు ఓ అనుమానం వచ్చింది. మంచు మనిషి ఆకారం,అతని చేష్టలు నా అనుమానాన్ని మరింత బలపరిచాయి. నా అనుమానం ప్రకారం హిమాలయాలపై పెద్ద కుట్ర జరుగుతోంది. మనదేశ క్షేమానికి అది గొడ్డలి పెట్టువంటిది."

"వాట్?" అదిరిపడ్డాడు ప్రొఫెసర్ దయాళ్.

"మంచు మనిషి మనదేశానికి అపాయం తల పెడతాడా?"

"అవును సర్. నా అంచనాల ప్రకారం ఆ ఆకారం మంచుమనిషి రూపంలోవున్న కృత్రిమ రసాయనిక యంత్ర మానవుడు. ఇదంతా చైనా పన్నాగమని నాఅనుమానం. మెడియర్ సర్స్, చైనా మనకు బద్ధశత్రువు. అనుక్షణం మన పతనాన్ని వాంఛించే చైనా, ఆ పతనం కొరకు అనేక మార్గాలద్వారా ప్రయత్నిస్తున్నది. ఇటీవలచైనా తన గూఢచారి చర్యలను విస్తృతం చేసింది. మీకు హిమాలయాలపై కనబడిన ఆ మంచుమనిషి ఎటువంటి జంతువుకాదని, అది మనదేశ భద్రతకు సంబంధించిన విషయాలు సేకరించడానికి చైనా వినియోగించే రాడార్ మనిషి అని నా ప్రగాఢ అభిప్రాయం."

"వాట్ మై బోయ్, రాడార్ మనిషా?" విస్తుపోతూ అడిగారు సిన్హా.

"అవును సార్. ఈ ఆధునిక యంత్ర యుగంలో రాడార్ మనిషి అంటే పెద్ద విచిత్రమేమీ లేదు. మనిషి ఆకారంలో సంచరిస్తూ పరిసరాలకు సంబంధించిన విషయాలను సేకరించి రిసీవింగ్ స్టేషనుకు వార్తలు పంపే రాడార్ యంత్రమన్నమాట!"

"నో. నేను నమ్మలేకపోతున్నాను" ఆశ్చర్యంగా అన్నాడు ప్రొఫెసర్ దయాళ్.

"కళ్ళారా చూసిన మీరు యీ విషయం నమ్మలేరు సర్. అది సహజం. నిన్న నా అనుమానాన్ని మా చీఫ్‌కు తెలియచేశాను. వెంటనే చీఫ్ ఎస్. బి. డి.ని సంప్రదించారు. అంతా సావకాశంగా పరిశీలించిన తరువాత సీక్రెట్ బ్రాంచ్ డైరెక్టర్ నా అనుమానాన్ని అంగీకరించారు. తమ బ్రాంచ్‌కు గూడా, చైనా మన దేశంలో అతినైపుణ్యంగా గూఢచారి చర్యలు సాగిస్తున్నట్లు సమాచారం వచ్చిందట. మంచుమనిషిపై నాకీ అనుమానం కలిగినందుకు నన్నభినందిస్తూ వెంటనే కార్యాచరణకు పూనుకొమ్మని మా చీఫ్ ద్వారా ఆదేశం పంపించారు."

"బ్రిగేడియర్, నీమాట కాదనలేకపోతున్నాను. కానీ మంచుమనిషి వెనుక యింతటి చరిత్ర వుంటుందని వూహించలేకపోతున్నాను. విష్ యు బెస్టాఫ్ లక్" అన్నారు సిన్హా.

"థాంక్యూ సర్. నాకు కావలసిన సాధన సామగ్రినంతా మన ఇన్‌స్టిట్యూట్ నుండి తీసుకోమన్నారు. మీకు త్వరలోనే ఆర్డర్స్ పంపిస్తామన్నారు. కాబట్టి యీ విషయంలో మీరు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని మాకు తోడ్పడాలి" చెప్పాడు జైల్‌సింగ్.

"విత్ ప్లెజర్. అదీగాక యీసారి ప్రయాణ సన్నా

హాలు చాలా తేలిక. ఎందుకనంటే, మొన్ననేగా ప్రొఫెసర్ దయాళ్ బృందానికి ఏర్పాట్లు చేసింది. వాటిలో చాలావరకు మళ్ళీ మీకు వుపయోగపడతాయి.''

''థాంక్యూ సర్.''

''ప్రొఫెసర్ జీ'' పిలిచాడు సింగ్.

''వాట్ మిస్టర్ సింగ్?''

''మీకు అభ్యంతరం లేకపోతే, మిమ్మల్ని మరోసారి వుపయోగించుకొమ్మని మా చీఫ్ చెప్పారు. ఇప్పుడు నాకు సహాయంగా సీక్రెట్ బ్రాంచ్ నుండి స్పెషల్ ఏజంట్ ఒకరు వస్తారు. మీరుగూడా మా వెంట వస్తే చాలా బావుంటుంది.''

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ దయాళ్.

''డియర్ బ్రిగేడియర్, నీ వుత్సాహం, మంచుమనిషి గురించి నీ వూహాగానాలు వింటుంటే నాకూ వద్దామని ఎంతో వుత్సాహంగావుంది. కానీ అది అసాధ్యం. నేను ఎవరెస్టు నధిరోహించి పూర్తిగా నెలగూడా కాలేదు. ఇప్పుడు మళ్ళీ పర్వతాలను ఎక్కడమంటే చాలాకష్టం. శారీరకంగా నాకు పూర్తి విశ్రాంతి కావాలి. కాబట్టి నేను రాలేను.''

''బాడ్ లక్ సర్. మీ సహకారం నాకు చాలా కావాలి. మంచుమనిషి ఫోటో, మరికొన్ని వివరాలు కావాలి.''

''అలాగే. తప్పకుండా యిస్తాను.''

''మిష్టర్ సింగ్, మొత్తం ఎంతమంది వెళ్దామని నిశ్చయించుకున్నారు?'' అడిగారు సిన్హా.

''మొత్తం ముగ్గురం వెళ్దామని నిశ్చయించుకున్నాం సర్. స్పెషల్ ఏజంట్ యోరోజా వస్తారు. అతను మీకు తెలిసేవుంటాడు. మన ఇన్స్టిట్యూట్ లో శిక్షణ

పొందినవారిలో కొద్దిమంది, ఎస్. బి. లో కూడా ప్రవేశించారుకదా! ఇకపోతే మూడవవ్యక్తిని మీరు నిర్ణయించండి."

ఓ నిముషం ఆలోచించారు సిన్హాగారు.

"మిస్టర్ సింగ్, జయాల్ నీకు తెలుసుకదా?"

"మిష్టర్ జయాల్! ఆఁ తెలుసు. నన్ను హోటల్ నుండి యిక్కడకు తీసుకువచ్చిన వ్యక్తేకదా?"

"ఎస్ కరెక్ట్. జయాల్ మంచి చురుకుదనం గలవాడేగాక సాహసికుడుకూడా. అతనికి పర్వతారోహణ అంటే చాలా ఇంట్రస్టు. అతనినికూడా తీసుకువెళ్ళండి."

"అలాగే సర్" అన్నాడు జైల్ సింగ్.

# 4

"నా పేరు జైల్ సింగ్. బ్రిగేడియర్ను" తనకు కావలసిన వ్యక్తి ప్లేన్ దిగగానే దగ్గరకు వెళ్ళి పరిచయం చేసుకున్నాడు.

"గ్లాడ్ టు మీట్ యూ. నా పేరు నరీందర్ కుమార్. స్పెషల్ ఏజంట్ను. నరీందర్ అని పిలవండి" చిన్నగా చెప్పాడు.

నరీందర్ను పరీక్షగా చూశాడు సింగ్.

సన్నగా, ఎత్తుగా, రివటలా వున్నాడు. స్ట్రిచ్ లిన్ సూట్ ధరించాడు. కాళ్ళకు పాయింటెడ్ షూస్, కళ్ళకు గ్రీన్ గాగుల్స్ మెరుస్తున్నాయి.

"రండి" ఎయిర్ పోర్ట్లోని రెస్టారెంట్లో ఫ్యామిలీ రూంలోకి దారితీశాడు జైల్ సింగ్.

ఇద్దరూ స్క్వేర్ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

"ఏం తీసుకుంటారు?" అడిగాడు బ్రిగేడియర్.

"ఏనీ హాట్ డ్రింక్" చెప్పాడు నరీందర్.

"లార్జ్ స్కాచ్ విస్కీ బాటిల్, ఐస్ క్యూబ్స్" ఆర్డరిచ్చాడు.

మరుక్షణంలో టేబిల్ మీద ప్రత్యక్షమయ్యాయి.

రెండు గ్లాసులనిండా ఐస్ క్యూబ్స్ వేసి, విస్కీ పోశాడు. తెల్లగా నురుగువచ్చింది.

నరీందర్ కు ఒకటి ఆఫర్ చేసి తనొకటి తీసుకొన్నాడు.

"మంచుమనిషి గురించి వివరంగా చెప్పండి" విస్కీ చప్పరిస్తూ అడిగాడు.

గ్లాసు ఖాళీచేసి మరికొన్ని ఐస్ క్యూబ్స్ వేసుకొని విస్కీ వంచుకున్నాడు బ్రిగేడియర్.

"హిమత్పర్వత సానువుల్లో ఎవరెస్టు కశ్మైదారిలో 8,000 మీటర్ల ఎత్తులోవుంది సౌత్ కోల్ ప్రాంతం. ప్రొఫెసర్ దయాళ్ బృందం ఎవరెస్టు శిఖరారోహణ పూర్తి చేసుకొని క్రిందకు దిగివస్తూ సౌత్ కోల్ వద్ద టెంట్ వేశారు. ప్రొఫెసర్, మిసెస్ జుబేదాలు ప్రకృతిసందర్శనానికై బయటకువచ్చి అటూయిటూ తిరుగుతున్న సమయంలో వారికి పెద్ద పెద్ద పాదముద్రలు కన్పించాయి. అవిచూచి వాళ్ళు ఆశ్చర్యపోయి ఆ అడుగులను ఫోటో తీశారు. ఆ పాదముద్ర కొలత దాదాపు రెండడుగులు వుంది. ఆ పాదముద్రలను ఆధారంగా తీసుకొని ప్రొఫెసర్, కర్నల్ రెడ్డి అన్వేషణ ప్రారంభించారు. ఆ అన్వేషణలో వారికొక వింత ఆకారం కనబడింది. ఆ ఆకారాన్ని ఫోటో తీశారు చాకచక్యంగా.

"ఆ ఫోటో మీ దగ్గర వుందా?"

"ఆఁ" జేబులోనుండి రెండు ఫోటోలు తీసి టేబుల్ మీద పెట్టాడు సింగ్.

ఆ ఫోటోలను పరిశీలనగా చూస్తూ "ఇంకా మంచుమనిషి వివరాలు చెప్పగలరా?" అడిగాడు నరీందర్.

"మంచుమనిషి ఎత్తు పదకొండు అడుగులు. పొడవైన చేతులు, సన్నని మెడ అతని ప్రత్యేకత. శరీరమంతా దట్టమైన వెంట్రుకలతో నిండివుంది. చప్పిడి ముక్కు, చిన్న కళ్లు, విశాలమైన నుదురు కలిగి వున్నాడు. అతని ఛాతీ దాదాపు మోటుగా పొడవుంది."

"దట్సాల్. మంచుమనిషి గురించి యీ వివరాలు చాలు. ఇక మనం పరిశోధన ప్రారంభించవచ్చు."

"ఈ వరసబట్టి మంచు మనిషిమీద మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు సింగ్.

"సారీ, వూహాజనితమయిన అభిప్రాయాలు స్పష్టమైనవి కావు. తగిన ఆధారాలు లభించనిదే ఏమీ చెప్పలేను" బాటిల్లో మిగిలింది గ్లాలో వంచుతుంటూ చెప్పాడు నరీందర్.

"దట్స్ గుడ్!" ఎగ్రీ అయ్యాడు సింగ్.

"మిష్టర్ సింగ్, ముందుగా సిన్హాగారినీ, ప్రొఫెసర్ దయాళ్ గారినీ కలవాలి. పదండి" తన సీటులోనుండి లేచాడు స్పెషల్ ఏజంట్ నరీందర్.

బిల్ చెల్లించి రెస్టారెంట్ నుండి బయటపడ్డా రిద్దరూ.

# 5

సెప్టెంబర్ 1వ తేదీ.

సిన్హా, జైల్‌సింగ్, నరీందర్, జయాల్ అంతా కారులో జయనగర్ బయలుదేరారు. కారువెనకే సామానులతో ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన వాన్ బయలుదేరింది.

కారు జయనగర్ చేరేసరికి, అక్కడ షెర్పాల నాయకుడు ఫ్రొండోప్ అందరకూ స్వాగతంపల్కి, చక్కని ఆతిధ్యం యిచ్చాడు.

అంతకుముందే సిన్హాగారి వర్తమానం అందుకున్న

ఖోండ్రోప్ కందమంది షెర్పాలతో పర్వతారోహణకు రెడీగా వున్నాడు.

అంతా భోజనాలు ముగించి బయలుదేరారు.

మొత్తం సామానులు రెండు టన్నుల బరువుంటుంది. అన్నీ 20 కిలోల బంగీలుగా సర్దారు. ఒకొక్క షెర్పా ఒకొక్క బంగీ అందుకున్నాడు.

"సర్, మమ్మల్ని ఆశీర్వదించండి" చిన్నగా తలవంచి అన్నారు ముగ్గురు పరిశోధకులూ.

గంభీరంగా నవ్వారు సిన్హా.

"మైడియర్ యంగ్ బాయిస్, మంచుమనిషి మర్మాన్ని ప్రపంచానికి తెలియచేసి, భారతదేశం పేరు ప్రతిష్టలను మరోసారి జగద్విదితం చేయండి. విష్ యూ ఆల్ సక్సెస్" అందరితో కరచాలనం చేస్తూ విష్ చేశారు సిన్హా.

"థాంక్యూ సర్!" ముక్తకంఠంతో పల్కి ముందుకు సాగారు ముగ్గురూ.

షెర్పాలబృందంగూడా జట్లుజట్లుగా చీలి పరిశోధకుల ముగ్గుర్నీ అనుసరించింది.

జయనగర్ వదిలిపెట్టి వారం రోజులయింది.

ఏరోజు కారోజు నరేందర్ తమ బృందం ప్రోగ్రెస్‌ను ఎస్. బి. డి. కి, సిన్హాకి వైర్‌లెస్‌లో తెలియచేస్తూనే వున్నాడు.

ఈ వారం రోజులలోనూ మంచుమనిషి గురించి మరి కొన్ని వివరాలు తెలిశాయి.

మార్గమధ్యంలో అక్కడ నివశించే లింబూ, రాయి, తమంగా మొదలగు తెగలవారిని స్నేహం చేసుకుంటూ మంచుమనిషి గురించి ఆరాతీయసాగారు.

అక్కడి తెగల వారంతా బౌద్ధమతానికి చెందిన వారు. వారిలో భక్తి ప్రవృత్తి, అతిథి మర్యాద అధికం.

ఎంగేజ్ మెంట్ ఉంది."

"అలాగే. రాగిణి హత్యకేసులో మీరు ఎవరినన్నా అనుమానిస్తున్నారా?"

"లేదు!"

"హోటల్ మెజెస్టిక్‌లో పనిచేసే బేరర్ ఆమెను కాల్చి చంపాడనటానికి నేనే సాక్ష్యం. అతడు మీకు తెలుసా?"

"నేనూ రాగిణీ ఆ హోటలుకు తరుచూ వెళుతూ ఉండేవాళ్ళం. వాడు మాతో చనువుగానే ఉండేవాడు. కాకపోతే అ 'బిచ్'వాడితో గూడ సంబంధం పెట్టుకుం దేమో అని నా అనుమానం. ఈ క్లాస్ హోటల్స్‌లో పనిచేసే వాళ్లు భాగ్యవంతులయిన నడివయసు వాళ్ళను పట్టేస్తుంటారు. తీరా అది కొన్నాళ్ళు పోయాక మరొక డితో పోతే వాళ్ళకు అక్కసు. అదే కారణంతో కామేశ్వరరావు చంపి ఉండచ్చు."

"బైదిబై! మీ నూతన వివాహ ప్రయత్నానికి ఆమె ఆటంకం కావచ్చు అనే తలంపుతో మీరే ఆమెను మరొకరిచేత హత్య చేయించారంటే! దీనికి మీ సమా ధానం ఏమిటి?!"

కాశీనాథ్ ముఖం కోపంతో జేవురించింది. "వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్! నా తరఫున నియమించు కున్న డిటెక్టివ్ నన్నే అనుమానించటమా!" అని అరి చాడు.

"ఒక వేళ పోలీసులే మిమ్మల్నా ప్రశ్న వేశారనుకోండి! అప్పుడేం చెబుతారు?" బెదిరిపోకుండా అడిగాడు రామ్మూర్తి.

అతడు శాంతపడ్డాడు.

"నాకు రాగిణిని హత్య చేయించే పనిలేదు! అడ్డే

నేను చెప్పబోయే సమాధానం!"

"అఫ్‌కోర్స్! మీకు శ్రమ కలిగించాను. థ్యాంక్స్! మళ్ళీ కలుద్దాం!" అంటూ రామ్మూర్తి లేచాడు.

# 6

రోడ్డుమీద నడుస్తూ సిగరెట్ వెలిగించుకుని తల పైకెత్తాడు రామ్మూర్తి.

రోడ్డు మలుపులో టెలిఫోన్ బూత్ కనుపించింది ఎదురుగా.

వాచీ చూసుకున్నాడు. తను ఇన్‌స్పెక్టర్ రాజారావుని కలుస్తానని చెప్పాడు. ఎందుకయినా మంచిది ఒకసారి ఫోన్‌లోనన్నా కాంటాక్ట్ చేస్తేనో! బూత్‌లోకి నడిచి కాయిన్ ఇన్సర్టు చేసి మౌత్‌పీస్‌లో "హలో" అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్ రాజారావు స్పీకింగ్!"

"నమస్తే సార్! నేను రామ్మూర్తిని మాట్లాడుతున్నాను."

"వాట్ న్యూస్ మైడియర్ జంటిల్‌మన్!"

"కామేశ్వరరావు ఆచూకీ ఏమన్నా దొరికిందా?"

"లేదు! హోటల్ మెజెస్టిక్‌కి కాపలాగూడ పెట్టాం వాడు అక్కడికి వస్తే పట్టుకోటానికి!"

"నేనుగూడ వాడికోసం వెతుకుతున్నాను!"

"ఓకే! వాడెక్కడ కనబడ్డా వెంటనే మాకు తెలియజేయడం మరిచిపోవద్దు."

"అలాగే సార్! తర్వాత రామదాస్ హత్యకేసులో ఒక సమాచారం కావాలి సార్!"

"ఏమిటది?"

"అతడి కేసులో అనుమానితుల్నెవరినన్నా అరెస్టు చేశారా?"

"లేదు! అనుమానితులెవరూ లేరు!"

"థ్యాంక్స్ సార్! సీ యూ ఎగైన్!" రిసీవర్ పెట్టేశాడు.

రామ్మూర్తి కళ్ళల్లో భుజంగం మెదిలాడు. మనిషి బలిష్ఠంగా నల్లగా ఉంటాడు. కోరమీసాలు, ఎర్ర లుంగీ, తెల్ల బనీను, మెడకు తాయెత్తు ఉంటుంది. వాడు ఎప్పుడూ డీలక్స్ హోటల్ దగ్గర తిరుగాడుతుంటాడు.

డీలక్స్ అనేది ఇరానీ హోటల్. అక్కడ తను ఒకసారి టీ త్రాగుతుండంగా భుజంగరావ్ వచ్చాడు. సుష్టుగా తిని మూడు రూపాయలు బిల్లు చేశాడు. బిల్లు చెల్లించకుండానే బయటకు పోబోయాడు.

హోటలువాడు గట్టిగా డబ్బు అడిగి నిలవేశాడు. వాడు చేయిమడిచి తన కండరాల్ని ప్రదర్శించాడు.

"నీ కండలకూ, గుండెలకూ భయపడేది లేదిక్కడ!" అంటూ హోటలువాడు ఏవో పేర్లు పిలిచాడు.

లోపల్నుంచి వస్తాదుల్లాంటి నౌకర్లు పరుగెత్తుకొచ్చారు అడ్డపంచెల్ని పైకి ఎగలాక్కుంటూ.

ఇక్కడేదో స్టంటు జరగబోతోంది, చూద్దాం అని జనం చాలా మంది పోగయారు.

భుజంగం వాళ్ళిద్దర్నీ చూసి కొంచెం జంకాడు. కాని తను భయపడిపోయినట్టు ప్రజలు గమనిస్తే ఆ పేటలో తననుచూసి ఇకపైన పసిపిల్లవాడుగూడా ఝడవడు. అందుకే పైకి బింకంగా హుంకరించాడు. సై అన్నట్టు ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు ఇద్దరు వస్తాదులూ.

హోటలు ఓనరు ఇక్కడ సీన్‌ని చూసి బెదిరిపోయాడు. తన ఇద్దరి వస్తాదుల్నీ చూసి భుజంగరావు భయపడిపోయి డబ్బులిచ్చేస్తాడని ఆశపడ్డాడు. కాని ఆ సూచనలేవీ కనిపించకపోయేసరికి ఓనరే వెనక్కు తగ్గాడు. బిల్లు

ఇవ్వకపోతే మూడు రూపాయలే నష్టం.

ఇక్కడ గలాటా జరిగితే కుర్చీలు విరిగిపోతయ్. బిస్కెట్ సీసాలు పగిలిపోతయ్. కప్పూ సాసర్లు చితికిపోతయ్. అప్పుడు నష్టం కనీసం మూడువందలు అవుతుంది.

అందుకే తనవాళ్ళని ఆగమని సైగ చేశాడు.

"హిద్దో! భుజంగం భాయ్! హింతడ్ వకూ వదిలేస్తుండం! ఇక ఎప్పుడూ హిలా చేయకు! ఈ బిల్లు మూడు రూపాయలూ సాయంత్రానికి హిచ్చెయ్యి! తెలిసిందా! ఇక జావ్!" అన్నాడు వాడు.

భుజంగం మీసాలు దువ్వుకుంటూ వస్తాదులవంకా, చుట్టూ చేరిన ప్రేక్షకులవంకా గర్వంగా చూసుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు. అప్పటిదాకా ఈ గొడవనంతా ఆసక్తిగా చూస్తూన్న వాళ్ళల్లో రామ్మూర్తి కూడ ఉన్నాడు. అందువల్లనే కాశీనాథ్ భుజంగం పేరు చెప్పంగానే అతడ్ని అలవోకగా పోల్చుకున్నాడు. వాడ్ని కలుసుకుంటేగాని అసలు సంగతి బయడపడదు.

డీలక్స్ హోటల్లో కూర్చుని చికెన్ ఫ్రైకి ఆర్డరిచ్చాడు రామ్మూర్తి.

"భుజంగం అని ఆ కోరమీసాలవాడు వచ్చాడా ఇవాళ?" అని సర్వర్ని అడిగాడు.

"వాడివాళ రాలేదుసార్! ఎవడ్నన్నా డబాయించి రెండు రూపాయలు గుంజినరోజున వాడిక్కడకు వస్తాడు. ఆ రెండూ ఎక్కడా దొరక్కపోతే వాడు ఇక్కడ గైర్ హాజర్!"

"వాడు ఎక్కడ ఉంటాడో తెలుసా?"

"నాకు తెలీదుసార్! కాని వాడుండే చోటు మీలాంటి

మర్యాదస్తులు వెళ్ళదగిన చోటుమాత్రం కాదని తెలుసు సార్!"

"అదేం ఫరవాలేదు! పనిబడింది అర్జెంటుగా!"

సర్వర్ బయటకు వెళ్ళాడు. మళ్ళీ రెండునిముషాల్లో తిరిగి వచ్చాడు. "భుజంగం ఇల్లు తెలిసిన రిక్షావాడొకడు ఉన్నాడు సార్!"

"ఇంకేం! ఆ మాత్రం చాలు!" అంటూ సర్వర్ చేతిలో రూపాయినోటు పెట్టాడు. బిల్లు చెల్లించి బయటకు వచ్చాడు.

సర్వర్ గూడ అతని వెనుకే బయటకువచ్చి సెంటర్లో ఉన్న రిక్షావాడ్ని కేక వేశాడు. రిక్షా వచ్చింది.

"భుజంగంగాడు కావాలంట! వాడిల్లు చూపించు వీరికి!" సర్వర్ రిక్షావాడికి చెప్పాడు.

"ఆడు వెయ్యూళ్లు తిరుగాడుతూ ఉంటాడు! ఇంటికాడెక్కడ తొంగుంటాడు?"

"పోనీ చూసిరా!"

"ఇల్లు కానాదూరం సార్! ఆ పాకల్లోకి రిక్షాగూడా సరిగా పోనేపోదు సార్!"

"ఫర్వాలేదు. పోయినంత మేరకు పోనీ! ఇంకో అర్ధ రూపాయి ఎక్కువిస్తానే!" అన్నాడు రామ్మూర్తి.

"సరే ఎక్కండి సార్!"

రామ్మూర్తి రిక్షా ఎక్కాడు.

అదొక మురికిపేట. పూరిళ్ళు, మురికి కుప్పలూ డ్రెయినేజి నీళ్ళోడుతున్న రోడ్లూ అసహ్యంగా వుంది.

"ఈ మలుపుతిరిగి ముందుకుపోతే ఎడంచేతివేపు ఆరో పాకసార్!" అంటూ రిక్షావాడు వెళ్ళిపోయాడు.

# 7

కుక్కలు భోంయ్ మంటున్నయ్ కొత్త వ్యక్తిని చూసి. టిప్ టాప్ గా డ్రెస్ చేసుకుని పాకల మధ్యలోకి దూరుతున్న ఈ వింత వ్యక్తినిచూసి కొందరు ఎవరా అని చూస్తున్నారు.

పాక ముందుకు వెళ్ళేసరికి తెల్లటి చీరతో నల్లగా బక్కగా ఉన్న స్త్రీ అతనికి ఎదురొచ్చింది.

"వస్తారా సార్!" అని అడిగింది. అడుగుతూనే తన పమిటను జారవిడిచి మళ్ళీ సరిజేసుకుంది.

రామ్మూర్తికి చిరాకు కలిగింది. "భుజంగం ఇల్లు ఇదేనా?"

"ఇదే సార్! వాడు లేడులెండి! లోపలకు రాండి సార్! మీకు తోచినంత ఇవ్వండి సార్!" ఆమె బ్రతిమాలుతోంది.

"భుజంగంతో అర్జెంటు పనిబడి వచ్చాను. ఎక్కడ దొరుకుతాడు?"

"వాడు ఈ రేత్రి దొరకడు సార్! ఏదో తప్పుడుపని సేయించబోయాడు. వాడికి దెబ్బలు తగిలాయి. డాక్టరు దగ్గరకుపోయాడు బాబూ!"

"ఏ డాక్టరో తెలుసా?"

"అదే సార్! పగడాల వీధిలో మాలాటోళ్ళకు, అడే చీకటి రోగాలకు వైద్యం చేస్తాడు సార్! ఆయన పేరు కరుణాకరం గారంటారు!"

అంటే సుఖరోగాలను ట్రీట్ చేసే సెక్స్ స్పెషలిస్ట్ అన్నమాట.

"సరేలే! అక్కడికే వెళ్ళి కలుసుకుంటాను!" అంటూ జేబులోంచి రెండు రూపాయలుతీసి ఆ స్త్రీ చేతిలో పెట్టాడు.

"మారాజులు! చల్లంగా ఉండాల!" అంటూ ఆమె అతడిచేతిని ముద్దుపెట్టుకుని వదిలేసింది.

రామ్మూర్తి మళ్ళీ రోడ్డుమీదకు వచ్చాడు. ఇందాక తనను తెచ్చిన రిక్షావాడు ఇంకా అక్కడే కూర్చుని బీడి దమ్ము లాగుతున్నాడు నింపాదిగా.

"ఉన్నాడా సార్!" రామ్మూర్తిని చూసి క్రింద కూర్చున్న వాడల్లా లేచాడు.

"లేడు. డాక్టరు దగ్గరకు వెళ్ళాడట!"

రిక్షావాడు నవ్వాడు. "అయితే ఆడింట్లో ఆడది మిమ్మల్ని లంకించుకోలా? కనపడ్డవాడిని అది ఒకపట్టాన వదలదు!"

"రెండు రూపాయలు ఇచ్చి నేనే దాన్ని వదిలించుకున్నాను."

"మంచిపని చేసినారు. అది ఒట్టి రోగాలపుట్ట. దానికి రాత్రయేసరికి సారా ఉండాలి. లేకపోతే విలవిల్లాడి పోతుంది. అందుకే ఇందులోకి దిగింది" రిక్షావాడు ఏకధాటిగా చెప్పుకుపోతున్నాడు.

"పగడాల వీధిలో కరుణాకరం డాక్టర్ తెలుసా?"

"తెలుసు సార్! అక్కడికి పోనిమ్మంటారా?"

"అవును!"

రిక్షా డిస్పెన్సరీ ముందు ఆగింది. రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేశాడు.

"డాక్టరుగారున్నారా?" అనిఅడిగాడు అక్కడున్న కుర్రాడ్ని.

"లేరుసార్! ఎవరో పేషెంట్‌ని చూడాలని వెళ్ళారు బయటికి. ఈపాటికి వస్తుండాలి! కూర్చోండి సార్!" అన్నాడు కుర్రాడు.

"నేను తర్వాత వస్తాన్లే మళ్ళీ!" అంటూ బయటకు

నడిచాడు. మూల మలుపుమీదనే ఉన్న బడ్డీకొట్లో సిగరెట్లు తీసుకుని అక్కడే బెంచీమీద కూలబడ్డాడు.

అరగంట గడిచింది.

రిక్షాలో భుజంగం, కరుణాకరం ఇద్దరూ దిగారు. రామ్మూర్తి గబగబా అడుగులు వేశాడు డిస్పెన్సరీవైపు. భుజంగాన్ని కలిసి అతడితో మాట్లాడాలని అనుకున్నాడు. కాని అంతలోనే ఏదో కొత్త అయిడియా స్ట్రయిక్ అయి ఆగిపోయాడు.

డాక్టర్ని దింపేసి ఆ రిక్షాలోనే భుజంగం వెళ్ళిపోయాడు.

"గుడ్ ఈవెనింగ్ డాక్టర్!" అంటూ డిస్పెన్సరీలో పేపరు తిరగేస్తున్న డాక్టర్ కరుణాకరాన్ని విష్ చేశాడు రామ్మూర్తి.

బోయ్ "ఇక నే వెళ్తానండీ!" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"కూర్చోండి!"అంటూ పేపరు మడిచి టేబుల్ మీద పడేశాడు కరుణాకరం.

కరుణాకరానికి మెడికల్ ప్రాక్టీసు అట్టేలేదు. యం. బి. బి. యస్ డాక్టర్లకే అంతంతమాత్రంగా ఉంది, ఇక కరుణాకరంలాంటివాళ్ళ సంగతి వేరే చెప్పనక్కర్లేదు.

"ఏమిటి మీ కంప్లెయింట్!"

"నా పేరు రామ్మూర్తి సర్!"

"ఐసీ!"

"నేను ప్రయివేట్ డిటెక్టివ్ని! మీ పేషెంట్స్ని చెక్ చెయ్యటానికి వచ్చాను" అన్నాడు రామ్మూర్తి నవ్వుతూ.

కరుణాకరం ముఖంలో రంగులు మారినయ్. "నా దగ్గర ఎవరూ పేషెంట్స్ లేరు!"

"మీరు అబద్ధం చెబుతున్నారు!"

"ఐ సే యూ గెటవుట్!"

"వెళతాను. నీచేత నిజం చెప్పించిన మరుక్షణం వెళ్ళిపోతాను" అంటూ రామ్మూర్తి మెరుపులా కుర్చీ లోంచి లేచి టేబుల్ మీదుగా వంగి కరుణాకరం కాలర్ పట్టుకుని గుంజాడు. ఫెడీఫెడీమని ఆ చెంపా ఈ చెంపా వాయించేశాడు.

అనుకోని ఈ సంఘటనకు కరుణాకరం బిత్తర పోయాడు.

"మిస్టర్! నేను చెప్పేది శ్రద్ధగా విను. కామేశ్వర రావు అనే వ్యక్తి హత్యచేసి పారిపోతూ దెబ్బలు తిని ఎలాగో పోలీసుల చేతుల్లో పడకుండా తప్పించుకు పోయాడు. వాడు తప్పకుండా ఎక్కడో ఒకచోట వైద్యం చేయించుకోనిదే బ్రతకలేడు."

"అని ఎలా చెప్పగలవు?"

"వాడ్ని కొట్టింది నేనే గనుక. ఇకపోతే వాడ్ని ఎక్కడ దాచిపెట్టి ట్రీట్‌మెంట్ ఇచ్చావో చెప్పు. వాడి సంగతి నేను చూసుకుంటాను. లేదా ఇప్పుడే పోలీసుల్ని పిల్చుకువచ్చి నీ బండారం బయటపెడతాను. నీ డాక్టర్ రిజిస్ట్రేషన్ ఊడిపోతుంది. నీవు కటకటాల వెనుక ఉంటావ్! నేచెప్పినట్టు విన్నావో నా దోవన నేను వెళ్ళిపోతాను. నేను నీ దగ్గరకు వచ్చినట్టుగానీ, లేదా నీవు నాకు అడ్రసు ఇచ్చినట్టుగాని, రెండో కంటికి తెలియరాదు. నా సంగతి చూశావుగా!"

డాక్టర్ కరుణాకరం అతడి కళ్ళల్లోకి చూశాడు సూటిగా.

"యూ డెవిల్! రామాలయం సందులో చివరగా సగం కూలిపోయిన పెంకుటిల్లు ఉంది. అందులో వాను

కగా గది ఉంది. అక్కడికి పో!''

రామ్మూర్తి ప్రక్కకు తిరిగి షెల్ఫులోంచి ఏదో టేబ్లెట్స్ చేతిలోకి తీసుకున్నాడు. ఎడమ చేతితో కరుణాకరం ముక్కు గట్టిగా పట్టుకున్నాడు. గాలి ఆడక అతడు నోరు బార్లా తెరిచాడు. ఆ టేబ్లెట్స్‌ని అతడి గొంతులో పడేలా విసిరి గ్లాసుతో నీళ్ళు అతని నోట్లోకి వంచాడు.

''భయపడకు. ఇంకో అరగంటదాకా లేవకుండా పడుకో! నిన్ను నమ్మించెవరు?''

గడియారంవంకా కరుణాకరం ముఖంవంకా చూస్తూ అయిదు నిముషాలు గడిపాడు రామ్మూర్తి. కరుణాకరం నిద్రలోకి జారుకున్నట్టుగా తల వాల్చేశాడు వెనక్కు జారిగిలపడి. తలుపులు దగ్గరకు లాగి రామ్మూర్తి బయటకు నడిచాడు, జేబులోంచి హ్యాండ్ కర్చీఫ్ లాగి ముఖం తుడుచుకుంటూ.

# 9

పాడుబడ్డ పెంకుటిల్లు ముందు ఆగాడు రామ్మూర్తి.

రోడ్డుమీద వీధి దీపాలు వెలగటం లేదు. రోడ్డు చీకటిగా వుంది. అప్పుడప్పుడు ఒకళ్ళో ఇద్దరో అటూ ఇటూ నడుస్తున్నారు.

జనం ఎవరూ లేనప్పుడుగా చూసి రామ్మూర్తి ఆ ఇంట్లోకి దూరాడు.

లోపల వారగా వేసివున్న తలుపు సందులోంచి కిరసనాయిలు దీపం వెలుగు వస్తున్నది. రామ్మూర్తి చాటుగా నిలబడి చెవులు రిక్కించి ఆలకించాడు.

లోపల్నుంచి ఎవరిదో మూలుగు వస్తోంది సన్నగా. అతడే కామేశ్వరరావు అయివుంటాడా? అతన్నొక్కడ్నే వదిలేసివుండరు. తోడుగా మరెవర్నో ఉంచివుంటారు.

ఎంతమంది వున్నారో? ఆలోచనలో మునిగిపోయి అతడు తలుపుమీద చేయి ఆనించాడు తేలికగా.

అయినా తలుపు కీచ్‌మంటూ పెద్దగా శబ్దంచేస్తూ తెరుచుకుంది.

లోపల్నుంచి ఎవరో వ్యక్తి "ఎవరది?" అని అరిచాడు కర్కశంగా. రామ్మూర్తి నిదానంగా "డాక్టర్!" అని గొణిగాడు.

తలుపు బార్లా తెరుచుకుని కండలు తిరిగిన వ్యక్తి ఒకడు బయటకు వచ్చాడు. అతడి చేతిలో లాఠీవుంది.

రామ్మూర్తివంక ఎర్రటి కళ్ళతో చూస్తూ "ఓ! నువ్వేనా డాక్టరువి? నీకు తగిన మందు ఇప్పుడే ఇస్తాను!" అంటూ అతడి లాఠీని ఊరికాడు.

రామ్మూర్తి అదను చూసి ప్రక్కకు తప్పుకున్నాడు. అరచేతిని జాపి, తన గురితప్పి గోడకు గుద్దుకొన్న వ్యక్తి మెడమీద కొట్టాడు. ఒకమాత్రం వ్యక్తి అయితే అతడు చచ్చిపోవాల్సిందే. కాని ఆ వ్యక్తి చాలా బలిష్టుడు.

"ఊఁ!" అని ఉరుముతూ వెనక్కు తిరిగి రామ్మూర్తిని బలంగా గుద్దాడు కడుపులో. అతని పొట్టలోని ప్రేగు లన్నీ బయటకు తోసేసినట్టుగా "అబ్బా!" అని అరిచాడు రామ్మూర్తి. మరుక్షణంలో పిడికిలి బిగించి అతడ్ని అందిన చోటల్లా దభీదభీమని గుద్దాడు. పిడికిళ్ళ వానలా గుద్దుతున్న అతడి ధాటికి ఆవతలివ్యక్తి బాధతో అరిచాడు.

రామ్మూర్తి అతడ్ని జుట్టుపట్టుకుని బంతిని విసిరినట్టుగా ఎదురుగావున్న గోడకు కొట్టుకునేటట్టుగా బలంగా త్రోశాడు.

అతడు వెళ్ళి గోడకు గుద్దుకున్నాడు.

శిథిలమైవున్న గోడ కూలిపోయింది. ఇటుకలు కొన్ని ఆ వ్యక్తిమీద వానలా కురిసినయ్. ఆ గోడమీద అని

వున్న రెండు దూలాలు వచ్చి అతడిమీద పడ్డాయ్. అంతే! ఆ వ్యక్తి కిపక్కారమనలేదు. గోడనుంచి ఊడిన ఇటుకలు, పైనుంచి పడ్డ దూలాలక్రిందపడి నలిగిన వ్యక్తి బ్రతకడని ఊహించాడు.

రామ్మూర్తి గబగబా లోపలకు వెళ్ళాడు. నులక మంచంమీద ఒకవ్యక్తి ఒంటిమీద స్పృహలేకుండా పడివున్నాడు. అతడి తలకు కట్లువున్నయ్. పొట్టమీద చిన్న అపరేషన్ చేసిన గుర్తుగా బ్యాండేజీ లున్నాయ్. రక్తం చాలా పోయిందేమో మనిషి తెలివిలో లేడు.

రామ్మూర్తి వేగంగా బయటకు పరుగెత్తాడు. రెండు రోడ్లకు అవతలి సెంటర్‌లో ఉన్న టెలిఫోన్ బూత్‌కి వెళ్ళి ఇన్స్పెక్టర్ రాజారావుకు ఫోన్ చేశాడు.

"హాలో మిస్టర్ రామ్మూర్తి! ఏమిటి సమాచారం!"

"మీరు వెంటనే రామాలయం ప్రక్క సందులో పాడు బడ్డ ఇంటిదగ్గరకు రావాలి! అంబులెన్స్‌కి కూడా కబురు పెట్టండి. ఎందుకైనా మంచిది డాక్టర్ని, మరణవాఙ్మూలం రికార్డు చేయటానికి మేజిస్ట్రేట్‌ని వెంట బెట్టుకురండి!"

"ఈజ్ ఇట్! ఇప్పుడే వస్తున్నాం!" అంటూ రిసీవర్ పెట్టేశాడు ఇన్స్పెక్టర్.

రామ్మూర్తి మళ్ళీ వెనక్కి వెళ్ళాడు పాడుబడ్డ ఇంట్లోకి. మంచంలో పడివున్న వ్యక్తి ముఖంలోకి ముఖం పెట్టి "కామేశ్వరరావ్" అని పిలిచాడు. ఆ వ్యక్తి ఉలిక్కిపడ్డాడు. అతికష్టంమీద కళ్ళుతెరిచి "ఎవరూ!" అని సన్నగా మాట్లాడాడు. అతడి కళ్ళు తిరిగి మూతలు పడిపోయినయ్.

"రాగిణిని హత్యచేసింది నీవేనా?"

అతడు తలవూపాడు అవునన్నట్టుగా.

"చూడు! నిన్నెవరు పురికొల్పారు రాగిణి హత్య

కోసం!"

ఆతడు మాట్లాడలేదు.

"స్వరూపరాణి పంపిందా?"

లేదన్నట్టుగా అతడు తలవూపాడు అడ్డంగా.

"మరెవరు?"

"భుజంగరావు!"

"ఎందుకు చంపాల్సివచ్చింది!"

"ఆయన చంపమని డబ్బిచ్చారు! చంపాను! కారణాలు కనుక్కునే అలవాటు ఈ కామేశానికి లేదు!"

వాకిట్లో కార్లు ఆగిన శబ్దంవిని రామ్మూర్తి అతడి దగ్గర్నుంచి లేచి బయటకు వచ్చాడు.

ఇన్స్పెక్టర్ రాజారావు, అతడి వెనకనే బిలబిలమంటూ పోలీసులు వచ్చారు.

# 10

రోడ్డుమీద ఎవరూ జనంలేరు.

ఎక్కడో అప్పుడప్పుడరిచే ఊరకుక్కల అరుపులు తప్ప చుట్టూ అంతా సద్దుమణిగింది.

రూమ్ముందు ఆగి కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో లోపల బెల్ మ్రోగడం తనకూ వినిపించింది.

తలుపు తెరుచుకుంది. రాజేశ్వరరావు ఎదురుగా నిద్ర గుర్తులేనుకుని తనవంకే చూస్తున్నాడు. మొలకు టర్కీ టవల్ మాత్రమేవుంది. చొక్కాలేదు, బనీనులేదు.

"ఎవరు మీరు? ఎవరికోసం వచ్చారు?"

రామ్మూర్తి అతడ్ని నెట్టుకుని లోపలకు జొరబడ్డాడు. తన వెనకనే తలుపుమూసి గడియ పెట్టాడు.

"మిస్టర్ రాజేశ్వరరావ్! నాపేరు రామ్మూర్తి! మీ నాన్నగారింట్లో చూశారుకదూ నన్ను!"

"ఓ మీరా? ఏమిటిలా ఊడిపడ్డారు?" అతడికళ్ళు పెద్దవయినయ్.

"నీకో అర్జెంటు కబురువుంది! అందుకే వచ్చాను!" అంటూ కుర్చీలో తాపీగా కూలబడ్డాడు రామ్మూర్తి. రాజేశ్వరరావు అతడివంకే చూస్తూ బెడ్ మీద వాలి పోతూ అడిగాడు.

"ఎక్కడనుంచి? ఏమిటా కబురు?"

"కామేశం దగ్గర్నుంచి!"

"ఏమిటీ? ఎవరూ?" అతడు ఆశ్చర్యంతో భయంతో నోరు తెరిచాడు.

"కామేశం దగ్గర్నుంచి!"

"ఎక్కడున్నాడు అతడు! ఎవరు ఆయన! కామేశం అనే వాళ్ళెవరూ నాకు తెలీదే!"

"మిస్టర్ రాజేశ్వరరావ్ ఉరఫ్ మల్లేశ్వరరావ్! కామేశం ఎక్కడున్నాడో చెప్పనా? రామాలయం సందులో పాడుబడ్డ పెంకుటింట్లో! నీచేత పిస్టల్ దెబ్బ తిని పొట్టకు బ్యాండేజ్ తో వున్నాడు!"

"ఆ! అయితే నీవు వాడ్ని కలిశావా? వాడితో మాట్లాడావా?"

"కలిశాను. కాబట్టే నీ దగ్గరకు వచ్చాను! కామేశాన్ని ఎందుకు కాల్చావు నీవు?"

"నేను కాల్చలేదు!"

"కాదు! నీవే కాల్చావ్!"

"పోలీసులకు తెలిసిందా ఆ విషయం!"

"లేదు! నేను వెళ్ళి చెప్తేకాని తెలీదు."

"నేనే కాల్చానని ఎలా చెప్పగలవు?"

"రాగిణిని కాల్చి చంపమని కామేశాన్ని లోపలకు పంపి నీవూ భుజంగం ఇద్దరూ క్రింద కాచుక్కూచు

స్తారు. కామేశం ఎంతసేపటికీ బయటకు రాకపోవ డంతో నువ్వే పైకివచ్చావు. స్పృహలోలేని వ్యక్తిని అక్కడికక్కడే తుదముట్టించాలని ప్లాన్ వేశావు. నీ జేబులోంచి పిస్టల్ తీసి అతడ్ని కాల్చావు. మళ్ళీ వెనక్కి వెళ్ళి భుజంగాన్ని సాయంతెచ్చుకున్నావ్! అతగాడ్ని ఇద్దరూ మోసుకెళ్ళి కారులో పడేశారు. నీతోవున్న భుజంగాన్నికూడా కామేశాన్ని నేనే కాల్చి ఉంటానని నమ్మించావ్! అవునా?''

రాజేశ్వరరావు అయోమయంగా అతనివంక చూశాడు. ''సినిమాలో చూసినంత క్షుణ్ణంగా చెప్పావ్. జరిగిన దాన్ని ఎలా కనుక్కున్నావ్?''

''ముందు నేనడిగే వాటికి సమాధానం చెప్పు! ఆ తర్వాత నే నీ సందేహాలకు జవాబులు!''

''నిజమే! అతడ్ని నేనే కాల్చాను. లేకపోతే వాడు తర్వాత తర్వాత నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యటానికి ప్రయత్నించవచ్చు.''

''రాగిణి నీ తల్లి! కన్నకొడుకువైన నీవే ఆమెను హత్యచేయించటానికి తయారయావ్!''

''తల్లి! ఆమాట అనుకుంటేనే పాపం! అది ఆడదా? కాదు పిశాచి! డర్టీ బిచ్! దాని మనసులోని పాపపు ఆలోచనలకు మారుగా నేను శివచ్ఛరంలా జన్మించాను! అన్నిటికన్న ఘోరం! నేను స్వరూపరాణిని ప్రేమిం చాను! నవ్వుతున్నారా! ఆమె అంగసౌష్టవం ముందు నేను తోటకూరకాడలా వుంటాను! అయితేనేం! నాకూ హృదయముంది! నాకూ భార్యకావాలిగదా?''

''కాదని ఎవరంటారు? ఆమెగూడ నీ ప్రేమని అంగీ కరించాలిగదా?''

''వస్తున్నాను. కాని ఆ రాగిణి దానితో స్నేహం

చేసింది. దాన్నిగూడ తన ప్రస్తుత భర్త కాశీనాథ్‌కి తార్చింది. అంతకన్న ఇంకా ఏముంటుంది? అందుకే నా తల్లిని కడతేర్చనే ఏర్పాటు చేశాను. ఆ పనిని నేను భుజంగానికి అప్పజెప్పాను. అయితే ఆ ఇడియట్ తనే వెళ్ళి పూర్తిచేయకుండా కామేశాన్ని పంపాడు.''

''సరే! అంతవరకూ బాగానేవుంది. అయితే కాశీనాథ్‌ని ఎందుకు బ్లాక్‌మెయిల్ చేస్తున్నావ్?''

రాజేశ్వరరావు మళ్ళీ కళ్లు పెద్దవిచేసి చూశాడు.

''నేను బ్లాక్‌మెయిల్ చేస్తున్నట్టు ఎలా తెలుసు? ఎవరు చెప్పారు నీకు!''

''డిటెక్టివ్‌కి ఒకళ్లు చెప్పే పనేముంది? నేనే ఆరా తీశాను. ఆ ఫిల్ములు ఎక్కడున్నయ్ చెప్పు!''

''చెప్పకపోతే!''

''నిన్నెటూ పోలీసులకు పట్టించాల్సి ఉంటుంది. రాగిణిని హత్య చేయించినందుకూ, కామేశ్వరరావుని ప్రత్యక్షంగా చంపినందుకూ నీకు ఉరిశిక్ష తప్పదు. ఆ తర్వాత వాటిని నేను ఎలానూ స్వాధీనం చేసుకుంటాను.''

''వాటిని ఇప్పుడే నీకిచ్చేస్తే నాకు ఒరిగే లాభమేమిటో?''

''గుడ్! తెలివైన ప్రశ్న వేశావ్! ఆ ఫిల్ములు నాకిచ్చేస్తే నేను నీకో ఉపకారం చేయగలను. కామేశ్వరరావుని నీవు కాల్చినట్టు నాకుతప్ప వేరెవరికీ తెలీదు. కనుక పోలీసుల లెక్కలో నీవు రాగిణి హత్యకు పరోక్షంగా కారకుడివి. నీవే ఆమె హత్యకు పురికొల్పావని కామేశానికి తెలీదు. భుజంగరావు చెయ్యమంటేనే ఈ హత్య చేశానని పోలీసులకు చెప్పాడు కాబట్టి నేను చెబితే తప్ప ఈ విషయం పోలీసులకు తెలీదు!''

''మీ ఆలోచన బాగానే ఉంది!''

"ఈ విషయంలోనన్నా మనిద్దరం అంగీకారానికి రావటం మంచిది."

"నాదొక్క సందేహం! ఆ ఫిల్ముల కోసం నీకంతటి అవసరం ఏమొచ్చింది?"

"అవి పోలీసుల చేతుల్లో పడితే పబ్లిసిటీ అయిపోతుంది. అలా కాకుండా కాపాడాలనే నా తాపత్రయం!"

"స్వరూపరాణి అడిగి ఉంటుంది వాటిని తెమ్మని!"

"అదంతా అనవసరం! నువు మరీ జాప్యం చేయకు. నీ కోసమూ, భుజంగం కోసమూ పోలీసులు అన్వేషణ సాగిస్తారు! క్విక్!"

రాజేశ్వరరావు బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. రామ్మూర్తి గూడ అతన్ని అనుసరించాడు. బాత్‌రూమ్‌లో డ్రెయినేజ్ పైప్‌లోనుంచి భద్రంగా దాచబడిన గుండ్రటి డబ్బాను లాగాడు. రామ్మూర్తి దాన్ని అందుకున్నాడు.

"మొత్తం ఎన్ని కాపీలు?"

"మూడు!"

"మిగతా రెండూ?"

"ఇస్తున్నానుగదా! తొందరెందుకు? తర్వాత మాట తప్పనుగదా!"

రామ్మూర్తి రాజేశ్వరరావును ప్రేమగా వీపు నిమిరాడు. "చూడు బ్రదర్! చట్టప్రకారం నువ్వు నేరస్థుడివే కావచ్చు! కాని నీ పరిస్థితుల్లో నేనున్నా అంతే చేసే వాడిని! మై సింపతీ లైస్ విత్ యూ మైడియర్ బ్రదర్!"

రాజేశ్వరరావు కళ్ళవెంట నీళ్ళు కారినయ్. "అటు తల్లిప్రేమగాని, ఇటు తండ్రి ఆప్యాయతగాని తెలీని నాకు నీ ఆప్యాయత చాలా ఆనందాన్నిస్తోంది. నీలాంటి వాడు నా జీవితంలో ఒక్కడు తారసపడినా నేను చాలా ఉన్నత స్థితిలో ఉండేవాడిని" అంటూ రామ్మూర్తితో

ఆప్యాయంగా కరచాలనం చేశాడు. మరుక్షణంలో ఎవరో తరుముకొస్తున్నట్టుగా మరో రెండు రహస్య ప్రదేశాల్లోంచి మరో రెండు టిన్నులు తీశాడు. రామ్మూర్తి వాటిని అందుకున్నాడు.

"థాంక్యూ వెరీమచ్! సీ యూ ఎగైన్!" అంటూ బయటకు ఉరికాడు. మూల మలుపులోకి వెళ్ళిన తర్వాత టాక్సీని కేకేసి అందులోకి ఎక్కాడు.

# 11

టాక్సీ కాశీనాథ్ ఇంటిముందు ఆగింది.

టాక్సీ ఫేర్ చెల్లించి గేటుదగ్గరకు వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు. కాశీనాథ్ కళ్లు నలుముకుంటూ తలుపు తీశాడు. "ఈ సినిమా వాళ్ళకు రాత్రిళ్ళు అసలు తీరిక ఉండదు. డైరక్టరు కాదుగదా నిర్మాతే వచ్చి సాష్టాంగ పడ్డా నేను రానని చెప్పానా?" అంటూ అరిచాడు.

ఆ తర్వాత రామ్మూర్తివంక తేరిపారచూసి "ఓ! మీరా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నన్ను లోపలకు రానివ్వండి. మిమ్మల్నింకా ఆశ్చర్యపరిచే సరుకు చూపిస్తాను" అంటూ అతని వెనుకే లోపలకు నడిచాడు. వారివెనుక తలుపులు మూసివేయబడ్డాయి.

రామ్మూర్తి తన చేతిలోని టిన్స్ తెరచి ఫిల్మ్‌ల్ని టేబుల్ మీద పెట్టాడు. కాశీనాథ్ నమ్మలేనట్టుగా వాటిని పదేపదే పైకెత్తి లైటు వెలుగుకి అడ్డంగా పెట్టి చూశాడు.

"మైగాడ్! ఇంత త్వరగా ఎలా తేగలిగారు?" కాశీనాథ్ అభినందనగా అన్నాడు.

"వివరాలు మీరు అడగకూడదు. ఇవి మూడు కాపీలు. ఇక మీరా భుజంగానికిగాని మరే నాగయ్యకుగాని భయపడాల్సిన పనిలేదు" అన్నాడు గర్వంగా.

"ఒకసారి ప్రొజెక్టర్‌లో వేసి చూద్దాం! నిజంగా నేను నమ్మలేని స్థితిలో ఉన్నాను."

"అబ్బే! ఇప్పుడొద్దు! ఆ సీన్లన్నీ నేను చూడలేను! నన్ను పంపేసి మీరూ స్వరూపరాణీ ఎంజాయ్ చెయ్యండి వాటిని తీరిగ్గా!"

"వెల్ సెడ్ మై బాయ్! నువ్వూ రొమాంటిక్‌గానే ఉన్నావు! సరే! థ్యాంక్స్ ఫర్ యువర్ సర్వీస్!" అంటూ కాశీనాథ్ సేఫ్ తీసి నూరురూపాయల కట్టనొక దాన్ని రామ్మూర్తికి అందించాడు.

"పదివేలా?"

"ఏం చాలదా? ఓకే! యూ టేక్ ఎనదర్ టెన్!"! అంటూ మరో కట్టలాగి అందించాడు కాశీనాథ్.

"అబ్బే! అది కాదండీ! పదివేలెందుకని అన్నాను! అంతే!"

"నో! నో! మై బాయ్! ఇచ్చినదాన్ని వెనక్కి తీసుకునే అలవాటు లేదు! బైదిబై! యూ డిసర్వ్ దట్ మచ్!"

"ఓకే సార్! గుడ్‌నైట్! విష్‌యూ స్వీట్ డ్రీమ్స్!" అంటూ రామ్మూర్తి అక్కడ్నుంచి బయటకు వచ్చేశాడు.

# 12

ఉషారుగా ఎగురుకుంటూ వస్తున్న రామ్మూర్తిని దూసుకుంటూ కారువచ్చి ఆగింది. ఎవరన్నా హంతకులు తనను ఎదుర్కోవటానికి వచ్చారేమో అని స్టంట్ చెయ్యటానికి సిద్ధమయ్యాడు రామ్మూర్తి.

కారు లోపల్నుంచి ఎవరో స్త్రీ కిలకిల నవ్వింది.

"మేం శత్రువులం కాదండీ డిటెక్టివ్ గారూ! మేమూ మీ మిత్రులమే" అంది ఆమె.

రామ్మూర్తి కారులోకి తొంగిచూశాడు. ఆమె స్వరూప

రాణి. నైట్ క్లబ్ నుంచి తిరిగివస్తున్నట్టు ఉంది అనుకున్నాడు.

"క్లబ్‌లో డాన్స్ చేసి వస్తున్నాను. ఇంటికి వెడుతున్నాను. రండి మీరుగూడ. ఒక అయిదునిముషాలు మాట్లాడి వెళ్ళిపోవచ్చు" అంటూ స్వరూపరాణి కారు డోర్ తెరిచింది. రామ్మూర్తి ఆమె ప్రక్కగా కూర్చున్నాడు.

కారు స్టార్టయింది. రాజేశ్వరరావు రూమ్‌మీదుగానే పోతోంది కారు. రామ్మూర్తి పరీక్షగా చూశాడు. రాజేశ్వరరావు గది తాళం వెన్నెల్లో వెక్కిరిస్తున్నట్టుగా మెరుస్తోంది. ఇంత రాత్రివేళ ఎక్కడకు వెళ్ళాడు చెప్మా? లేక పోలీసులు అప్పుడే అతడి అమాకీకనుక్కొని లాక్కెళ్ళి ఉంటారా అనుకున్నాడు.

"అఫ్‌కోర్స్! మిమ్మల్ని రేపు ఉదయం రమ్మన్నాననుకోండి! ఇప్పుడెలాగూ కలిశారుగదా! నా బాధ వివరిద్దామని పిలిచాను. మీకేమన్నా డిస్టర్‌బెన్స్ కలిగించానా?"

"నో! నో! అదేంలేదు. అదీగాక మీతో ఎంత త్వరగా కలిస్తే అంతమంచిదని అనుకునే కారులో ఎక్కాను" రామ్మూర్తి నవ్వుతూ అన్నాడు.

చిన్న అందమైన మేడముందు కారు ఆగింది. కారుదిగి రామ్మూర్తి చేయిపట్టుకుని నడిపించుకుపోతున్న స్వరూపరాణిని ఉద్దేశించి అన్నాడు డ్రైవర్ "గుడ్ నైట్ మాడమ్!"

"గుడ్ నైట్! సీయూ టుమారో! టాటా!" అంటూ స్వరూపరాణి చెయ్యి ఊపింది.

కారు వెళ్ళిపోయింది. గేటుముందు గూర్ఖా సలాం చెప్పి గేటు తెరిచాడు.

తన క్లబ్ డ్రెస్ విప్పేస్తూ స్వరూపరాణి అడిగింది.

"ఏంకావాలి? హాట్ డ్రింక్సా? కోల్డ్ డ్రింక్సా?"

"విస్కీ ఉంటే ఇప్పించండి!"

"ష్యూర్!" అంటూ గిర్రున లేడిలా నడిచి వయ్యారంగా కప్‌బోర్డు తెరిచింది.

స్లీవ్‌లెస్ జాకెట్ తొడల సగంభాగంవరకూ వ్రేలాడుతోంది. ఆమెనుచూసి పరవశించిపోతున్న రామ్మూర్తి ఈమెతో రాగిణి లెస్బియన్ ఆటలూ, కాశీనాథ్ శృంగారం ఉన్న ఆ ఫిల్మ్‌ని స్క్రీన్‌మీద ఒకసారిచూసి ఉండాల్సింది అనుకున్నాడు. కాశీనాథ్ ఆ పని చేస్తానంటే తనే వారించాడు.

వయ్యారంగా నడుస్తూ టేబుల్‌మీద రెండు గ్లాసుల్ని ఉంచింది. పెద్ద సీసానొకదాన్ని 'సీల్' బ్రేక్ చేసి రెండు గ్లాసుల్లోకి ద్రవాన్నిపోసింది. ఫ్రిజిడేర్‌లోంచి ఐస్ క్యూబ్స్‌ని తీసిపడేసింది.

"ఒక్క నిముషం ఆగండి. త్రాగటానికి బాగుంటుంది" అంటూ సిగరెట్ ఒకటి రామ్మూర్తికి ఆఫర్‌చేసి తనో సిగరెట్ వెలిగించింది.

తర్వాత ఇద్దరూ నెమ్మదిగా సిప్ చేయసాగారు.

"మీ కేస్ ఏమిటో చెప్పనేలేదు!" అన్నాడు రామ్మూర్తి.

"అదే! వస్తున్నాను. ఒకవారం రోజులక్రితం నాకో ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది. నన్ను ఎవరో హత్య చేయాలని కాచుకకూర్చున్నారట. అదీదాని సారాంశం!"

"మీకు విరోధులెవరన్నా ఉన్నారా?"

"ఎవరూలేరు నాకు తెలిసినంతలో. చావంటే నాకు భయంలేదనుకోండి. ప్రతిరాత్రి నా నగ్నశరీరం మీద పాముల్ని ప్రాకించుకుంటూ డాన్స్‌చేస్తాను క్లబ్‌లో. ఇవాళ చిన్నసైజు కొండచిలువను హారంలా మెడమీద

వేసుకోవాల్సి వచ్చింది. అది సరిగా నిలిస్తేనా? అటూ ఇటూ పాకులాడింది. దాని బరువు మోసేసరికి పదిమందిని భరించినంతగా ఒళ్ళు నొప్పులు చేసింది. ఆఁ! రాజేశ్వర రావు అని రాగిణి కుమారుడు రివటల్లే ఉంటాడు! వాడు నన్ను ప్రేమించాడట! పెళ్ళిచేసుకోమని వెంటబడ్డాడు ఒకసారి! నీవసలు మామూలు స్త్రీనన్నా సంతృప్తిపరచ గలవా అని హేళనచేసి పంపేశాను. ఆ తర్వాత వాడు నన్ను పలకరించలేదు మళ్ళీ! ఒకవేళ వాడి పని అయి ఉంటుందా?''

''అయినా అవచ్చు! వాడంతటవాడు ఈగనికూడా చంపలేడని నా ఉద్దేశ్యం! లేదా ఎవరిచేతనైనా చేయించ వచ్చు! ఆఁ! వాడివల్ల మీరు భయపడాల్సిన పనిలేదు. ఇప్పుడో, రేపుదయమో వాడ్ని పోలీసులు ఖూనేస్తారు?''

''అదేం?''

''రాగిణి హత్యకేసులో వాడికేదో సంబంధం ఉందని పోలీసుల అనుమానం!''

''ఆ మడ్డి వెధవకు అంత సాహసం కూడానా? నేనైనా, రేపాక్కాడే ఇక్కడ ఉండేది. ఆ మర్నాడు బొంబే వెళ్ళాల్సివుంది. అక్కడ ఒక క్లబ్‌లో స్నేక్ డాన్స్ చేయాలట పదిరోజులు. మళ్ళీ నేను తిరిగి వచ్చే లోపల మీరు ఆ ఉత్తరంరాసిన వ్యక్తిని పట్టుకోవాలి!''

''ఆఁ! స్నేక్ అంటే గుర్తుకు వచ్చింది! మీ శరీరం మీద ప్రాకే పాములన్నీ కోరలు తీయబడినవేకదా?''

''అందుకు సందేహమా? లేకపోతే నే నెప్పుడో చని పోయి ఉండనూ?''

''ఆ పాముల్ని మీకు ఎవరు సప్లయిచేస్తారు?''

''మా నైట్‌క్లబ్‌లోనే ఇద్దరు పాముల వాళ్ళని వెయిటర్స్‌గా నియమించారు. వాళ్ళే తెస్తారు వాటిని.

వాళ్ళ కస్టడీలోనే అవి భద్రపరుపబడి ఉంటయ్."

"అయితే ఒక ప్రమాదం రాకుండా మీరు జాగ్రత్త పడాలి. ఆ పాముల్లో కోరలున్న వాటిని మీమీద ప్రయోగింప జేస్తారేమో!"

"అఫ్‌కోర్స్! ఆ విషయంలో జాగ్రత్తగానే వుంటాను. ప్రతిదాన్ని ముందు తాకిచూసి ఆ తర్వాతనే స్టేజిమీదకు తీసుకువడతాను."

"దట్సాల్ రైట్! రేపట్నుంచే మీ కేసుని ఇన్వెస్టిగేషన్ చేస్తాను. ఇక నాకు ఈ రాత్రికి సెలవు! గుడ్ నైట్!" అంటూ రామ్మూర్తి లేచాడు.

"వెళ్ళిపోతారా? అందమైన ఆడదాన్ని ఒంటరిగా వదిలేసి పోతారా?" అంటూ చిలిపిగా అతడి కళ్ళల్లోకి చూసింది స్వరూపరాణి.

"ఎక్స్క్యూజ్ మీ! మీ అందచందాల్ని చూస్తున్నంత సేపు త్రాచుపాము వన్నెని చూస్తున్నంత గుర్పాటు కలుగుతోంది" అంటూ నవ్వుతూ క్రిందకు వచ్చేశాడు. గూర్ఖా గేటు తెరచి అతడ్ని బయటకు పంపి మళ్ళీ గేటుకు తాళం వేశాడు.

# 13

తెల్లవారుజాము నాలుగు గంటలయింది. రామ్మూర్తిలో ఉషారు ఇంకా చచ్చిపోలేదు. నిద్ర అసలే రావటంలేదు. ఇంటికి వెడుతూ దోవలో పోలీస్ స్టేషన్ ముందు ఆగాడు.

ఇన్స్పెక్టర్ రాజారావు పెద్దగా అరుస్తున్నాడు. కానిస్టేబుల్స్ హడావిడిగా తిరుగుతున్నారు.

రామ్మూర్తి లోపలకు వెళ్ళాడు.

"ఏం రామ్మూర్తి! ఇంకా ఇంటికిపోలేదా?" అనడిగాడు ఇన్స్పెక్టర్.

"లేదుసార్! ఏమిటి సార్ హడావిడిగా ఉన్నారు!"

"ఏముంది! ఇప్పుడే మరో కేసువచ్చింది. హత్యకేసు. స్వరూపరాణి అని నైట్‌క్లబ్ డాన్సర్ హత్యచేయబడిందట!"

"ఎవరూ? స్వరూపరాణి! మైగాడ్!"

"వస్తావా?"

"యస్‌సర్! నేనూ ఫాలో అవుతాను మిమ్మల్ని!" అంటూ జీప్‌లో ఎక్కాడు.

పోలీస్ జీప్, వ్యాన్ రెండూ బయలుదేరినై. ఆ రెండు వాహనాలు స్వరూపరాణి ఇంటికి చేరేసరికి మరో వైపునుంచి అంబులెన్స్ వచ్చింది. అందులోనుంచి డాక్టర్ దిగాడు.

స్వరూపరాణి తన బెడ్‌మీద పడుకుని ఉంది. ఆమె ఛాతీలోనూ, పొట్టలోనూ బుల్లెట్స్ దిగినయ్. పరుపు మీద పెద్దపెద్ద మరకలున్నయ్. పోలీసులు తమ ఇన్వెస్టిగేషన్‌లో ఉండంగానే రామ్మూర్తి గేటుదగ్గర గూర్ఖా వాడ్ని ప్రశ్నించాడు.

"రాత్రి నేను మాట్లాడి వెళ్ళాను గదా! ఆ తర్వాత ఎన్నిగంటలకు జరిగింది ఇది!"

"మీరు అటువెళ్ళారు సాబ్! మరో పావుగంటకు లోపల్నుంచి ఎవరో కాల్చినట్టుగా శబ్దం వచ్చింది. ఆ తర్వాత అమ్మగారు పెద్దగా రెండుసార్లు అరిచింది. మేం వెళ్ళేసరికి ఆమెకు ప్రాణంపోయింది. హంతకుడు దొరకలేదు."

రామ్మూర్తి తల పైకెత్తి ఒక్కనిముషం ఆలోచించాడు. ఇదీ రాజేశ్వరరావే చేసి ఉండాలి. రాగిణిని హత్యచేయించిన తర్వాత అతడి నెక్స్ట్ టార్గెట్ స్వరూపరాణి. అది అంతటితో ఆగేదేనా? లేక ఇంకో మర్డర్

గూడా జరుగుతుందా?

ఇన్స్పెక్టర్ రాజారావు తనపని పూర్తిచేసుకుని క్రిందకు వచ్చాడు.

"సర్! భుజంగరావు ఎక్కడ వుండేదీ అరాతీశాను! అక్కడికికూడా వెళ్ళివస్తే బాగుంటుంది!"

"అలాగా! అయినా ఇప్పుడు దానికంత అర్జెంటు ఏముంది?"

"మీరు చికాకులో ఉన్నట్టున్నారు. నాకు, మరో హత్యకూడా ఈ రాత్రికే జరుగుతుందని అనుమానంగా వుంది. దాన్ని నివారించాలంటే వాడ్ని మూసేయాలి సార్!"

"మైగాడ్! ఒకరోజులో మూడు హత్యలా? మా ఉద్యోగాలు వుండాలా? ఊడాలా? పద అయితే!"

# 14

పోలీస్ జీప్ భుజంగం ఇంటివేపుగా పరుగెత్తింది. పోలీసుల్ని చూసి పాకల్లోవుండే కొందరు పరుగెత్తుకొంటూ పారిపోయారు. మరికొందరు నిగడతన్నిముసుగు పెట్టుకున్నారు.

జీప్ ఆ సరికి దాని హెడ్ లైట్లు సరిగా భుజంగం పాకమీదే ఫోకస్ అవుతున్నాయ్.

ఆ దృశ్యం చూస్తూనే రామ్మూర్తి నిశ్చేష్టుడైనాడు.

ఎదురుగా భుజంగరావు శవంవుంది. దానిదగ్గరే అతడి భార్య, రామ్మూర్తిని ఆహ్వానించిన స్త్రీ సన్నగా ఏడుస్తోంది. ఇంకా నలుగురైదుగురు చుట్టూ చేరివున్నారు.

"ఏమిటిది? ఏముయింది వీడికి?" ఇన్స్పెక్టర్ జీప్ దిగి. వెళ్ళి అడిగాడు.

"ఏముంటుంది! ఏదో చెడుపని చేసి నాలుగు డబ్బులు తెచ్చుకున్నట్టున్నాడుసార్! దాంతో తెగ త్రాగి చచ్చాడు!"

"వీడ్ని వెంటనే పోస్ట్‌మార్టమ్‌కి పంపాలిసార్! వీడి మీద విషప్రయోగం జరిగిందని నా ఉద్దేశ్యం!"

"ఏమిటోయ్! ఇవాళ నీవు ఇంత అలర్ట్‌గా వున్నావ్! ఇదేనా నీవు అనుమానించిన మరోవార్త!"

"కాదుసార్! అది వేరేది! జీప్ మళ్ళించండి!" అని అరిచాడు రామ్మూర్తి.

"ఈజ్ ఇట్?" అంటూనే అక్కడ జరగవలసిన తతంగం గురించి హెడ్ కానిస్టేబుల్‌కి ఆజ్ఞలు జారీచేసి, మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌ని వెంటబెట్టుకుని జీప్‌లో బయలుదేరాడు.

జీప్ రాజేశ్వరరావు రూమ్‌ముందు ఆగింది. రూమ్‌కి లాక్ వేసివుంది.

"ఊ! పోనివ్వు జీప్‌ని!" అంటూ రామ్మూర్తి అన్నాడు డ్రైవర్ని ఉద్దేశించి. జీప్ శరవేగంతో ముందుకురికింది.

# 15

కాశీనాథ్ ఇంటిముందు జీప్ దిగుతూనే రామ్మూర్తి గూర్ఖావాడిని అడిగాడు. "రాజేశ్వరరావు వచ్చాడా?"

"ఇంతకుముందే లోనికి వెళ్ళాడుసార్!" అన్నాడు వాడు.

రామ్మూర్తి లోపలకు పరుగెత్తాడు. తలుపులు దగ్గరగా వేసివున్నయ్. వాటిని తోసుకుని గబగబా డ్రాయింగ్ రూమ్‌లోంచి మేడమెట్లదగ్గరకు పరుగెత్తాడు రామ్మూర్తి.

మొదటి మెట్టుమీద కాలు వేశాడో లేదో హాండ్సప్ అని ఎవరో అరిచారు.

చేతులెత్తి అలాగే నిలబడిపోయాడు రామ్మూర్తి.

మెట్లక్రింద అప్పటిదాకా దాక్కున్న రాజేశ్వరరావు బయటకు వచ్చాడు. మెట్లమీద రామ్మూర్తి నిలబడి వున్నాడు చేతులు పైకెత్తి. అతని కెదురుగా రాజేశ్వర రావు చేతిలో పిస్టల్‌తో యముడిలా నిలబడ్డాడు.

రామ్మూర్తికి మెరుపులా అయిడియా వచ్చింది. ఇన్స్పెక్టర్ వచ్చేదాకా రాజేశ్వరరావుని ఆపగలిగితే!

రాజేశ్వరరావు తనకెదురుగా వున్నాడు. అతడి వీపు ప్రవేశద్వారంవైపు వుంది. అంటే లోపలకు ఎవరన్నా వచ్చినా అతడు కనుక్కోలేడు.

"చూడు రాజేశ్వరరావ్! నీవు మంచివాడిగా మారి పోయావనుకున్నాను. కాని ఇలా ఒకరోజులోనే అటు రాగిణిని, భుజంగాన్ని ఇటు స్వరూపరాణిని పొట్టనబెట్టు కుంటావనుకోలేదు!"

"మిస్టర్ రామ్మూర్తీ! రాగిణి కేసు దర్యాప్తు చేసి నీవూ ఇంటికి వెళ్ళిపోయి ఉంటావని ఊహించాను. అందుకే నీవు అటు వెళ్ళంగానే స్వరూపరాణి ఇంటికి వెళ్ళాను. కాని రామేశ్వరం పోయినా శనేశ్వరం వదల దని అక్కడికీ నీవు దాపరించావ్!"

"ఏమిటీ! నేను స్వరూపరాణితో వచ్చినప్పుడు నీవు ఆ ఇంట్లోనే దాక్కుని వున్నావా?"

రాజేశ్వరరావు వికటంగా నవ్వాడు. "నువ్వే చెప్పావ్! గుర్తుందా? రేపుదయమే నన్ను పోలీసులు అరెస్ట్ చేస్తారని! అందుకే ఉన్న తక్కువ వ్యవధిలో నలుగుర్ని యముడి దగ్గరకు పంపుదామనుకున్నాను.

స్వరూపరాణిని చంపి, భుజంగానికి సారాలో విషం కలిపి ఇచ్చి, ఇటు వచ్చాను. నేను అసలు మూడుహత్యలతో ముగిద్దామనుకుంటే నీవు అడ్డం వచ్చావ్. నీవు అయిదో వాడివవుతావ్!"

"అంటే అప్పుడే కాశీనాథ్‌ని అంతం చేశావా?"

రాజేశ్వరరావు సమాధానం ఇవ్వకుండా గర్వంగా నవ్వాడు.

"అదుగో ఇన్స్పెక్టర్ పోలీసుల్ని వెంటబెట్టుకుని వచ్చాడు నీకోసం" అన్నాడు రామ్మూర్తి.

రాజేశ్వరరావు వెనుదిరిగి చూశాడు.

నిజంగానే పోలీసులు కనుపించారు అతడికి.

అంతలోనే రామ్మూర్తి బూటుకాలువచ్చి తగిలింది అతని చేతికి. చేతిలో పిస్తోలు ఎగిరి ఇన్స్పెక్టర్ కాళ్ళ దగ్గర పడింది.

రామ్మూర్తి రాజేశ్వరరావుని తన చేతుల్లో బంధిం చేశాడు.

అంతా కలిసి మేడపైకి వెళ్ళారు.

ఎదురుగా కనబడిన దృశ్యాన్ని చూసి అందరూ విభ్రాంతితో నోళ్ళు తెరిచారు.

బెడ్ మీద కాశీనాథ్ చచ్చిపడున్నాడు. అతడి గుండె దగ్గర్నుంచి రక్తం ఇంకా కారుతూన్నది.

అందరూ విషాదవదనాలతో కొయ్యబొమ్మల్లా నిలబడి పోయారు.

—: ఐపోయింది :—

# నడిచే శవం!

శ్యాంబాబు

"వాట్ఎన్ ఎక్సలెంట్ సైట్!"—

నేను తలత్రిప్పి షేర్‌సింగ్ వైపు చూశాను.

బైనాక్యులర్స్‌లోనుండి క్రింద లోయవైపు, దూరాన ఆకాశాన్ని తమ వెనకాల దాచేస్తున్న పర్వతాలవైపు చూస్తూ మైమరచి పోతున్నాడతను.

సెప్టెంబరు నెల; అస్సాంలోని మిషిమి కొండల ప్రాంతం. దట్టమైన అడవులతో నిండిన పర్వతశ్రేణులు. వర్షాకాలంలో విపరీతమైన వర్షాలు, శీతాకాలంలో విపరీతమైన చలి. నాగరికతకు, మిషిమి ప్రాంతానికి కొన్ని శతాబ్దాల దూరంవుంది. దగ్గరలో కాస్త నాగరికత వాసన తగిలే పట్టణం ఇక్కడికి వందమైళ్ళ దూరంలో

వున్న 'చాంగెల్'.

"డ్రైవర్! జీపు ఆపు!"—అన్నాడు షేర్‌సింగ్.

కొండరోడ్డుమీద ముప్ఫైమైళ్ళ స్పీడుతో పోతున్న జీప్‌ను డ్రైవర్ బ్రేక్ వేశాడు.

షేర్‌సింగ్ జీప్ దిగి రోడ్ అంచుకు వెళ్ళి బైనాక్యులర్స్ క్రిందలోయలోకి ఫోకస్ చేసి, తదేకంగా చూడసాగాడు. నవ్వొచ్చింది నాకు అతన్నా భంగిమలో చూస్తోంటే. కొద్దిగా ముందుకువంగి, పరిసరాల్ని మరచి పోయినట్లు, పెదిమలమీద చిత్రమైన నవ్వుతో...

సన్నని నీరెండకాంతిలో అతని ఆఫీసర్ యూనిఫాం మెరుస్తోంది. తెల్లని ఛాయ, నున్నగా గీసిన గడ్డం, మీసాలు, సూటైన ముక్కు, ఉత్సుకతతో గమనిస్తోన్న కళ్ళు, వెడల్పయిన భుజాలు, షోల్డర్స్ లూప్స్‌మీద కేప్టన్ రాంక్‌ని తెలుపుతూ మూడు నక్షత్రాలు, ఎడమవైపు జేబుపైన అయిదురంగుల వార్ కలర్స్. పొట్టీ పొడుగూ కాని మనిషి సింగ్.

కేప్టన్ షేర్‌సింగ్ మా ఫార్వర్డ్ చెక్‌పోస్టును తనిఖీ చేయడానికి ఎయిర్ ఆర్మీ హెడ్‌క్వార్టర్స్, షిల్లాంగ్ నుండి ఈరోజే వచ్చాడు.

క్రిందకుదిగి అతని ప్రక్కనే నిలబడి క్రిందికిచూశాను. అప్పుడర్థమయింది షేర్‌సింగ్ ఎందుకంత ఆత్రంగా చూస్తున్నాడో.

క్రిందలోయలో ప్రశాంతంగా ప్రవహిస్తోన్న సిశాంగ్ నది ఒడ్డున ఓ అడవిజాతి స్త్రీ నగ్నంగా స్నానం చేస్తోంది. ప్రకృతిమధ్య ఏ అడ్డంకులూ లేకుండా పెరిగిన శరీరం. నడుంవరకూ నీళ్ళల్లో మునిగి, పైభాగం ఏ ఆచ్ఛాదనా లేకుండా... కేప్టెన్ షేర్‌సింగ్ కళ్ళు త్రిప్పకుండా చూస్తూన్నాడంటే ఆశ్చర్యపడాల్సినదేమీ లేదు.

షేర్‌సింగ్ నావైపు చూశాడు. "వెరీ సెన్సుయల్. ఎ వైల్డ్ బ్యూటీ!" అన్నాడు ఉత్సాహంగా నవ్వుతూ.

నేను నవ్వి తలవూపి, "యస్! యూఆర్ రైట్ సర్!" అన్నాను.

జీపు మళ్ళీ బయలుదేరి కొండ ఎక్కడం ప్రారంభించింది.

కేప్టెన్ సిగరెట్ వెలిగించి గట్టిగా దమ్ములాగి, నావైపు పరిశీలనగా చూశాడు.

"మేగ్నిఫిసెంట్ విజయ్! ఇందాకటి స్త్రీ ఎవరై వుంటుంది?" అన్నాడు సాలోచనగా.

"ఈ మిషిమీ కొండల్లో రకరకాల కొండజాతుల వాళ్ళు వుంటున్నారు సర్! మన నాగరికతా ప్రపంచానికీ, వాళ్ళకి చాలా దూరం. దూరంగా, కొండలపైన అడవులమధ్య గుహల్లోనూ, చెట్లక్రింద వుంటుంటారు. ఆ స్త్రీ అలాంటి మనిషే అయ్యుంటుంది" అన్నాను.

"ప్చ్! వాటె సిల్లీథింగ్! అంతరిక్ష యాత్రాయుగంలో ఇంకా ఇలా బ్రతుకుతోన్న మనుషులున్నారంటే ఆశ్చర్యం" అన్నాడు కేప్టెన్.

కాని సర్! ఒకోసారి ఇదికూడా ప్రకృతి పరిణామంలో ఓ భాగమేమో ననిపిస్తోంటుంది నాకు. మనం బ్రతుకుతోన్న ఈ అణుయుగంలో ఏరోజు మళ్ళీ మూడవ ప్రపంచ యుద్ధం మొదలవుతుందో, ఎప్పుడు ఆ యుద్ధ జ్వాలల్లో మానవాళి నశిస్తుందో చెప్పడం కష్టం. కానీ అదే జరిగితే చివరకు మిగిలేది, ఈ పర్వత శ్రేణుల్లో, నాగరికతకు దూరంగా బ్రతికే ఈ ఆటవికులే నేమో అనిపిస్తుంది."

"మే బి యూఆర్ రైట్! ఇంకా మన చెక్‌పోస్ట్ ఎంత దూరంలో వుంది?" అన్నాడు షేర్‌సింగ్ నా ఉపన్యాస

ధోరణికి కాస్త విసుగు ప్రదర్శిస్తూ.

నేను రోడ్డువైపు ఓసారి చూసి, "ఇంకా దాదాపు ముప్పై మైళ్ళుంటుంది సర్! మరో గంటన్నర ప్రయాణం."

"ఇంకా గంటన్నరా? రోడ్డు బాగా లేదా? బి.ఆర్.ఓ. నుండి వచ్చిన రిపోర్ట్ మొన్ననే చూశాను. ఫార్వర్డ్ పోస్ట్లకు వెళ్ళే రోడ్లన్నీ పర్ఫెక్ట్ కండిషన్లో వున్నాయని రాశారు వాళ్ళు."

"యస్ సార్! కాని పోనుపోను రోడ్డు ఏటవాలుతనం పెరుగుతుంది. మన చెక్పోస్ట్ దాదాపు భూమట్టానికి తొమ్మిదివేల అడుగుల ఎత్తులో వుంది. సముద్రమట్టానికి పన్నెండువేల అడుగుల ఎత్తులో వుంది. రోడ్ పర్ఫెక్ట్గా వున్నా కొండ అంచుల్లో వేయడంవలన ఎక్కువ వేగంగా పోవడం వలన ప్రమాదం వుంది. ప్రతీ కిలోమీటరుకు దాదాపు ఒక మలుపు వుంది. అందుచేత ఎక్కువ వేగం వెళ్ళలేం" అన్నాను నేను పరిసరాలను వివరిస్తూ.

"ఐ. సీ!" అన్నాడు కెప్టెన్ షేర్ సింగ్, నెమ్మదిగా ఏదో ఆలోచిస్తూ.

ఆ తర్వాత చెక్పోస్ట్ చేరేవరకూ ఎవ్వరం ఏమీ మాట్లాడుకోలేదు.

నార్త్ యీస్ట్ ఫ్రాంటియర్ ఏజన్సీలో, భారత్-చైనా సరిహద్దుకు ఇరవై మైళ్ళ దూరంలో వుంది మా చెక్పోస్ట్. షిల్లాంగ్లోవున్న మా హెడ్క్వార్టర్స్నుండి దాదాపు రెండువందల యాభైమైళ్ళ దూరం. సెక్టార్ హెడ్క్వార్టర్స్ 'చాంగెలె'నుండి వంద మైళ్ళు.

బోర్డర్ రోడ్స్ ఆర్గనైజేషన్స్ వాళ్ళు మా చెక్పోస్ట్ వరకు మాత్రమే ఈ కొండల్లో మోటారు వెహికల్స్ నడిపే రోడ్లు వేయగలిగారు. ఇక్కడనుండి సరిహద్దుకు వెళ్ళాలంటే కాలినడకన వెళ్ళవలసిందే. బరువైన

సామానులుంటే వాటిని కంచరగాడిదల మీద వేసుకొని తీసుకెళతాము బోర్డర్ చెక్‌పోస్ట్ దగ్గరకు.

మా సెంట్రల్ చెక్‌పోస్ట్‌కి సప్లయ్ రూట్స్‌లో కనెక్ట్ చెయబడిన ఫార్వడ్ బోర్డర్ చెక్‌పోస్ట్‌లు మొత్తం ఆరు న్నాయి. వాటికి యఫ్. సి. పి. 1, యఫ్. సి. పి. 2, యఫ్. సి. పి. 3 ..అని పిలుస్తుంటాము. ఇవి మా కాంప్‌కి బోర్డర్ వైపున ఉత్తర ఈశాన్య మూలనుండి, తూర్పు వైపువరకూ దాదాపు ఎనభైమైళ్ళ సరిహద్దు పొడవునా వున్నాయి.

మొత్తం ఆరు పోస్ట్‌లు ఇన్‌స్పెక్షన్ పూర్తి చెయ్యా డానికి షేర్‌సింగ్‌కు పదిరోజుల పడుతుంది. ముందు ఇక్కడనుండి బయలుదేరి మొదటి చెక్‌పోస్ట్‌కి వెళ తాము. అక్కడనుండి వరసగా ఆరు పోస్ట్‌లు చెక్‌చేసి పదవరోజున తిరిగి రావాలి.

నేను సెంట్రల్ పోస్ట్‌కి ఇంచార్జ కమాండెంట్ కావడం వలన, మొదటి మూడుపోస్ట్‌ల ఇన్‌స్పెక్షన్ వరకూ వుండి, తిరిగి మా బేస్‌కు వచ్చేస్తాను. మొదటి మూడుపోస్ట్‌లు చెక్ చేయడానికి నాలుగరోజులు పడు తుంది.

ఆ తర్వాత షేర్‌సింగ్ ఒక్కడే అక్కడి లోకల్ ఇంచార్జ్‌ల సహాయంతో మిగతా మూడు చెక్‌పోస్ట్‌లు తనిఖీ చేస్తాడు. ఈ ప్రయాణమంతా కంచరగాడిదల మీదే జరుగుతుంది.

## 2

సిగరెట్ వెలిగించి గట్టిగా పొగపీల్చి ఆకాశంవైపు చూశాను.

దక్షిణంవైపునుండి మేఘాలు గుంపులుగుంపులుగా వస్తున్నాయ్. నల్లని మేఘాలు ఉరిమినపుడు శబ్దం పర్వత

శ్రేణుల్లో ప్రతిధ్వనిస్తూ అనేకసార్లు వినిపిస్తోంది.

"బహుత్ బురా మౌసమ్ సాబ్" అన్నాడు హావల్దార్ రామ్‌నా ప్రక్కనేవచ్చి నిలబడుతూ.

నేను తలత్రిప్పి రామ్‌నావైపు చూశాను.

అతను మేఘాలవైపు చూస్తూ తనుచూసిన విషయం తనకేమాత్రం సంతోషం కలిగించనట్లు తల అటూ ఇటూ అడ్డంగా వూపుతున్నాడు. మంగోలియన్ ముఖ లక్షణాలు అతనిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఈ పర్వత శ్రేణుల్లో జీవనం గురించి రామ్‌నాకు తెలిసినంతగా నాకు తెలియదు. అస్సాం పర్వత శ్రేణుల్లో నివసించే 'షమాన్' జాతికి చెందిన మనిషతను. తరతరాలుగా ప్రకృతితో పోరాడి రాటుదేలిన మనుషులు వాళ్లు. అయిదడుగుల నాలుగంగుళాలు, పొట్టిగా కత్తిరించిన జుట్టు, కనిపించీ కనుపించని కనుబొమ్మలు, చిన్న కళ్లు, కండలు తిరిగిన శరీరం. క్రొత్తగా చూసేవాళ్ళకు అస్సామీయులంతా ఓలాగానే కనిపిస్తారు.

"అవును! పెద్ద వర్షం కురిసే సూచనలు కనిపిస్తున్నాయి" అన్నాను పీల్చిన సిగరెట్ పొగ వదుల్తూ.

వర్షం వచ్చే సూచనలు కనిపిస్తున్నా విడిచిన పొగ గాలిలో తేలుతూ అక్కడే వుండిపోయింది. గాలిలో కదలికలేదు. ఉక్కగా వుంది.

"లేదు సాబ్! పెద్ద వర్షంకాదు. తుఫానువచ్చే సూచనలు కనిపిస్తున్నాయి" అన్నాడు రామ్‌నా.

నేను ఆశ్చర్యంగా అతనివైపు చూశాను.

"తుఫానా?"

"జీహాఁ సాబ్! ఈ గాలి బిగించడానికి అర్థం అదే" అన్నాడు రామ్‌నా మళ్ళీ కదలివచ్చే దక్షిణ మేఘాల వైపు చూస్తూ.

నాకు వెంటనే కెప్టెన్ షేర్‌సింగ్ సంగతి గుర్తొచ్చింది. ఈ తుఫాను వీచేసమయానికి మధ్యదారిలో వుంటే బ్రతికి బయటపడడం కష్టం అతను. యఫ్.సి.పి. ఆరువ ఈ రోజు సాయంత్రానికి చేరుకోవాలి షేర్‌సింగ్.

ఈ సరికి పోస్ట్ ఫైవ్ నుండి బయలుదేరివుంటే పోస్ట్ సిక్స్ చేరేలోపల వాళ్లు తుఫానులో చిక్కుకోనే ప్రమాదం వుంది.

తుఫానులో దారి సరిగాలేని అడవిలో ఆ పర్వత శ్రేణులమధ్య ఎంత ప్రమాదమో తెలుసునాకు. పన్నెండు వేల అడుగుల ఎత్తున గాలివత్తిడి చాలా ఎక్కువ వుంటుంది. ఇక్కడ తుఫానులో సురక్షితమైన ప్రదేశంలో లేకుంటే బ్రతికి బయటపడడం కష్టం.

వెంటనే రేడియోమన్‌కు షేర్‌సింగ్ గురించి ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చాను.

మధ్యాహ్నం మూడుగంటలకే పోస్ట్ ఫైవ్ నుండి షేర్‌సింగ్ బయలుదేరి వెళ్ళినట్లు రిపోర్ట్ వచ్చింది. పోస్ట్ సిక్స్‌కు ఇంకా చేరుకోలేదు. పోస్ట్ ఫైవ్ నుండి బయలుదేరిన తరువాతనుండి కెప్టెన్ షేర్‌సింగ్ సిగ్నల్‌మన్ దగ్గర్నుండి రేడియో సిగ్నల్ రాలేదని రేడియోమన్ చెప్పాడు.

ఒక్కక్షణం చేతిగడియారం వంక చూసుకొన్నాను. అయిదున్నర కావొస్తోంది.

ప్రయాణంలో వున్నప్పుడు ప్రతిగంటకూ సిగ్నల్‌మాన్ రాఘవన్ మాకు సేఫ్టీ సిగ్నల్ పంపించాలి. మూడున్నరకు పోస్ట్ ఫైవ్ నుండి బయల్దేరి తరువాత ఇంతవరకూ సిగ్నల్ ఎందుకు పంపలేదు?

ఎందుకో ఒక్కక్షణం అనీజీగా ఫీలయ్యాను. అరునూరైనా ఆర్మీలో ఇన్‌స్ట్రక్షన్ ఇచ్చిన ప్రకారం అమలు

జరగాల్సిందే. రాఘవన్ అనుకొన్న టైమ్‌కి సిగ్నల్ పంపకుండా బీడీలు కాల్చుకొంటూ కాలక్షేపం చేస్తాడను కోవడం పొరపాటు.

రాఘవన్ మెసేజ్ పంపే ఫ్రీక్వెన్సీలో రిసీవింగ్ సెట్ ఆన్ చేసి కాచుకోమని చెప్పాను రేడియోమాన్‌కు.

ఉన్నట్టుండి వాతావరణంలో చిత్రమైన మార్పు వచ్చింది. అప్పటివరకూ కదలిక లేని ప్రకృతిలో ఒక్క సారి మార్పు వచ్చింది. కదిలే మేఘానికి ముందు బలమైన గాలి వీచడం ప్రారంభించింది. మైదాన ప్రాంతమైతే వీచే గాలితోబాటు దుమ్ము లేచి తీవ్రత చూడడానికి కని పించేది. ఈ పర్వత శ్రేణుల్లో బలంగా వీచేగాలికి వంగు తోన్న చెట్లు కొమ్మలు, ఎగిరివస్తోన్న ఆకులుతప్ప ఏం కనిపించడంలేదు.

వెలుతురుతగ్గి, హఠాత్తుగా సూర్యాస్తమయం అయి నట్లనిపిస్తోంది. నల్లని మబ్బుల్లో చటుక్కున మెరసిన మెఱపు, వెంటనే పెద్ద శబ్దంతో ఉరుములు. ఈ మిషిమి ప్రాంతంలో తుఫానును చూడడం ఇదే మొదటిసారి నాకు.

బలంగా వీచేగాలికి ఎగిరిపోకుండా 'బెర్రీ' (టోపీ) మీద చెయ్యిపెట్టుకుని జవానులు హడావిడిగా బారెక్స్ మీద, బయటవున్న సామాన్లమీద టార్పాలినులు కప్పు తున్నారు.

తలమీద పెట్టుకొన్న చేతిమీద పెద్ద చినుకుపడింది. చల్లగా మంచుముక్క పడినట్లువుంది. తలెత్తి చూశాను. టపటప మరో రెండు చినుకులు ముఖంమీద పడ్డాయి. తుఫాను ప్రారంభమయింది అనుకొన్నాను.

బలంగా వీచేగాలితోపాటు ఆకులు, ఎండిన చెట్టు కొమ్మలు గాలిలో ఎగిరి వస్తున్నాయి. లోపలికి వెళ్ళి

రేడియోమన్ దగ్గరకి నడిచాను. కెప్టెన్ షేర్‌సింగ్ దగ్గర నుండి ఇంతవరకూ ఏమీ మెసేజ్ రాలేదని, పోస్ట్ సిక్స్ ఇంకా చేరుకోలేదని చెప్పాడు రేడియోమన్.

మళ్ళీ టైము చూసుకొన్నాను. ఆరు కావస్తోంది. గాలితోపాటు వర్షంకూడా వేగం పుంజుకొంది. నా మనసెందుకో కీడు శంకిస్తోంది.

# 3

గాలిని చీల్చుకుంటూ తలపైనుండి ఎగురుతూ వెళ్ళిపోయింది హెలీకాప్టర్.

చెట్లు పెళ్ళాగాన్నుండి సగం సగం కనిపిస్తూ క్రిందుగా ఎగురుతోంది హెలీకాప్టర్. ఈ చెట్ల ఎత్తున హెలీకాప్టర్‌ను నడపడం చాలా కష్టం. ప్రమాదకరం. అయినా తప్పదు. కెప్టెన్ షేర్‌సింగ్ బృందాన్ని వెతికి పట్టుకోవాలి మేము.

నాలుగు రోజుల తుఫాను తర్వాత ఈ అరణ్య ప్రాంతంలో కాలి బాటలన్నీ గుర్తు తెలియకుండా పోయినయ్. అక్కడక్కడా కూలిన 'సింకోనా' వృక్షాలు కష్టతరంగా వున్న మా ప్రయత్నానికి మరింత ఆటంకం కలిగిస్తున్నాయి.

కెప్టెన్ షేర్‌సింగ్‌గాని, సిగ్నల్‌మన్ రాఘవన్‌గాని, వాళ్ళతో వున్న జవాన్‌గాని ఇంకా బ్రతికే వున్నారనే నమ్మకం లేదు నాకు. నాలుగు రోజులు ఆగకుండా కురిసిన వర్షంలో, బలమైన వృక్షాల్ని కదిలించివేసిన తుఫానుగాలిలో చిక్కుకొని వాళ్ళు బ్రతికి బయటపడివుంటారనుకోవడం లేదు.

అయినా తప్పదు; ఈ కొండప్రాంతంలో ఏ గుహలోనో, చెట్టు తొర్రలోనో వాళ్ళింకా కొనవూపిరితో

వుండవచ్చు. బ్రతికుంటే మాకు సిగ్నల్ ఎందుకు పంప లేదు? రేడియో చెడిపోయిందా?

తుఫాను తగ్గుముఖం పట్టిన క్షణంనుండి పోస్ట్ ఫైవ్, సిక్స్‌ల మధ్య ఏరియా అంతా నేనే స్వయంగా వుండి గాలిస్తున్నాను. ఓ గంట క్రితమే 'చాంగెల్' నుండి మాకు సాయంగా హెలీకాప్టర్‌ను కూడా పంపించారు.

టైము మధ్యాహ్నం పన్నెండు కావొస్తోంది. దాదాపు ఆరుగంటల బట్టి వెతుకుతున్నాము. కేప్టెన్ సింగ్ ఈ ప్రాంతం వచ్చివుంటే మాకు ఏదో ఒక ఆధారం దొరికి వుండేది.

దూరంగా సికాంగ్ నది అతివేగంగా నురుగులు కక్కుతో ప్రవహిస్తోంది. కేప్టెన్ సింగ్ బృందం ఆ నదిలోపడి కొట్టుకొని పోలేదుగదా?

నిజంగా అలాగే జరిగివుంటే వాళ్ళ శవాలు కూడా మాకు దొరకడం అసంభవం.

బ్రహ్మపుత్రనది పాయ సికాంగ్. ఈ మిషిమి కొండల్లో కురిసే వర్షమంతా ఈ నదిగుండానే క్రిందికి చేరుకుంటుంది. డెల్టా ప్రాంతంలో నదిలాగా ఏ అడ్డం కులు లేకుండా సాఫీగా వుంటుంది. ఆ నీటి వేగానికి ఏ వస్తువైనా బండరాళ్ళకు కొట్టుకొని ముక్కలవ్వాల్సిందే.

జేబులోంచి విజిల్ తీసి రెండు సార్లు గట్టిగా వూదాను.

అన్ని పక్కలా వెతుకుతున్న వాళ్ళంతా వెనక్కి తిరిగి వచ్చారు. అలిసిపోయారు వాళ్ళు, ప్రొద్దుననుండి ఈ అడవిలో వెతుకుతూ. ఓ అరగంట లంచ్ బ్రేక్ కు ఆర్డరివ్వమని రామ్‌నాథ్‌కు చెప్పి, చెట్టుక్రింద బ్లాంకెట్ మీద కూర్చొని వున్న డాక్టర్ కపాడియా దగ్గరకు నడిచాను.

డాక్టర్ కపాడియా ఆర్మీ మెడికల్ కోర్స్‌లో మేజర్. మా పోస్ట్‌కి ఎట్టాచ్ చెయ్యబడిన మెడికల్ ఆఫీసరు. రాంక్‌లో నాకన్న పెద్దవాడైనా, నాది రెగ్యులర్ ఆర్మీ రాంక్ కావడంవలన నేనే మా పోస్ట్ ఇంచార్జిని. అవసరం కలగొచ్చునన్న ఉద్దేశ్యంతో అతన్ని మాతో తీసుకొచ్చాను.

హెలీకాప్టర్ రొద చేసుకుంటూ మళ్ళీ మాపైకి ఎగిరి వచ్చింది. మేము కూర్చున్న చోట చెట్లు లేకుండా వుండడంవలన చక్కగా కనిపిస్తోంది. క్రిందకు దిగడానికికూడా సమతలంగా వుండడంవలన అనుకూలంగా వుంది.

హెలీకాప్టర్ అక్కడే గుండ్రంగా ఓసారి తిరిగి క్రిందకు దిగటం మొదలుపెట్టింది.

హెలీకాప్టర్ క్రిందకు దిగగానే దగ్గరకు నడిచాను. లోపలనుండి హెడ్‌క్వార్టర్స్‌నుండి వచ్చిన సబ్-లెఫ్టినెంట్ క్రిందకు దిగాడు.

"ఎని లక్?" అడిగాను ఆతృతగా.

"ఐ హోప్ సో! కొండకి ఇంకా లోపలకు నది ఒడ్డుకు దగ్గరగా ఎవరో పడివున్నారు"—

"మీ వైపు మాడలేదా?"

"లేదు. ప్రాణం లేదని నా అనుమానం. క్రిందగా ఎగరడానికి అవకాశం లేదు. చెట్లకొమ్మలు మరీ దగ్గరగా వున్నాయి."

"ఎంత దూరం వుంటుంది?"

"ఇక్కడకి రెండు కిలోమీటర్ల ఎగువకు. నది ఒడ్డునే వస్తే మీకు రావడానికి తేలికగా వుంటుంది."

"అచ్ఛా! పైలట్‌నుగూడా పిలిచి లంచ్ పూర్తి

చెయ్యండి. వెంటనే వెళదాం" అన్నాను నేను లేస్తూ.

# 4

హెలీకాప్టర్ పైన ఎగురుతూ దారి చూపెడుతుంటే, నది ఎగువ ఒడ్డున పడివున్న శవం దగ్గరికి నలభై నిము షాల్లో చేరుకొన్నాం.

ముదురాకు పచ్చరంగు యూనిఫాం బురదతో మర కలు పడివుంది. బోర్లాపడివుంది శవం.

నేనూ, మేజర్ కపాడియా ఇద్దరం దగ్గరగా నడి చాము. ప్రాణం పోయి మూడు నాలుగురోజులై వుంటుం దనుకొంటాను. శవం వాసన వేస్తోంది.

శవం కెప్టెన్ సింగ్‌దిగాని, రాఘవన్‌దికాని కాదు. బహుశా పోస్టు ఫెవ్ నుండి వాళ్ళవెంట వచ్చిన ఎస్కార్ట్ జవాన్‌ది అయ్యుండాలి. మెడమీద పురుగులు తొలి చేస్తున్న గాయం కనిపిస్తోంది. ఒక్క క్షణం కడుపులో త్రిప్పినట్టయింది నాకు.

మేజర్ కపాడియా వంగి ఆ గాయంలోనుండి బయ టకి కనిపిస్తోన్న పొడవుపాటి కర్రను బయటకు లాగాడు. మామూలుగా చూస్తోంటే ఆ కర్రను ఆ జవాన్ మెడ లోంచి గుచ్చి భూమిలో పాతినట్లు అనిపిస్తోంది.

అయిదడుగుల పొడవుంది కర్ర, చివర కత్తికన్నా సూదిగా, పదునుగా మొన చెక్కివుంది.

"బ్లడీ క్రూడ్ వెపన్! ఎవరు చంపారితన్ని ఇలా?" అన్నాడు కపాడియా కర్ర కొనవైపు అసహ్యంగా కని పిస్తోన్న పదార్థాన్ని చూస్తూ.

హావల్దార్ రామ్‌నా ముందుకు వచ్చి ఆ ఆయుధం వైపు పరీక్షగా చూశాడు.

"ఈ పర్వతంలో నివసించే ఆటవికుల ఆయుధం అది. లోహంతో చేసే వస్తువులు వాడరు వాళ్ళు. రాళ్ళ

తోనూ, కర్రలతోనూ ఆయుధాలు తయారుచేసుకుంటారు. 'బాజూం' అని అంటారు ఆ ఆయుధాన్ని. కొసని విషం పూసి వుంటుంది."

"ఆటవికులు జవాన్లతో తగువు పెట్టుకొన్నట్లు వినలేదు నేను ఇంతవరకూ. ఇతన్ని ఎందుకు చంపారు? కేప్టెన్ సింగ్, సిగ్నల్‌మన్ రాఘవన్ ఇద్దరూ ఏమయ్యారు?" అన్నాను ఇంకా నమ్మలేనట్లు జవాన్ శవం వంక చూస్తూ.

"ఆటవికులు దాడిచేస్తుంటే వీళ్ళు చూస్తూ వూరుకోరు కదా. ఆధునికమైన ఆయుధాలు వున్నాయి వీళ్ళ దగ్గర. ఆటోమేటిక్ వెపన్స్ ముందు ఆటవికుల కర్రలు పనికిరావు. జవాన్‌ను చంపుతోంటే కేప్టెన్ సింగ్ చూస్తూవున్నాడని అనుకోను" అన్నాడు మేజర్ కపాడియా ఏదో ఆలోచిస్తున్నట్లు.

రామ్‌నా అడ్డంగా తల వూపాడు. "మనుషుల్ని చంపేంత క్రూరులు కారు ఈ ఆటవికులు. నాగరికుల్ని చూస్తే తప్పించుకొని దూరంగా పారిపోతారు. కాని.." దూరంగా ఓ జవాన్ అరిచిన అరుపుకు రామ్‌నా కంఠం ఆగిపోయింది.

ఒక జవాన్ పరిగెత్తుకొంటూ మా దగ్గరికి వచ్చాడు. ఏమిటన్నట్లు చూశాను అతని వంక.

"సాబ్! మరో శవం వుంది అక్కడ" అన్నాడు తను వచ్చినవేపు వేలు చూపెడుతూ.

"ఎవరిది?"

"ఎవరో ఆడవిజాతి మనిషి. ఆడది" అన్నాడతను కళ్ళు వచ్చినవేపు త్రిప్పకుండా.

రామ్‌నా నుదురు ఒక్క క్షణం ఏదో ఆలోచిస్తున్నట్లు ముడతలు పడింది.

"రండి సాబ్!" అన్నాడు ఆ వైపు దారి తీస్తూ.

ఓ, పందగజాల దూరంలో చెట్ల మధ్య చిన్న ఖాళీ సలం వుంది. మధ్యలో ఓ స్త్రీ శవం వెల్లకిలా పడుంది. పూర్తిగా నగ్నంగా, చూడ్డానికి చాలా అసహ్యంగా కనిపిస్తోంది. గుండెల్లోంచి, బొడ్డులోనుండి రెండూ 'బాణాల'లు నేలలోకి దిగేసివున్నాయి. గాయాల దగ్గర ఏవో పురుగులు పుట్టలా వున్నాయి. కనుగుడ్లు ఏ పక్షులో పొడుచుకొని తినివుండాలి... చర్మం వెనక్కి సాగి ముందు పళ్ళు భయంకరంగా కనిపిస్తున్నాయి. ఆ దృశ్యం ఇక చూడలేక ముఖం త్రిప్పుకున్నాను.

"ఘూస్లీ!" అన్నాడు కపాడియా ఊపిరి అందనట్లు.

# 5

రామ్‌నా చుట్టుప్రక్కల ఇంకా ఎవరైనా కనిపిస్తారేమో వెతకమని ఇద్దరిద్దరు జవాన్‌లని జతగా నాలుగు ప్రక్కలకీ పంపించాడు.

టైము చూసుకొన్నాను. రెండున్నర కావొస్తోంది.

"బ్లడీ ఘూస్లీ! ఎందుకిలా జరిగింది?" అన్నాను సిగరెట్ వెలిగించి.

రామ్‌నా ముఖం బిగుసుకొనివుంది. దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు అతని నుదురు ముడతలు పడింది.

"బహుశా ఆ జవాను ఆ ఆడవి మనిషిని అనుభవించి వుండాలి!" అన్నాడు చివరికి.

"వాట్?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"ఈ కొండజాతి మనుషులకు స్త్రీ పురుష సంబంధాల గురించి మన నాగరిక ప్రపంచంకన్నా పట్టింపు లెక్కువ. ఏ స్త్రీ గాని, పురుషుడు గాని ఇతరులతో సంపర్కం పెట్టుకొన్నట్లు తెలిస్తే బాణంతో నేలకు

గుచ్చి చంపేస్తారు. జవాన్ శవం చూడగానే నా కా అనుమానం కలిగింది. ఈ ఆడమనిషి శవంతో అది ధృవ పడింది. కేప్టెన్ సాబ్ కూడా ప్రమాదంలో పడి వుండాలి బహుశా!'' అన్నాడు రామ్‌నా.

''హౌ ఇంక్రెడిబుల్! వీళ్ళదగ్గర రైఫిల్స్ వున్నాయి. వాళ్ళు వచ్చి చంపుతోంటే చూస్తూ వున్నారంటావా?'' అడిగాడు మేజర్ కపాడియా నమ్మలేనట్లు.

కాని ఆ ప్రశ్నకి సమాధానం వెంటనే లభించింది. చుట్టుప్రక్కల వెతకడానికెళ్ళిన ఇద్దరు జవాన్లు పరిగెత్తుకొంటూ మా దగ్గరికొచ్చారు.

''ఏమిటి? ఎవరన్నా కనిపించారా?''

''జీ హాఁ సాబ్! కొండలోపలివైపు ఓ గుహ దగ్గర శవాలుగుట్టలుగా పడివున్నాయి'' అన్నాడో జవాను. అతని కంఠంలో గొప్ప ఎక్సయిట్‌మెంట్ కనిపిస్తోంది.

వెంటనే చకచకా గుహ దగ్గరికి నడిచాము.

దాదాపు ఓ పదిమంది కొండజాతివాళ్ళ శవాలు గుహ ద్వారానికి పది గజాల దూరంలో చెల్లాచెదురుగా పడివున్నాయి. శవాల్ని చూస్తోంటే ఇదివరకట్లా అసహ్యం పుట్టలేదు. ఏం జరిగిందోనన్న ఉత్సుకత ఎక్కువయింది.

దాదాపు అంతా రైఫిల్ గుళ్లు తగలడం వలన చనిపోయారని ఆ శవాలమీది గాయాలు చూస్తోంటే అరమవుతోంది. బుల్లెట్ శరీరంలో ప్రవేశించిన చోట సన్నని రంధ్రం, శరీరంలోనుండి బయటకు వచ్చినవైపు దాదాపు నాలుగైదు అంగుళాల వెడల్పు వున్న గాయాలు. చాలా దగ్గరగా రైఫిల్ పేల్చడం వలన అలా గాయాలు ఏర్పడతాయి.

వర్షం కురియడం వలన కారిన రక్తమంతా నీళ్ళతో

కలిసి ఇంకిపోవడమో, చుట్టూ ప్రాకిపోవడమో జరిగుండాలి. పెద్దగా రక్తం కనిపించడంలేదు. మామూలుగా అయితే పది చిన్న సైజు రక్తం మడుగులుండేవి అక్కడ.

"లెఫ్టినెంట్ విజయ్! కమ్ హియర్!" అరిచాడు కపాడియా దూరంగా వున్న చెట్టుదగ్గరనుండి.

నేను కపాడియా దగ్గరకు నడిచాను. ఈ శవాలకు కారణం బహుశా కెప్టెన్ సింగ్ అయ్యుండాలి. అతను, సిగ్నల్‌మన్ రాఘవన్ బ్రతికే వుండాలి.

మేజర్ కపాడియా చూడమన్నట్లు భూమివైపు సైగ చేశాడు.

ఒక్క క్షణం ఆశ్చర్యపోయాను.

ఆరడుగుల పొడవు, రెండడుగుల వెడల్పున దాదాపు అడుగు లోతున ఓ గొయ్యి తవ్వివుంది. వర్షం నీళ్లు సగం సగం ఇంకి బురదగా కనిపిస్తున్నాయి. ప్రక్కనే త్రవ్వితీసిన మట్టి గుట్టగా పోసివుంది.

అసలు ఆశ్చర్యం కలిగించిన విషయం అదికాదు. గోతిలో పైకి కనిపిస్తూ ఓ వస్తువు వుంది. మట్టి త్రవ్వడానికి వుపయోగించే 'షావెల్' అది. 'ఇండియన్ ఆర్మీ' అని నల్లని రంగుతో వ్రాసిన అక్షరాలు దాని పిడిమీద స్పష్టంగా కనిపిస్తున్నయ్.

"ఎవరో మన వాళ్ళు ఈ గోతిని త్రవ్వినట్టుంది" అన్నాడు కపాడియా అటే చూస్తూ.

"అవును. కెప్టెన్ సింగ్ దగ్గర మాం టెనీరింగ్ అండ్ కాంపింగ్ సెట్ అంతా వుంది. చూస్తోంటే ఏదో శవాన్ని పాతిపెట్టడానికి త్రవ్వినట్టుంది" అన్నాను.

అవును! ఆరడుగుల పొడవు రెండడుగుల వెడల్పు వున్న గోతులు శవాన్ని పూడ్చడానికికాక దేనికి? ఎవరి

శవం? ఒక్కసారి గుండె ఝల్లుమంది. ఎందుకా సమాధి సగం త్రవ్వి వదిలేశారు?

మేజర్ కపాడియా తల వూపాడు అవునన్నట్లు.

"ఇంతకీ కేప్టెన్ సింగ్ ఏమయినట్లు?"

రామ్‌నా ఎప్పుడు దగ్గరగా వచ్చాడో గమనించ లేదు నేను. అతను దగ్గరికి రాగానే ఏమిటన్నట్లు చూశాను.

రామ్‌నా చేత్తో గుహవైపు చూపించాడు.

"టార్క్. డోన్ట్ యాక్ట్! ఏమిటది?" అరిచాను.

"కెప్టెన్ సింగ్!" అన్నాడు రామ్‌నా చటుక్కున వెనక్కి తిరిగి గుహవైపు నడుస్తూ.

అతనన్న మాటలు అర్థమవడానికి రెండుక్షణాలు పట్టింది.

రెండంగల్లో గుహదగ్గరకి చేరుకొన్నాను. నా వెనకే కపాడియాకూడా వచ్చాడు. అప్పుడే గుహదగ్గర నలుగు రైదుగురు జవాన్లు వచ్చున్నారు. రామ్‌నా చేతిలో ఫైవ్ సెల్స్ టార్చివుంది.

"ఎక్కడ?" అన్నాను చికాగ్గా.

రామ్‌నా లైట్ వెలిగించి గుహాలోపలి భాగానికి ఫోకస్ చేశాడు. లైట్ కాంతిలో కనిపించిన దృశ్యం చూసి ఒక్కక్షణం కొయ్యబారిపోయాను.

కెప్టెన్ సింగ్ శరీరం గుహాలోపల చేరగిలబడివుంది. మాకు కనిస్తున్నవైపు కణతదగ్గరనుండి రక్తం చెంపల మీదుగా యూనిఫాంమీదకు కారి గడ్డకట్టుకొని వుంది. ప్రక్కకు పడిపోయివున్న చేతిలో 'ఆర్మీ స్పెషల్' పిస్తోలు నల్లగా మెరుస్తోంది.

సింగ్‌కు ఎదురుగా గోడకు ఆనుకొని రాఘవన్ శరీరం వుంది, కాళ్లు చాపుకొని కూర్చొన్నట్లు.

పెద్ద వెడల్పయిన గుహ కాదది. ఆరడుగుల వెడల్పు వుందనుకొంటాను ముఖద్వారం దగ్గర. లోపలకు వెళ్ళే కొలది విశాలంగా పదడుగుల వెడల్పువుంది. చిన్న గుహ. ఏ పురాతన యుగంలోనో ఆదిమమానవుడి గృహం అయుండాలి అది. కప్పు చాలా క్రిందకు వుంది. తలవంచి లోపలకు నడిచాను.

గుప్పున వాసన కొట్టింది. శవం కుళ్ళిన వాసన. ఒళ్లు తెమిరే వాసన. కర్చీఫ్ తీసి ముఖానికి అడ్డం పెట్టుకొన్నాను.

నా ప్రక్కనే రామ్‌నా, వెనుక కపాడియా లోపలకు వచ్చారు.

కెప్టెన్ సింగ్ శరీరంలో ప్రాణంలేదని స్పష్టంగా తెలుస్తోంది. అటూ ఇటూ కదుల్తోంటే కాలిక్రింద 'ఎంప్టీ బుల్లెట్ కేస్'లు తగుల్తోన్నాయ్.

రామ్‌నా టార్చి కాంతి రాఘవన్ వైపు త్రిప్పాడు. అతని నుదురుమీద పిస్తోలు గుండు చేసిన చిల్లు చూడగానే ఆశ్చర్యపోయాను.

"హత్య, ఆత్మహత్య" అన్నాను కెప్టెన్ సింగ్ చేతిలో పిస్తోలువంక చూస్తూ.

"ఐ డోంట్ థింగ్ సో!" అన్నాడు కపాడియా వంగి రాఘవన్‌ని చూస్తూ.

నేను, రామ్‌నా కపాడియావైపు చూస్తూ వుండిపోయాము.

"యస్! ఐయామ్ రైట్" అన్నాడు కపాడియా రాఘవన్ భుజంమీద అప్పుడే కనిపించిన గాయం చూస్తూ. "బహుశా బాణం వలన అయిన గాయం అనుకొంటాను. ఆ విష ప్రభావంవలన మరణించాడు. నుదుటి మీది పిస్తోలు గాయం తరవాత అయివుండాలి."

"వాట్ డు యు మీన్?" అన్నాను ఆశ్చర్యంగా.

"దట్సిట్! ఎందుకో తెలియదు!" అన్నాడు కపాడియా లేచి నిలబడుతూ.

నేను రాఘవన్ శవం వంకా, కెప్టెన్ సింగ్ శవం వంకా మార్చి మార్చి చూశాను నమ్మలేనట్లు. రాఘవన్ శవమంతా బురదబురదగా వుంది.

ఏం జరిగిందసలు?

గోడ ప్రక్కనే రెండు సెల్ఫ్‌లోడింగ్ రైఫిల్స్ పడి వున్నాయి. జాగ్రత్తగా ఒకదానికి బోల్ట్ వూడదీశాను. ఎంప్టీ షెల్ ఎగిరి బయట పడింది. లోపల మాగజైన్ ఖాళీగా వుంది.

"విజయ్! సీ దిస్!" అన్నాడు కపాడియా, సింగ్ శవం ప్రక్కనే పడివున్న ఓ నల్లని కవర్‌వున్న పుస్తకాన్ని వంగి తీస్తూ.

కెప్టెన్ సింగ్ డైరీ అది. ఎక్సర్‌సైజు నోటుపుస్తకం సైజులో సగంవుంది. టార్చి వెలుగులో చకచకా పేజీలు త్రిప్పాను. చివరి నాలుగు పేజీలదగ్గర ఆగిపోయాను. కెప్టెన్ సింగ్ చనిపోయేముందు రాసిన నాలుగు పేజీలు అవి. గుహబయటికి వెలుతురులోకి నడిచాను.

బయట ఓ జవాన్ ముక్కలైన సిగ్నలింగ్ సెట్ ఒకటి ప్రక్క చెట్లగుబురులోంచి బయటకు లాగుతోన్నాడు.

పోస్ట్ ఫైవ్ నుండి బయలుదేరిన దగ్గర్నుండి జరిగిన విషయాలన్నీ వివరంగా వ్రాశాడు కెప్టెన్ సింగ్. సైన్యంలో శిక్షణవల్ల జరిగిన ఉపయోగం అది. చకచకా చదవడం మొదలుపెట్టాను.

## 6

సాయంత్రం నాలుగున్నర కావొస్తోంది!

కెప్టెన్ సింగ్ చేతిలో మేప్‌తో ఒకసారి లాండ్ మార్క్స్ చెక్ చేసుకొని తృప్తిగా తలవూపాడు.

ఎదురుగా 'సికాంగ్' నది మెల్లగా ప్రవహిస్తోంది. ఎంచేతో సూర్యుడు మబ్బులచాటున దాక్కొన్నాడు. వాతావరణం చల్లగావుంది. మేప్ ప్రకారం కాస్త ఎగువన నది వెడల్పు తగ్గుతుంది. అక్కడ దాటడం తేలిక.

ఎక్కిన కంచర గాడిద దిగి తాళ్ళు చేత్తో పట్టుకుని నది ఎగువకు నడిపించాడు. సిగ్నల్ మన్ రాఘవన్, పోస్ట్ షైవ్ నుండి వెంటవచ్చిన ఎస్కార్ట్ జవాన్ అతని వెనకే నడిచారు.

నది ఎగువకు కాస్తదూరం వెళ్ళాక చటుక్కున ఆగి పోయాడు కెప్టెన్ షేర్‌సింగ్. నదిలో కాస్త లోతు ఎక్కువవున్న నీటిలో బండరాయి చాటున ఎవరో కొండ జాతి స్త్రీ అటుకేసి తిరిగి స్నానం చేస్తోంది.

చప్పుడు చెయ్యొద్దన్నట్టు సైగ చేసి పిల్లిలా ముందుకు అడుగులు వేశాడు సింగ్. మిగిలిన ఇద్దరూ ఇబ్బందిగా ముఖాలు చూసుకొన్నారు.

స్నానంచేసే స్త్రీ, చర్మపు దుస్తులు ప్రక్కనేవున్న బండరాతిమీద పెట్టింది.

కెప్టెన్ సింగ్ చప్పుడు చెయ్యకుండా వాటినితీసి వేరే పొదచాటున దాచేశాడు. తిరిగి వెళ్ళి నగ్నంగా, ఆహ్లాదంగా స్నానంచేస్తున్న ఆ స్త్రీని ఓ ప్రక్కనుండి చూస్తూ వుండిపోయాడు.

పసుపురంగు శరీరం, కనిపించీ కనిపించని కను బొమ్మలు, వెడల్పయిన నల్లని పెద్దకళ్ళు, వెడల్పయిన ముక్కు, బలంగా గుండ్రంగా సొంపుగా కదుల్తోన్న వక్షోజాలు. కెప్టెన్ సింగ్ పెదిమలు తడుపుకొంటూ కళ్ళార్పకుండా చూస్తున్నాడు.

దూరంగా నిలబడివున్న ఎస్కార్ట్ జవాన్ ఇబ్బందిగా రాఘవన్ వైపు చూశాడు. పురన్ అతని పేరు. అస్సాం మీజయుడు. ఈ కొండజాతి వాళ్ళగురించి అతనికి బాగా తెలుసు. ఆ స్త్రీ తాలూకు మగవాడు ఈ దృశ్యంచూస్తే చాలా రభస జరుగుతుందని అతడికి తెలుసు.

"ఏ అచ్చాకామ్ నహీ హై!" అన్నాడు రాఘవన్ వైపు చూస్తూ.

కళ్ళార్పకుండా ఆ స్త్రీనే చూస్తున్న రాఘవన్ కోపంగా పురన్ వైపు తిరిగాడు. "చుప్ రహో! సాబ్ కో గుస్సా ఆయేగా!" అన్నాడు.

ఈ సంభాషణ వినిపించి వుండాలి ఆ స్త్రీకి. చటుక్కున బెదిరిన లేడిలాగా వెనక్కి తిరిగి చూసి అదిరిపడి తన దుస్తులు పెట్టివున్న బండరాతికేసి పరిగెత్తింది.

అవి అక్కడ కనిపించక పోయేటప్పటికి ఏం చెయ్యాలో తోచని దానిలా ఒక్క క్షణం నిలబడి పోయింది.

కేప్టెన్ సింగ్ నవ్వుతూ ఆమె వైపు చూశాడు. అతని చేతుల్లో పది రూపాయలనోటు చూపెట్టాడు తీసుకోమన్నట్లు.

ఆ కాగితాల విలువ ఆ అడవి మనిషికి తెలియదని అతనికి తెలియదు. రాఘవన్ నవ్వుతూ వెనకనుండి వస్తున్నాడు.

చటుక్కున ప్రక్కకు తిరిగి చెట్లకేసి పరిగెత్తింది ఆ స్త్రీ.

కేప్టెన్ సింగ్ ఆలస్యం చెయ్యలేదు. లేడిని వేటాడు తోన్న పులిలా ఆ స్త్రీ వెనకే పరిగెత్తాడు. కాలి సత్తువకొద్దీ పరిగెడుతోంది.

గాలిలోకి ఒక్కసారి ఎగిరి ఆ స్త్రీ రెండుకాళ్ళ

పట్టుకొన్నాడు. పరిగెత్తుతోన్న ఆ స్త్రీ ఆ ఊపుకు షేర్‌సింగ్‌తో పాటు క్రిందపడిపోయింది.

కేప్టెన్‌సింగ్ పులిలా ఆమె మీద పడ్డాడు. ఒక కాలు ఆమె నడుంమీద అడ్డంగా వేసి రెండు చేతులతో రెండు భుజాలు నేలకి నొక్కిపట్టాడు. ఆ స్త్రీ అరవడం లేదు. నిశ్శబ్దంగా గింజుకొంటూ అతని పట్టునుండి తప్పించుకోవాలని చూస్తోంది. తన జాతి వాళ్ళెవరైనా ఈ దృశ్యాన్ని చూస్తే తనకు చావు తప్పదని తెలుసు.

నదిఒడ్డున నిలబడ్డ పురన్ ఒక్కక్షణం ఈ దృశ్యాన్ని చూసి అప్రతిభుడై నిలబడిపోయాడు. కొండజాతి వాళ్ళతో వైరం పెట్టుకోవడం మంచిదికాదు.

చెట్లప్రక్కగా నిలబడి రాఘవన్ ఆతృతగా వాళ్ళ దరివైపే చూస్తున్నాడు.

అప్పుడు చూసాడు పురన్ వాళ్ళని. దాదాపు పది మంది వుంటారు కొండజాతివాళ్ళు. చేతిలో సూదిలాంటి మొనలున్న పొడుగుకర్రలతో తమవేపే పరిగెత్తుకొంటూ వస్తున్నారు. దగ్గరలో వాళ్ళగూడెం ఉండివుండాలి. రాఘవన్ వైపు తిరిగి పారిపొమ్మని అరిచాడు.

అంతే! ఒక బాణం అతని వీపులో బలంగా దిగింది.

రాఘవన్ కూడా చూశాడు వాళ్ళను పురన్ అరుపు విని. చటుక్కున చెట్టుచాటుకు గెంతి, భుజానికి వ్రేలాడుతున్న సెల్ఫ్‌లోడింగ్ రైఫిల్ తీసి క్షణంలో లోడ్ చేశాడు.

కొండజాతి వాళ్ళంతా పురన్ శరీరంచుట్టూ గుమిగూడివున్నారు.

రాఘవన్ ఒక్క రౌండ్ ఆ గుంపువైపు గురిచూసి కాల్చాడు. అడివిమనిషి ఒకడు గట్టిగా అరిచి భుజంపట్టుకొని క్రిందకు ఒరిగిపోయాడు.

రైఫుల్ శబ్దం వినగానే అడివిమనుషు లందరూ చక చకా బండరాళ్ళచాటుకు పరిగెత్తారు.

"కమాన్ ఫాలోమీ!"—అరిచాడు కెప్టెన్ సింగ్ వెనకనుండి.

వెనక్కి తిరిగిచూశాడు రాఘవన్. కెప్టెన్ సింగ్ తన రైఫిల్ లాక్ చేసి ఆటవికుల గుంపువున్న వైపు చూస్తు న్నాడు. ఆ కొండజాతి స్త్రీ భయంభయంగా ఓ పొద ప్రక్కనుండి చూస్తోంది.

ఆ అడవిమనుషులు చెట్లచాటునుండి, పొదలచాటు నుండి మెల్లిమెల్లిగా ముందుకు కదులుతూ, ముందుకు వస్తున్నారు.

"ఎన్ని రైఫుల్స్ వున్నా ఈ చెట్లమధ్య ఫైట్ చెయ్యడం కష్టం. వెనక్కిపద"—అరిచాడు కెప్టెన్ సింగ్.

ఒకరు రైఫిల్ తో కవర్ చేస్తుంటే, రెండోవాళ్ళు వెనకదారి చూస్తూ ఒక్కో అడుగే వెనక్కి వెయ్య సాగారు. అడివిమనుషులు తుపాకిగుళ్లు తగలకుండా ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ చెట్ల వెనుక దాక్కుంటూ వస్తున్నారు.

రాఘవన్ జాగ్రత్తగా చుట్టూ కనిపిస్తోన్న చెట్లను పొదలను పరీక్షగా చూస్తూ వెనక్కి నడుస్తున్నాడు. ఏ పొదచాటునో, చెట్టుచాటునో ఎవరన్నా వున్నట్లు అను మానం కలిగితే అటుకేసి నర్వస్ గా ఓ గుండు కాలుస్తు న్నాడు.

మనుషులు ఎవరూ కనిపించకపోయినా వాళ్ళు మెల్లి మెల్లిగా తమవేపు కదులుతున్నట్లు ఎండిన కొమ్మలు, ఆకులు చేస్తున్న శబ్దంబట్టి తెలుస్తోంది.

"దేర్ షటీజ్"—అరిచాడు కెప్టెన్ సింగ్.

రాఘవన్ చూశాడు అటుకేసి. చెట్లకు అవతల కొండ

చరియలో చిన్న గుహ కనిపిస్తోంది.

అందులోకి గనుక చేరుకోగలిగితే, రేడియో మెసేజ్ పంపి సహాయం వచ్చేవరకూ సురక్షితంగా తమను తాము కాపాడుకోవచ్చు. చెట్లకు గుహకు మధ్య దాదాపు పదిహేను గజాల ఖాళీస్థలం వుంది.

చివరిసారిగా టపటపా నాలుగుగుళ్ళు కాల్చి గుహకేసి పరిగెత్తారు ఇద్దరూ, ముందు కెప్టెన్ సింగ్, వెనకాలే రాఘవన్.

ఒక్కసారి ఆటవికుల్లో సంచలనం కనిపించింది. అర్థం కాని భాషలో అరుపులు, కేకలు వినిపించాయి. పరిగెత్తుతున్న ఆ ఇద్దరికి అటూ ఇటూ 'బాణా'లు ఎగిరివచ్చి పడసాగాయి.

వీపుమీద గట్టిగా ఏదో తగిలిన శబ్దం వినిపించింది రాఘవన్‌కు. వీపుమీద ఆ సిగ్నలింగ్ సెట్ లేకపోతే ఆ బాణం ఈ సరికి తన శరీరంలో దూరివుండేదని తెలుసు రాఘవన్‌కు. కెప్టెన్ సింగ్ అప్పటికే గుహలోకి చేరిపోయాడు. ఎగిరి స్వర్గంలా కనిపిస్తోన్న గుహకేసి దూకాడు రాఘవన్.

ఇటీజ్ బేడ్ లక్! సరిగ్గా గుహలోకి దూరేసమయంలో ఓ బాణం రాఘవన్ జబ్బమీద గుచ్చుకొంది. ఒక్కసారి అరిచి వెల్లకిలా పడిపోయాడు గుహలోపలికి.

కెప్టెన్ సింగ్ చకచకా పదిగుళ్ళు గుహకేసి వస్తోన్న ఆటవికులకేసి పేల్చాడు. ఇద్దరు ముగ్గురు అరుస్తూ కూలిపోయారు. మిగిలినవాళ్ళు చెట్లచాటుకు పరిగెత్తారు.

"రాఘవన్! గెట్ ఇన్‌సైడ్!"_ అరిచాడు కెప్టెన్ సింగ్ రైఫిల్ రీలోడ్ చేస్తూ.

రాఘవన్ కదలలేదు. మాట్లాడలేదు. చలనంలేకుండా అలానే గుహ ముఖద్వారం దగ్గర పడివున్నాడు. వెనక

వీపుమీద రేడియో సిగ్నలింగ్ సెట్టువలన వెల్లికిలా పడ డంలో ఓ విచిత్రమైన భంగిమలో కనిపిస్తున్నాడు.

"రాఘవన్! కమ్ ఇన్‌సైడ్!" మళ్ళీ పిలిచాడు కెప్టెన్ సింగ్.

రాఘవన్‌లో చలనంలేదు. ఎందుకో ఒక్కసారిగుండె ఝల్లుమంది కెప్టెన్ షేర్‌సింగ్‌కు.

చకచక చెట్లవైపు రెండుగుళ్లు కాల్చి పొట్టమీద పాకుంటూ రాఘవన్ దగ్గరికి వెళ్ళాడు. ముక్కుదగ్గర వేలుపెట్టి చూశాడు. శ్వాస ఆడడంలేదు. ఆ బాణాల కు పూసే విషం చాలా ప్రమాదకరమైనదయ్యుండాలి.

చెట్లచాటున ఆటవికుల సంచలనం కనిపించడంలేదు. రాఘవన్ శరీరాన్ని తన శరీరానికి అడ్డంవచ్చేటట్లు రెండు చంకలక్రింద చేతులుపెట్టి ఎత్తిపట్టుకొని లోపలికి లాగాడు.

రాఘవన్‌లో ప్రాణంలేదని విచిత్రంగా ఓ ప్రక్కకు వ్రేళ్ళాడుతోన్న తలనుబట్టి తెలుస్తుంది.

చెట్టుచాటునుండి ఓ స్త్రీ అరచిన అరపు భయంక రంగా వినిపించింది. షేర్‌సింగ్ గుండె ఓ క్షణం దడదడ లాడింది.

రాఘవన్ శరీరాన్ని గుహలోపలి చీకట్లోకి లాగి, చక చకా ఖాళీ అయిన రైఫిల్ మాగజైన్‌ని తిరిగి లోడ్ చేశాడు. గుహబయట చెట్లచాటున ఆటవికులు చేస్తున్న శబ్దాలు, మాటలు వినిపిస్తున్నాయి.

గుహ నేలమీద బోర్లాపడుకొని, రైఫిల్ 'బట్'ను భుజానికి అదిమిపట్టి, చెట్లకేసి గురిచూశాడు. గుహకు, చెట్లకు మధ్య వందగజాల దూరంకూడా వుండదు. ఎవ రన్నా గుహదగ్గరికి రావాలని ప్రయత్నిస్తే పిట్టల్ని కాల్చి నట్లు కాల్చిచంపొచ్చు.

ఉన్నట్లుండి దూరంగా మేఘం ఉరిమిన శబ్దం విని పించింది. వెంటనే పెద్దపెట్టున గాలి వీచసాగింది. గుహ అడుగున పడుకొని చూస్తుంటే దూరంగా గాలికి విపరీతంగా ఊగిపోతున్న చెట్లకొమ్మల చివరలు కనిపిస్తున్నాయి.

కెప్టెన్ సింగ్ టైమ్ చూసుకున్నాడు. అయిదున్నర కావస్తోంది.

చెట్లచాటునుండి ఇద్దరు ఆటవికులు బయటకివచ్చిగుహ కేసి చూపిస్తూ ఏదో అరుస్తున్నారు. కెప్టెన్ సింగ్ ముఖంలో కండరాలు బిగుసుకున్నాయి. రైఫిల్ ఎత్తి ఒకడి గుండెలమీదికి గురిచేశాడు. ఆ దూరంలో గురితప్పే ప్రసక్తి లేదు. మెల్లిగా ట్రిగర్ నొక్కాడు.

రైఫిల్ ధ్వనిలో వాడు అరిచిన అరుపు వినిపించ లేదు. కాని బుల్లెట్ తగిలినవాడు ఒక్కగజం ఎగిరి వెనక్కిపడడంమాత్రం కనిపించింది. రెండోవాడు ఎగిరి దూకి చెట్లచాటుకు మాయమయ్యాడు.

కెప్టెన్ సింగ్ మళ్ళీ చాంబర్ లోడ్ చేసి ఓపిగ్గా కాచుకొని వున్నాడు. బయట ఎంతమంది ఆటవికు లున్నారో తెలియదు. కొద్దిగా వ్యవధి చిక్కితే రాఘవన్ దగ్గర వున్న సిగ్నలింగ్ సెట్ ద్వారా సెంట్రల్ పోస్టుకు సిగ్నల్ పంపొచ్చు.

వెలుతురు బాగా తగ్గి, బయట వస్తువులు మసక మసకగా కనిపిస్తున్నాయి. బయట వీస్తున్న గాలి వత్తిడి గుహలోపలకు కూడా తెలుస్తోంది. టపటప వర్షం చినుకులు పడడం ప్రారంభించాయి.

'మై గాడ్! ఐయామ్ ట్రాప్డ్'_ అనుకొన్నాడు కెప్టెన్ సింగ్ భయంగా.

*   *   *

కెప్టెన్ సింగ్ చివరి సిగరెట్ వెలిగించి రాఘవన్ శవంవైపు చూశాడు.

బాబ్జీ పూసిన విషంవలన కామాల్న్న-శరీరమంతా నల్లబడిపోయింది. నల్లబడిన ముఖంలో కనురెప్పలు తెరచుకొని తెల్లని కనుగుడ్లు తనవంకే చూస్తున్నట్లు భయంకరంగా కనుపిస్తున్నాయి. ఒక్కసారి గుండె ఝల్లుమనిపించింది సింగ్ కు.

బయట ఉరుములు మెరపులతో కుండపోతగా వర్షం కురుస్తోంది. భయంకరంగా వీచే గాలికి వానజల్లు ఒకోసారి గుహాలోపలకంతా పడుతోంది. మసకమసక చీకటిలో గుహబయటి చెట్లు, రాళ్లు భయంకరంగా కనిపిస్తున్నాయి.

బాబ్జీ తగిలినప్పుడు వెల్లికిలా పడడంవలన రాఘవన్ వీపుమీదున్న సిగ్నలింగ్ రిపేర్ చేయడానికి వీల్లేకుండా పగిలిపోయింది.

ఈ తుఫాను ఎప్పటికి తగ్గుతుందో తెలియదు. అప్పటివరకూ తనీ గుహాలో బందీయే.

దాదాపు పదిమంది ఆటవికుల్ని చంపాడు రైఫిల్ తో తుఫాను ప్రారంభమయే సమయానికి. ఇంకా ఎవరూ మిగిలివున్నట్లులేరు. ఉన్నట్లయితే ఈ తుఫానులోకూడా తనను చంపడానికి ప్రయత్నించేవాళ్ళే.

ఎక్కడో పెద్దమెరపు మెరసింది. ఇబ్బందిగా రాఘవన్ శవంవైపు చూశాడు షేర్ సింగ్.

ఒక్కసారి గుండె ఆగి కొట్టుకోవడం మొదలుపెట్టింది. రాఘవన్ శవం అటూ ఇటూ కదిలినట్లనిపించింది. కళ్ళు చిట్లించి చూశాడు ఎదురుగా గోడవారన ఆనించివుంచిన శవంవైపు. గుహాలో చీకటిగా వుండడం వలన ఆకారం తప్ప స్పష్టంగా కనిపించడంలేదు. తెల్లగా ఆనుగుడ్లు

మాత్రం తనవైపే చూస్తున్నట్లు కనిపిస్తున్నయ్.

ఉలికిపడి చూశాడు షేర్‌సింగ్. శవం కనురెప్పలు ఆడిస్తున్నట్లనిపించింది. సింగ్ కదలలేదు. రెండునిమిషాల పాటు ఊపిరి పీల్చినట్లు అలాగే చూస్తూ వుండిపోయాడు. నేలమీద పడిపోయిన సిగరెట్ తడికి ఆరిపోయింది.

'డామిట్! అనవసరంగా ఏదో ఊహించుకొంటు న్నాను'_అనుకొన్నాడు చకచకా కిట్ బేగ్‌లో టార్చి కోసం వెతుకుతూ.

బేగ్‌లోనుండి టార్చితీసి వెలిగించి రాఘవన్ శవం వైపు ఫోకస్ చేశాడు.

తెల్లని టార్చికాంతిలో శవం స్పష్టంగా కనిపిస్తోంది. కదలికలేదు. తెరచిన కనుగుడ్లు తనవేపు అలానే జీవం లేకుండా చూస్తున్నయ్.

టార్చి అలానే వెలిగించివుంచి రెయిన్‌కోటు తీసి తొడుక్కొన్నాడు. మౌంట్‌నీరింగ్ కిట్‌లోనుంచి 'షోవెల్' తీసి, టార్చి చేత్తో పట్టుకొని గుహాబయటికి నడిచాడు.

వర్షం తగ్గినా, గాలిమాత్రం విపరీతమైన వేగంతో వీస్తోంది. గాలి తోపిడికి వెనక్కి తూలబోయి గుహ అంచుపట్టుకొని నిలబడ్డాడు.

టార్చి ఆర్పేసి ఎదురుగా కనిపిస్తున్న చెట్లవైపు కళ్లు చికిలించుకొని చూశాడు. ఏమీ తెలియడంలేదు. అయిదు నిమిషాలసేపు కదలకుండా అలానే నిలబడ్డాడు. చుట్టు ప్రక్క లెవ్వరూ మనుషులున్న అలికిడిలేదు.

టార్చి వెలిగించి కుడిప్రక్కకు నడిచాడు. కాస్త దూరంలో చదునుగావున్న స్థలంచూసి టార్చి ఆర్పేశాడు.

'షోవెల్'తో చకచకా గోతిని తియ్యడం ప్రారం భించాడు. వర్షానికి తడిసి మెత్తబడడంవలన పెద్దకష్టం

కాలేదు. పావుగంటలో రాఘవన్‌ను పూడ్చిపెట్టడానికి సరిపోయేంత గొయ్యి తీశాడు. ఎక్కువలోతు లేదు. అడుగు అడుగున్నర వుంటుంది.

తవ్వడం పూర్తవ్వగానే వెనక్కి తిరిగి వెళ్ళి రాఘవన్ని రెండుచేతులమీద మోసుకొచ్చాడు. గోతిలో పారేసి పైన చకచక మట్టికప్పాడు. మళ్ళీ టార్చి వెలిగించి ఓసారి చుట్టు చూశాడు.

దూరంగా చెట్లకింద తను కాల్చిచంపిన ఆటవికుల శవాలు కనిపిస్తున్నయ్. గుండె ఝల్లుమంది కెప్టెన్ సింగ్‌కు.

టార్చి ఆర్పి చకచక గుహలోకి నడిచాడు.

*　　　　*　　　　*

గుహ వెనుక గోడకానుకుని నిద్రపోతున్న కెప్టెన్ సింగ్ బధకంగా కళ్ళు తెరిచాడు.

గుహలోపలంతా చీకటిగావుంది. బయట వెలుతురు వున్నట్లు మసక మసగ్గా కనిపిస్తోన్న చెట్లబట్టి తెలుస్తోంది.

వర్షం, గాలి, రాత్రిలానే ఇంకా ఎడతెరపి లేకుండా వున్నాయి. ఆవులించి చేతిగడియారం వంక చూసుకొన్నాడు. పదిన్నర కావొస్తోంది. ఉదయం అయి వుండాలి. రాత్రి మూడుగంటల వరకూ మేలుకొనే వున్నాడు తను.

భయంభయంగా ఆ చీకటిగుహలో ఆపుకోలేనంత నిద్ర వచ్చేవరకూ గడిపాడు. ఏ చిన్న శబ్దమైనా బెల్టులోని పిస్తోలు ఆవైపుకు గురిచేస్తూ, ఆకలితో, భయంతో గడిపాడు. నిద్రపట్టిన తరువాతకూడా అన్నీ పీడకలలే. రాఘవన్ గోతిలోంచి లేచివచ్చి గుహలో పడుకొన్నట్లు కలవచ్చింది.

సిగరెట్టుకోసం జేబులు తడుముకొన్నాడు. గుర్తొ

చ్చింది రాత్రి అయిపోయినట్లు.

అప్పుడు కలిగింది అనుమానం. తనుకాక ఇంకెవ్వరో గుహలో నిశ్శబ్దంగా వున్నట్లు.

ఊపిరి బిగబట్టి, చెవులు రిక్కించి విన్నాడు. ఏదైనా శబ్దం వినిపిస్తుందని. గుహలో అంతా నిశ్శబ్దంగావుంది. మెల్లిగా తలత్రిప్పి కుడిప్రక్కకు చూశాడు.

అంతే! ఒక్కక్షణంపాటు కొయ్యబారిపోయాడు. ప్రక్కగా ఓ గజందూరంలో ఎవరో గుహ గోడకు ఆను కొని కూర్చునివున్నారు. నల్లగా, లీలగా చీకట్లో ఆకారం మాత్రం కనిపిస్తోంది. అయిదునిముషాలపాటు రెప్ప వెయ్యకుండా శిలావిగ్రహంలా అటే చూస్తూ వుండి పోయాడు. ఎవరది?

"కౌన్ హై తుమ్?"_షేర్‌సింగ్ గొంతు గుసగుసల కన్నా కాస్త ఎక్కువ ధ్వనితోవుంది.

ఆ ఆకారం మాట్లాడలేదు. అలాగే చలనంలేకుండా గోడకు చేరగిలబడి కూర్చొని వుంది.

కెప్టెన్ సింగ్‌కు గుండెలు దడదడ కొట్టుకొంటు న్నయ్. నిశ్శబ్దంగా బెల్టులోనుండి పిస్తోలుతీసి పట్టుకొని మరోచేత్తో టార్చిలైటు అందుకొన్నాడు. పిస్తోలును గురి చేసి ఆ ఆకారంమీద టార్చి వెలిగించి వేశాడు.

"మైగాడ్!"_అరిచాడు కీచుగొంతులో ఆ ఆకారం ముఖం చూడగానే.

చేతిలోంచి టార్చిలైటు జారి క్రిందపడింది పెద్ద శబ్దంతో. ఇదెలా జరిగింది? ఎగిరి గంతువేసి నిలబడి చీకట్లో ఆ ఆకారంవంక అలానే చూస్తూ నిలబడ్డాడు.

రాఘవన్ ఇక్కడికెలా వచ్చాడు?

అవును! ఆ ఆకారం రాఘవన్ శవం! రాత్రి తను పాతిపెట్టిన శవం మళ్ళీ ఇక్కడికెలా వచ్చింది. ఒక్క

క్షణం అవులా వణికాడు షేర్ సింగ్. రాఘవన్ దయ్య మయ్యాడా?

గుహా బయట ఎడ తెరపి లేకుండా వర్షం కురుస్తూనే వుంది. తుఫాను గాలి పెద్దశబ్దం చేసుకొంటూ వీస్తోంది. ఈ భయంకరమైన తుఫానులో తను ఈ గుహాలోనుండి ఇంకెక్కడికయినా వెళ్ళాలని ప్రయత్నించడం ఆత్మ హాత్యా సదృశ్యం అని తెలుసు షేర్ సింగ్ కు.

ఎలా జరిగిందిది? తన చేతుల్తో స్వయంగా పూడ్చి పెట్టబడిన రాఘవన్ తెల్లవారేప్పటికి సమాధిలోనుండి ఎలా బయటికి వచ్చాడు.

శవాలు నడుస్తాయా? లేక ఎవరైనా రాఘవన్ శవాన్ని గోతిలోనుండి త్రవ్వితీసి మళ్ళీ గుహాలోకి చేర్చారా? ఎవరై వుంటారు ఈ తుఫానులో అంతకష్టపడి తనను భయపెట్టటానికి ప్రయత్నించే వాళ్ళు? ఆడివి మనుషులా? కాదు అని తర్కం చెపుతోంది. తను ఒంటరిగా దొరికితే చంపుతారు కానీ, భయపెట్టాలని ప్రయత్నించరు వాళ్ళు.

అంత చల్లదనంలోనూ ఒళ్ళంతా చెమటలు పడు తోన్నయ్ షేర్ సింగ్ కు. క్రిందపడిన టార్చితీసి మళ్ళీ రాఘవన్ శవాన్ని పరీక్షించాలంటే భయంగావుంది.

తను తొమ్మిదేళ్ళ మిలటరీ జీవితంలో మొట్టమొదటి సారి దేవుణ్ణి మనసారా గుర్తుతెచ్చుకొన్నాడు షేర్ సింగ్.

నీరసంగా రాఘవన్ శవంవంకే చూస్తూ నేలమీద కూలబడ్డాడు. ఎలా జరిగిందిది?

శవంకేసి చూస్తూ ఆలోచిస్తున్న కొలదీ తల తిరిగిపో తోంది. కళ్ళమ్మట తెలియకుండానే నీళ్ళుకారుతోన్నయ్.

"భగవాన్ కృపాకరో!" అనే మాటలు తెలియ కుండానే పెదవులు పలుకుతోన్నయ్.

ఎంతసేపు అలా గడిచిందో ఎప్పుడు అలా నీరసంవల్ల,

భయంవల్ల నిద్రపోయాడో తెలియదు. నిద్ర మెలుకువ వచ్చేప్పటికి సాయంత్రం నాలుగయింది. భయంగా శవం వైపు చూశాడు.

రాఘవన్ శవం అలాగే కదలకుండా, ఏ మాత్రం చలనం లేకుండా గోడకు చేరగిలబడివుంది. విపరీతమైన ఆకలి, భయం, ఒంటరితనం, షేర్‌సింగ్‌ను పిచ్చెక్కిస్తున్నాయి. మిలిట్రీలో తనకిచ్చిన శిక్షణ, వివేకం తను చూస్తున్న సత్యానికి అర్థం వెతకడానికి ప్రయత్నిస్తున్నాయి.

ముందు ఈ శవాన్ని వదిలించుకోవాలి. అప్పటికిగాని తను స్పష్టంగా ఆలోచించడానికి వీలుండదు.

మెల్లిగా లేచి రెయిన్‌కోటు తొడుక్కున్నాడు. బయటింకా వర్షం ఆగకుండా కురుస్తోనేవుంది. క్రిందపడిన టార్చిలైటు చేతిలోకి తీసుకొని వెలిగించాడు. వెలగలేదు. తన చేతిలోనుండి క్రిందపడినప్పుడు బహుశా బల్బు పగిలిపోయి వుండాలి.

మెల్లిగా రాఘవన్ శవందగ్గరకు వెళ్ళాడు. సన్నగా కుళ్ళువాసన వస్తోంది. శవం రెండు కాళ్ళు పట్టుకొని ఈడ్చుకొంటూ బయటికి నడిచాడు. ప్రాణంలేకపోయినా చాలా బరువుగా వుంది.

అలాగే ఈడ్చుకెళ్ళి తను తీసిన గోతిలో పారేశాడు. షొవెల్‌తో పూర్తిగా మట్టికప్పి కాళ్ళతో బాగా అణగిపోయేట్టు తొక్కాడు.

శ్రమవలన శరీరమంతా తూలుతున్నట్టుగా వుంది. గాలి విసురువలన అసలు నిలబడలేకపోతున్నాడు. గుహదగ్గరికి చేరేప్పటికి కాళ్ళలో సత్తువలేకుండా పోయినట్లనిపించింది. నీరసంగా కూలబడ్డాడు.

వాటర్ బాటిల్లో కొద్దిగా నీళ్ళు మిగిలివున్నాయి.

కాల్చుకు తీసి వాటిని గడగడా త్రాగేశాడు. చల్లని నీరు లోపలకు వెళ్ళగానే ప్రాణం కాస్త తేరుకొన్నట్లనిపించింది. జేబులోనుంచి సగం కాలి ఆరిపోయిన సిగరెట్ కనిపిస్తోంది. దాన్ని తీసి ఆప్యాయంగా వెలిగించాడు. పొగ లోపలకు వెళ్ళగానే గొప్ప రిలీఫ్‌గా తోచింది.

జేబులోనుండి డైరీతీసి అప్పటివరకూ జరిగిన విషయాలన్నీ వివరంగా వ్రాశాడు. రాఘవన్ విషయం రాస్తోంటే చెయ్యి ఆపుకోలేనంతగా వణికిపోయింది.

ఏ చప్పుడైనా మళ్ళీ రాఘవన్ శవం కదిలివస్తుందేమోనన్న భయం వేస్తోంది. పిస్తోలు తీసి ప్రక్కనే సిద్ధంగా పెట్టుకొన్నాడు. ఆపుకోలేనంత నిద్రవస్తోంది నీరసం వలన. క్రమక్రమంగా చీకటి పడుతోంది. ఇంకా ఎన్ని రోజులీ గుహలో ఇలా ఒంటరిగా ఆకలితో, భయంతో గడపాలో అర్థం కావడంలేదు.

గుహలో అటునుండి ఇటు ఎవరో చటుక్కున నడిచినట్లనిపించింది. పిస్తోలు చుట్టూ షేర్‌సింగ్ చేతివేళ్లు బిగుసుకొన్నాయి. ఎవ్వరూ లేరు. మళ్ళీ అంతా నిశ్శబ్దంగా వుంది. కనురెప్పలు మూతలు పడుతున్నాయి. లేదు... నిద్రపోగూడదు తను. బలవంతంమీద కళ్లు తెరుచుకొని గుహాద్వారంవైపే చూస్తూ కూర్చున్నాడు.

గాలి చేస్తున్న రొద, వర్షం కురుస్తున్న చప్పుడు, ఆకలి, నీరసం, గుండెల్లో బెదురు, పిస్తోలుచుట్టూ చేతివేళ్లు. తనకి తెలియకుండానే నిద్రపట్టేసింది షేర్‌సింగ్‌కు.

చటుక్కున మెలకువ వచ్చింది. బయటగాలి తగ్గినా వర్షంమాత్రం అలాగే కురుస్తోంది. తెల్లవారినట్లుంది. బయట వెలుతురు కనిస్తోంది. కళ్లు తెరచి చూశాడు షేర్‌సింగ్.

ఎదురుగా గోడకానుకొని రాఘవన్ శవం తనవంకే

కళ్ళార్పకుండా చూస్తోంది, కదలకుండా, చలనం లేకుండా. తెల్లని గుడ్లతో సూటిగా తనవంకే చూస్తోంది.

ఒక్క క్షణం గుండె కొట్టుకోవడం మానేసింది. మనసులో ఏ ఆలోచనా లేదు. మళ్ళీ వచ్చింది. మైగాడ్ రాఘవన్ మళ్ళీ సమాధిలోనుండి లేచి వచ్చాడు. షేర్ సింగ్ చేతులు పిస్తోలుచుట్టూ బిగుసుకొన్నాయి.

మెల్లిగా చేతిని పైకెత్తి, తనవంకే రెప్పఆర్పకుండా చూస్తోన్న ఆ రెండు కళ్ళమధ్య గురిపెట్టాడు. చెయ్యి వణుకుతోంది. పిస్తోలు గురి కుదరడంలేదు. ఒక్క క్షణం ఊపిరిపీల్చి, బిగపట్టి ట్రిగ్గర్ నొక్కాడు.

## 7

"ఫెంటాస్టిక్! అన్‌బిలీవబుల్!" అన్నాను కెప్టెన్ సింగ్ డైరీలో వ్రాసింది చదివి ముగిస్తూ.

మేజర్ కపాడియా ఒక్క క్షణం అడ్డంగా తల వూపాడు. "ఎ రేర్ థింగ్! ఇలాంటి కేసులు సామాన్యంగా జరగవు. సైక్రియాటిస్టులకు మంచి ఎక్జాంపుల్" అన్నాడు.

"డాక్టర్ వాట్ డు యూ మీన్! ఇలాంటివి జరగడానికి అవకాశం వుంటుందంటారా?" అన్నాను ఆశ్చర్యంగా.

మేజర్ కపాడియా జేబులోనుండి సిగరెట్లు తీసి నాకోటి ఆఫర్ చేసి, వెలిగించాడు. ఒక్క దమ్ములాగి అవునన్నట్లు మెల్లిగా తలాడించాడు.

"యస్! ఇలాంటిదిజరగడం సంభవమేననుకొంటాను."

"డాక్టర్! మీరు దయ్యాలున్నాయని ఒప్పుకొంటున్నారన్న మాట!"

కపాడియా నావంక చిత్రంగా చూశాడు. "ఇందులో దయ్యాల ప్రసక్తి ఏముంది?"

"మరింకేమిటి? దయ్యాల ప్రసక్తిలేకుండా పూడ్చి

పెట్టిన శవాలు గోతిలోంచి లేచి ఎలా నడిచివస్తాయి? దీనికి సైంటిఫిక్ రీజన్ చూపించగలరా?"

కపాడియా చిన్నగా నవ్వాడు. "చూపించగలననుకొంటాను" అన్నాడు మెల్లగా సిగరెట్ పొగ వదుల్తూ.

నేను మేజర్ కపాడియావంక నమ్మలేనట్లు చూశాను.

"మెంటల్ బ్రేక్‌డౌన్ డ్యూటు సైకిక్ డిసాలేషన్" అన్నాడు మేజర్ కపాడియా మళ్ళీ.

అర్థంకాలేదు నాకు. "విపులంగా చెప్పండి" అన్నాను.

తలవూపాడు కపాడియా చెపుతున్నట్లు.

"మానసిక శాస్త్రవేత్తలకు చాలా అరుదుగా స్టడీ చెయ్యడానికి కనిపించే కేసు ఇది. మనిషి మానసికంగా ఒంటరితనం అనుభవించినపుడు, ఆ భావంవలన ఓ చిత్రమైన మానసిక రుగ్మతకు గురౌతాడు. దాన్నే మెంటల్ బ్రేక్‌డౌన్ డ్యూటు సైకిక్ డిసాలేషన్ అంటారు.

మనిషి ఈ చిత్రమైన మానసిక వ్యాధి ప్రభావానికి లోనైనప్పుడు తన ఒంటరితనం పోగొట్టుకోవడంకోసం చాలా ఆశ్చర్యకరమైన పనులు చేస్తుంటాడు. ఒంటరితనంతో పాటు విపరీతమైన భయం, ఆందోళన, గ్లాని, మననును ఈ స్థితికి తేవడానికి దోహదపడతాయి.

ఈ రకమైన మానసిక స్థితిలోవున్న వ్యక్తి ఒంటరితనం నుండి విముక్తి పొందడానికి చేసే ప్రయత్నాలు సబ్‌కాన్షస్ స్థితిలో, అంటే బాహ్యంగా తను గుర్తుపెట్టుకోలేని స్థితిలో చేస్తుంటాడు.

కెప్టెన్ సింగ్ విషయంలోనూ అదే జరిగింది. మూడు రోజులపాటు ఈ కొండచరియల్లో బయట ప్రపంచంతో సంబంధంలేకుండా, ప్రాణభయంతో, ఆకలితో, నిస్సత్తువ, గుండె బెదురువలన అతనీ చిత్రమైన మానసిక వ్యాధికి గురైయ్యాడు.

మెలకువ స్థితిలో వున్నప్పుడు అతనిలో వివేకం, తార్కిక జ్ఞానం బాగానే పనిచేసేవి కాని నిద్రపోయిన స్థితిలో అతని వ్యాధి తీవ్రత వలన విపరీతంగా తనకు తెలియకుండా ప్రవర్తించేవాడు. తను బాధపడే ఒంటరితనం నుండి తప్పించుకోవడానికి నిద్రలో అతని మనస్సు పరితపించేది. అప్పుడతను నిద్రలోనే లేచివెళ్ళి తను పాతిపెట్టిన తన సహచరుడు రాఘవన్‌ని తనకు తోడుగా తెచ్చి ప్రక్కన పెట్టుకొనేవాడు. మెలకువ వచ్చిన తరువాత తను నిద్రలో చేసిన పనులు అతనికి గుర్తుండేవి కావు. అంచేత రాఘవన్ దయ్యమై తిరిగి సమాధిలోంచి వచ్చాడని భయపడ్డాడు.

ఇలా రెండుసార్లు జరిగేప్పటికి అతని మానసిక స్థితి పూర్తిగా దిగజారిపోయి వుండాలి. ఆ డెప్రెషన్‌లో, ఆందోళననుండి, భయంనుండి, దయ్యాలనుండి తప్పించుకోవాలనే పిచ్చి ప్రయత్నంలో రాఘవన్ శవాన్ని కాల్చి, తను కాల్చుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు.

నేను సైకియాట్రిస్టును కాను. కాని మానసిక శాస్త్రంతో నాకున్న పరిచయాన్ని బట్టి జరిగిన విషయాన్ని ఈ రకంగా అర్థంచేసుకోగలిగాను. బహుశా క్వాలిఫైడ్ సైకియాట్రిస్ట్ ఎవరైనా ఇంతకన్నా వివరంగా మీకు చెప్పగలరనుకొంటాను. ఈ సంఘటనకు ఇంతకన్నా వివేకమైన, తర్కవిహితమైన కారణం నాకు కనిపించడం లేదు'' అన్నాడు మేజర్ కపాడియా సిగరెట్ ఆర్పేస్తూ.

నేను కెప్టెన్ సింగ్ వంకా, రాఘవన్ వంకా టార్చి వెలుగులో ఓసారి మార్చి మార్చి చూశాను. శవాలు నడవడం గురించి నేనెప్పుడూ విన్లేదు. బహుశా మేజర్ కపాడియా చెప్పిందే నిజమై వుండాలి.

—: ఐపోయింది :—




# నాలుగవ భాగము

"వాళ్ళ గుండు తగిలినట్లుంది. నీ దగ్గరకు వెళ్ళవస్తా నని వెనక్కి తిరిగాడో, లేదో, బోటులోంచి వచ్చిన గుండు తగిలింది" అన్నాను.

రెండో డెవిల్‌కు నా మాటలు నమ్మకం కలిగించ నట్లుంది. అతను నావైపు అనుమానంగా చూశాడు.

శవం వెల్లకింతలా పడుంది. కాలితో దాన్ని త్రిప్పాడు. కూర్చుని టార్చిలైటు వెలిగించాడు వీపున తగిలింది గుండు.

హెలికాప్టర్ బయలుదేరి సముద్రం పైకి వచ్చింది. ఎక్సయిజ్ వాళ్ళ బోట్‌లోంచి లౌడ్ స్పీకరులోంచి ఏవో మాటలు వినరాసాగాయి.

చేతిగుడ్డతో రక్తం తుడిచాడు గాయం దగ్గర. టార్చి వెలిగించి చూశాడు. డెల్లా నా దగ్గిరున్న తన రివాల్వరు మెల్లగా లాక్కొని దూరంగా వెళ్ళి కూర్చుంది.

"మిస్టర్ రాజ్! ఇది ఎక్సయిజ్ వాళ్ళ కాల్పులతో

జరిగిన ఘోరంకాదు!" అన్నాడతను.

"అంటే!"

"ఆ గుండు చేసిన గాయం చూశావా? చాలా చిన్నది. వాళ్ళు మెషిన్‌గన్స్‌తో కాలుస్తున్నారు. ఆ గుండు తగిలితే యింకా పెద్ద గాయం కావాలి. అంటే అతన్ని నువ్వే చంపివుండాలి. అవునా?" అడిగాడు. అతని కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. గన్ పైకెత్తి నావు గురిచూసి పెట్టాడు.

"నా దగ్గర రివాల్వరు మాటటుంచి, కనీసం చిన్న కత్తిగూడా లేదు. అయినా అతన్ని చంపితే నాకేముస్తుంది" అన్నాను నేను.

"మిస్ డెల్లా! కమ్‌హియర్!" పిలిచాడు డెవిల్.

డెల్లా లేచివచ్చింది.

"అతని పాంటు, చొక్కా వెతుకు!" అన్నాడు అధికారికంగా.

డెల్లా వెతికింది. "ఏమీ లేవు. సిగరెట్లు తప్ప!" అంది.

అయినా అతనికి నమ్మకం కలిగినట్లు లేకపోవడంతో "మిస్టర్ రాజ్! చేతులు పైకెత్తు!" అన్నాడు.

నేను అతను చెప్పినట్లే చేశాను.

"డెల్లా! గుండీలువిప్పి అతని పాంటు, చొక్కా తీసి నాకివ్వు" అన్నాడు.

డెల్లా మెల్లగా నా దగ్గరకొచ్చి నిలబడింది. ముందు చొక్కా విప్పింది. తీసి ఉండగచుట్టి డెవిల్ వేపు విసరింది.

లౌడ్ స్పీకర్‌లోంచి మాటలు స్పష్టంగా వినిపించాయి. ఎక్సైయిజ్ అధికారులు, అనవసరమైన పోరాటం ఆపివేసి మర్యాదగా లొంగిపొమ్మని, లేకుంటే బోట్‌ను పేల్చుతామనీ హెచ్చరించారు.

పాంటు బొత్తాము లూడదీసి రెండు చేతుల్తో నడుం

దగ్గర్నుంచి క్రిందకు లాగింది. కాలొక్కొక్కటే ఎత్తి ప్రక్కకు పెట్టాను. పాంటు వూడిపోయింది. దాన్నిగూడా చుట్టి అతనికి అందించింది.

హెలికాప్టర్ పైన సర్కిలింగ్ మొదలెట్టింది.

నాకు ప్రాణాలపైన ఆశ చచ్చిపోయింది. పోలీసుల ఆధీనంలో ఖైదీగా వుండడం ఇష్టంలేక తప్పించుకొచ్చినందుకు ఇప్పుడు వింత హంతకులమధ్య ఖైదీగా చిక్కిపోవడం తలచుకుంటే విచారం కలిగింది.

ఇలాంటి పరిస్థితులు ఎదురవుతాయని నేను ఊహించనే లేదు.

"అతని బనీను, డ్రాయరు తీసెయ్!" అన్నాడతను కోపంగా.

డెల్లా సిగ్గుపడుతూ నిలుచుంది.

"నేను చెప్పినట్లు చెయ్యకుంటే కాల్చి చంపుతాను" అన్నాడతను బిగ్గరగా.

డెల్లా ఉలిక్కిపడింది. ఒక్క వుదుటున నా బనీను తీసింది. డ్రాయరు లాగింది. నన్ను నగ్నంగా నిలబెట్టాడు డెవిల్.

డెల్లా తలవంచుకొంది. కానీ ఓరకంటితో నా శరీరం కేసి చూడసాగింది! నాకు ఒళ్ళంతా ముళ్లు గ్రుచ్చుకుంటున్నట్లుగా వుంది. ఆడవాళ్ళ ముందు నగ్నంగా నిలబడటం ఎంత బాధాకరమో అర్థంకాసాగింది.

"ఇప్పుడైనా నా దగ్గర ఆయుధాలు లేవని నమ్ముతావా?" అడిగాను.

"ఆఁ!" అంటూ తుపాకీ డెల్లావేపు త్రిప్పాడు.

"మిస్ డెల్లా! నౌ యువర్ టర్న్. చేతులు పైకెత్తు!" అన్నాడు.

డెల్లా అలాగే చేసింది.

"మిస్టర్ రాజ్! స్ట్రిప్ హార్!" అన్నాడు.

నా గుండెల్లో బండపడింది. ఆమె బట్టలు విప్పడం నాకు సిగ్గుగా వుండటం అటుంచి, నా దగ్గరున్న రివాల్వరు ఆమె తీసుకుంది. ఇప్పుడా బట్టలు విప్పితే అదికాస్త బయటపడుతుంది. దాంతో మా రహస్యం తెలిసిపోతుంది. ఆ తర్వాత జరిగేది అతని చేతిలో చిక్కడం.

"సారీ! ఆమె స్త్రీ. ఇలా ఆమెను అనుమానించడం అన్యాయం!" అన్నాను నేను.

"మనం దొంగలం! స్మగిలింగ్ మన వ్యాపారం! ఆడా మగా తేడాగానీ, మంచి చెడ్డల మీమాంసగానీ మన కుండకూడదు. నేను చెప్పినట్లు చేస్తే సరే! లేకుంటే అనవసరంగా ఆమె ప్రాణాలు పోగొట్టిన వాడివవు తావు" అన్నాడు అతను కోపంగా.

నా కేటూ పాలుపోలేదు.

"మనం నిరపరాధులం! అతని అనుమానం తీర్చుకో నివ్వండి" అంది డెల్లా ధైర్యంగా. ఆమెకంత ధైర్యం ఎలా వచ్చిందో నా కర్థంకాలేదు.

"క్విక్!" అరచాడు మళ్ళీ.

హాట్ పాంట్సు విప్పాను. తొడలకు ఘట్టిగా అతుక్కుపోవడంతో చేతులు లోపలపెట్టి బలవంతంగా క్రిందకులాగాను. లావుపాటి ఎర్రటి తొడలకు నా చేతులు తగలగానే ఆమె కదలింది. నిట్టెడ్ బనియన్ విప్పాను. బ్రాసరీ, అండర్ వేర్ మాత్రం మిగిలాయి.

"అవికూడా తీసెయ్!" అన్నాడు.

రొమ్ములమధ్య వున్న లోయలో, బ్రాసరీలోపల ఆమె అంతకుముందా రివాల్వరు దాచుకుంది. అదింకా అక్కడే వుందని నా నమ్మకం. చేత్తో తడిమాను. తగల్లేదు.

"ఇక్కడేమీ లేదు!" అన్నాను నేను.

"ఆ ఎత్తుగా వున్నదేమిటి?" అడిగాడు డెవిల్.

నాకు ఒళ్లుమండింది. ఆడదానికక్కడ ఎత్తుగా ఏముంటుందో తెలియనట్లుగా అతనడగడం నాకు కోపం తెప్పించింది. ఆమెను సెర్చ్ చెయ్యాలనుకుంటున్నాడో లేక నగ్నంగా వున్నప్పుడు ఎంత అందంగా వుంటుందో చూడాలనుకుంటున్నాడో నాకు అంతుబట్టలేదు.

అంతలో నే భూమి బ్రద్దలయినట్లు పెద్ద శబ్దమైంది.

నా చెవులు గింగుర్లెత్తాయి. బోటు తల్లక్రిందులైనట్లు ఊగింది. నేను పడిపోయాను. నా వెంట డెల్లాకూడా పడిపోయింది. డెవిల్ ఏమయినాడో చూడలేదు.

అంత పెద్ద ఊపు ఎందుకొచ్చిందో అర్థంగాలేదు.

"ఏమయింది?" అడిగింది డెల్లా.

"తెలీలేదు!" అన్నాను.

"ఆ శబ్దం విన్నావా? ఎవరు బాంబ్ వేసినట్లున్నారు?" అంది డెల్లా.

నాక్కూడా అలాగే అనిపించింది. షిప్‌లోనుంచి బయలుదేరిన హెలికాప్టర్ బాంబ్ వేసివుంటుంది. కానీ అది మా బోటుపైన పడలేదు. చాలా దూరంగా పడింది. ఎక్సైయిజ్ వాళ్ళు మైక్‌లో అనౌన్స్ చేస్తుండటం విని వుంటారు, హెలికాప్టర్‌లోనివాళ్ళు. ముందా బోటుఅంతు చూచి తర్వాత మా మీదకు రావాలని నిశ్చయించుకుంటారు. అందుకే ముందా బోట్‌ని బాంబ్ వేసి వుండా లనిపించింది.

నా అనుమానం డెల్లాకు చెప్పాను.

ఆమెకూడా నా అభిప్రాయంతో ఏకీభవించింది.

మేమిద్దరంలేచి గబగబా బట్టలు వేసుకున్నాము.

డెవిల్ కూడా లేచాడు. అతనితల దేనికో కొట్టుకున్నట్లుంది. రక్తం కారుతోంది. జేబురుమాలుతో తుడుచు

కుంటున్నాడు. నన్ను చూడగానే "వాళ్ళ బోట్ ముక్కలయిపోయింది" అన్నాడు.

"ఎవరి బోటు?" అడిగాను.

"మనల్ని పట్టుకుందామని వచ్చిన ఎక్సయిజ్ వాళ్ళది!"

"అంతమాత్రాన మనకు ప్రమాదం తీరిపోలేదు. ఆ హెలికాప్టర్ తిరుగుతూనేవుంది. ఈ మారు మనపైన వేస్తారు బాంబు" అన్నాను.

"వెయ్యరు?" దృఢంగా చెప్పాడతను కర్చీఫ్ సముద్రంలోకి విసిరేస్తూ.

"ఎందుకని?"

"వాళ్ళమనిషి డెల్లా మనదగ్గర వుంది. ఛస్తే ఆమెకు ఆపద తెచ్చిపెట్టరు."

"భగవంతుడిపైన భారంవేసి, కూర్చోవడం మినహా మనం చేసేదేమీ లేదు. అయినా మీరిద్దరూ రాక్షసుల్లా వాళ్ళను చంపారు."

"జరిగిందాని గురించి ఆలోచించడం, చింతపడటం పిరికివాళ్లు చేసేపని. జరగవలసినదాన్ని జయప్రదంగా జరిపించేందుకు మార్గాలు చూచుకోవడం మా పద్ధతి. నువ్వు ధైర్యంగా వుండు. డెల్లాను కనిపెట్టి వుండు. మనల్ని మరిపించి ఆమె సముద్రంలోకి దూకి తప్పించుకోకుండా చూడాలి. ఆమె మనతో వున్నంతసేపూ మన ప్రాణాలు గట్టిగానే వుంటాయి" అన్నాడు డెవిల్ అక్కడ్నించి కదిలి వెళ్తూ.

విస్కీకేస్ ప్రక్కకు నెట్టి, దాని క్రిందున్న రివాల్వర్ తీసి నా కందించింది.

అందుకుంటూ ఆమె సమయస్ఫూర్తికి మెచ్చుకున్నాను.

హెలికాప్టర్ ఈమారు క్రిందికల్లా వచ్చింది. లైట్ మా ముఖంపైన పడింది. డెవిల్ మిషిన్‌గన్‌తో ప్రొఫెలర్ పైకి పేల్చాడు.

"ఆ షాటు మిస్సయింది. లేకుంటే హెలికాప్టర్ కూలిపోయేది" అంది డెల్లా.

"వాడు క్రెచురస్ ఫెలో! నాకు ఆకస్మికంగా తగిలారిద్దరూ!" అన్నాను.

"వీడ్ని కూడా ముగిస్తే, మనబోటుకు హెలికాప్టర్‌తో ప్రమాదం లేకుండా చూసుకోవచ్చు" అంది డెల్లా.

"ప్రయత్నిస్తాను" అన్నాను అక్కడ్నుంచి కదిలి డెవిల్ వైపు వెళ్తూ.

"నా షాట్ నేరోగా మిస్సయింది. లేకుంటే హెలికాప్టరు కూలిపోవలసింది" అన్నాడు.

"చూశాను" అన్నాను.

"ఇంకో గన్ వుంటే బాగుండేది."

"ఎందుకు?"

"ఇద్దరం కాలిస్తే ఖచ్చితంగా కూలిపోయేది."

"నేనంత ఎక్స్‌పర్ట్‌ను కాదు!"

మళ్ళీ ఆకాశంలోకి గురిపెట్టాడు గన్. తల పైకెత్తాడు. హెలికాప్టర్ సర్కిల్‌లా తిరుగుతోంది బోటు చుట్టూ.

నేను మెల్లగా జేబులో చెయ్యిపెట్టి రివాల్వరు తీశాను.

అతను హెలికాప్టర్ తిరిగినవేపే తల త్రిప్పుతూ గన్ పొజిషన్ మారుస్తున్నాడు.

ఇంతకన్నా మంచి అవకాశం రాదనిపించింది.

రివాల్వరు మెల్లగా పైకెత్తి అతని గుండెలకు గురిపెట్టాను.

నా రివాల్వరు ట్రిగ్గర్ నొక్కాను.

అతని తుపాకీ ఆకాశంలోకి పేలింది. కెవ్వున అరుస్తూ అతను ప్రక్కకు పడిపోయాడు.

నా కళ్ళు బైర్లు కమ్మిస్తూ, పెద్ద వెలుగుతో బాంబు బోట్ పైన నాకు పదడుగుల దూరంలో పడింది. మా బోట్ ముక్కచెక్కలై ఆకాశంలోకి ఎగిరాయి.

నాకు తరువాత ఏంజరిగింది తెలీలేదు.

*　　　*　　　*

చటుక్కున మెలకువ వచ్చింది. కళ్లు తెరచి చూశాను.

బోటు తాలూకా పెద్ద చెక్కపైన వున్నాను నేను. ఒళ్ళంతా నొప్పులుగా వుంది. మెల్లగా లేచి కూర్చున్నాను. చుట్టు చూశాను.

కొంచెం దూరంలో నీళ్ళలో తేలుతూవున్న రబ్బరు ట్యూబ్, దానిమధ్య చలనం లేకుండా డెల్లా కనుపించింది.

చుట్టు దృష్టి సారించాను. కనుచూపుమేర ఎక్కడ చూసినా అనంతమైన నీటితెర తప్ప మరేమీ కనుపించ లేదు. నీళ్ళన్నీ ప్రశాంతంగా వున్నాయి. అంటే మేము తీరానికి ఎటువైపు ఎక్కడ వున్నామో తెలియలేదు.

నేను తెచ్చుకున్న కేన్డ్ ఫుడ్, విస్కీసీసాలు, మిగిలిన వస్తువులు మొత్తం సముద్రం పాలయ్యాయి. జేబు తడుముకున్నాను. సిగరెట్ పాకెట్ వుంది. వెలుపలకు లాగి తెరచి చూశాను. అందులో ఏడు సిగరెట్లున్నాయి. కాని అవి తడిసి పనికిరాకుండా వున్నాయి.

మెల్లగా చేతులతో నీళ్ళలో తెడ్లువేస్తున్నట్లు కదుపుతూ, డెల్లా మత్తుగా పడివున్న లైఫ్ ట్యూబ్ వైపు ప్రయాణించాను.

తెడ్లువేసి పడవలు నడపడం నాకెప్పుడూ అలవాటు లేదు. అందువల్ల నేను ఎక్కివున్న బోటుతాలూకు

చెక్కను, డెల్లావైపు తీసుకెళ్ళడం బ్రహ్మప్రళయమైంది.

అరగంటపైగా తంటాలు పడ్డాక ఆమె దగ్గరకు చేరు కున్నాను. ఎడంచేత్తో ట్యూబ్‌ను గట్టిగా పట్టుకుని నా వైపుకులాగి పట్టుకున్నాను. ఆ ప్రయత్నంలో నేను కొంచెం ముందుకు జరగాల్సివచ్చింది. బరువు ఒకప్రక్కకు జరగడంతో వెనుక వైపునున్న చెక్కభాగం పైకిలేచి నేను జర్రున నీళ్ళలోకి జారిపోయాను.

అది గ్రహించి రెండోచేత్తో కూడా ట్యూబ్‌ను పట్టు కున్నాను. తలమాత్రం ట్యూబ్ పైనుంది. శరీరం నడు ములపైదాకా నీళ్ళల్లో వుంది.

చెక్క దూరంగా వెళ్ళిపోయింది.

డెల్లా అప్పటికీ కళ్ళు తెరవలేదు. ఆమె ప్రాణాలతో వున్నదీ లేనిదీ నా కర్థంగాలేదు. దమ్ముపట్టి, శరీరంలోని శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకుని, నడుం క్రిందిభాగాన్ని తేలిక చేసి పైకెగిరాను. దెబ్బతో ట్యూబ్ మీద కొచ్చాను.

ఒకవైపు కూర్చుని, కాళ్ళు రెండూ ట్యూబ్‌కు రెండు వైపులా పెట్టుకొన్నాను. నా కాళ్ళమధ్య డెల్లా వుంది.

దగ్గరగా చూశాను. ఆమె రొమ్ములు క్రిందకు, పైకీ ఊగుతున్నాయి. ఆమె శ్వాస పీల్చుకోవడం గమనించి ఆనందించాను.

ఇండియా చూడాలని వచ్చిన డెల్లా సముద్రంమధ్య, చావుబ్రతుకుల నడుమ, అచేతనంగా పడివుండటం తలచు కుంటే నాకు మనస్సు కలుక్కుమంది. ఆమెకే ఆపదా రాకుండా కాపాడమని భగవంతుడ్ని ప్రార్థించాను.

"డెల్లా! డెల్లా!" పిలిచాను.

ఆమె పలకలేదు. నా పిలుపు ఆమెకు వినిపించినట్లు లేదు.

ముందుకు వంగి ఆమె చెవులో నోరుపెట్టి ఘట్టిగా

అరచాను. చలించలేదామె.

చెయ్యిపెట్టి సముద్రంలోంచి కొద్దిగా నీళ్ళు తీసుకొని మొహంపైన చల్లాను.

ఆమె చిన్ననోరు తెరచుకుంది. సన్నటి పెదాలను; నాలుకతో చప్పరించింది. ఉప్పగా తగిలిందేమో 'థూ' మంటూ ఉమ్మి వేసింది.

ఆమె కళ్ళు తెరచుకున్నాయి.

నాకు ఆనందం అంతులేకుండా కలిగింది.

"డెల్లా! ఎలాగుంది?" అడిగాను పైకి వంగి.

"మన బోట్ ఏమయింది?" అడిగింది డెల్లా.

"వాళ్ళు బాంబు వేశారు. అది కాస్తా మన బోట్ పైన పడింది. ముక్కలయిపోయింది గాబోలు. మనమిలా ప్రాణాలతో మిగిలాం" చెప్పాను.

నడుంపైకి లాక్కుని, కర్రకుని లేచి కూర్చుంది ట్యూబ్ పైన నా కెదురుగా. చుట్టూ చూసింది.

"మనం సముద్రం మధ్యలో చిక్కుకొన్నట్లున్నాం. తినేందుకేమయినా వుందా?"

"లేదు. నేను తెచ్చిన సామానంతా సముద్రంలో కలిసిపోయింది."

"ఇప్పుడేం చేద్దాం!" అంది డెల్లా విచారంగా.

"అదే అర్థంగావడంలేదు. తీరానికి మనమెంత దూరమున్నామో నాకు అర్థంగావడంలేదు. కనీసం నౌకలు ప్రయాణంచేసే మార్గంలో కూడా మనమున్నట్లులేదు. ఆహారంకూడా మనదగ్గర శూన్యం. ఇలా ఎంతసేపో ఈ నడిసముద్రంలో నిలబడి బ్రతకలేం. ఆకలితో చచ్చిపోతామన్న అనుమానంగా వుంది" నా మనస్సులో వున్న ఊహల్ని వెలుపలకు మాటల్లో చెప్పాను.

"చావడం ఎటూ తప్పదన్నప్పుడు, మనిషి బ్రతికేందుకు

చెయ్యవలసిన అన్ని ప్రయత్నాలు చెయ్యాలి. ఇలా ఊరకే కూర్చోవడంకన్నా మన నాలుగు చేతుల్నీ తెడ్లుగా చేసి ముందుకు జరుగుదాం. అదృష్టముంటే మనకేదైనా తీరం కనుపించటమో, లేక ఏదైనా షిప్ కనుపించటమో జరుగవచ్చు" అంది డెల్లా.

ఆమె మాటలు సమంజసంగానే తోచాయి.

ఇద్దరం సర్దుకుని కూర్చున్నాం ట్యూబ్ పైన. మెల్లగా చేతుల్తో నీళ్ళను వెనక్కు నెట్టసాగాం. ట్యూబ్ ముందుకు ప్రయాణం మొదలెట్టింది.

రెండు గంటలసేపు అలాగే ప్రయాణించాం.

నాకు చేతులు, భుజాలు నొప్పిపుట్టడం మొదలెట్టాయి. ఆ విషయం డెల్లాకు చెప్పాను.

డెల్లా నవ్వింది. అలవాటులేక అలా వుంటుందనీ, ఆ నొప్పిని లెఖచెయ్యకుండా తెడ్లు వేస్తుంటే కొంతసేపటికి ఆ నొప్పి మరచిపోవచ్చని సూచించింది.

ఓపిక లేకున్నా ఆడదానిముందు ఓడిపోవడం, చిక్కు మొహం పెట్టడం అనుమానంగా భావించి, నీళ్ళను చేతుల్తో వెనక్కు నెట్టసాగాను.

ఆకాశం వున్నట్టుండి నల్లబడిపోయింది. మేఘాలు ఎక్కడెక్కడనుంచో వచ్చి మా నెత్తిన మీటింగు పెట్టుకుని, మేము చేస్తున్న వ్యర్థ ప్రయత్నం గురించి చర్చించుకోవటం మొదలెట్టినట్లనిపించింది. మాకు సముద్రం కూడా కనుపించలేదు.

"మిస్టర్ రాజ్! ఇదేమిటీ విపరీతం! ఉన్నట్టుండి వాతావరణం ఇలా మారిపోయింది?" అడిగింది డెల్లా.

"మన ప్రాణాలు తీసేందుకు."

"వానవస్తే ఏం చేద్దాం?"

"చేసేందుకేముంది. తడుస్తూ కూర్చోవడమే" అన్నాను.

డెల్లా తలపైకెత్తి ఆకాశంకేసి చూసి "మంచి వాన వస్తుందనుకుంటాను. సముద్రంలో వాన కురవడం మొద లెడితే ఒకరాగాన ఆగదని ఏదో నవలలో చదివాను" అంది.

"మన ప్రాణాలు తీసి, శవాల్ని సముద్రంలోకి త్రోసి, ఆ తర్వాత ఆగుతుంది" అన్నాను నేను నిస్సహాయంగా.

ఆమె మాట్లాడలేదు. ఉరుములు హోరెత్తాయి. మెరుపులు ప్రారంభమయినాయి. వాన మొదలయింది.

ఏనుగ తొండాలంత లావుగా వున్నాయి చినుకులు. నెత్తిన పడుతుంటే మాడు చిట్లిపోయినట్లవుతుంది నాకు. డెల్లా రెండు చేతులు తలపైన పెట్టుకుంది.

చెవులు గింగుర్లు పెడ్తూ జుంయ్‌మని శబ్దమేదో దూరంగా వినవచ్చింది.

"ఏమిటా హోరు?" అడిగింది డెల్లా.

"గాలిలాగుంది" అన్నాను.

"అయితే మనకిక చావు తప్పదు. ఒకచేత్తో నన్ను ఘట్టిగా పట్టుకోండి. మరోచేత్తో ట్యూబ్‌ను పట్టుకొని కాళ్ళమధ్య ఘట్టిగా ఇరికించుకోండి. నేనూ అలాగే చేస్తాను. అదృష్టముంటే మనం ఏ తీరానికో కొట్టుకొని పోతాం. లేకుంటే ఇద్దరం యీ సముద్ర గర్భంలోనే కలిసిపోతాం!" అంటూనే నన్ను కౌగలించుకుంది డెల్లా.

నేనుకూడా ఆమెను అలాగే కౌగలించుకొని, కాళ్ళ మధ్య ట్యూబ్‌ను ఇరికించి పట్టాను.

గాలి వచ్చేసింది, సముద్రంలో పైన తేలుతున్నట్లున్న నీటిపొరను, తెరచాపలా పైకిలేపి విసరికొడుతూంది గాలి. అదిచేసే శబ్దానికి మా చెవులు గింకుర్లెత్తాయి.

మా ట్యూబ్ ఎగిరిపడసాగింది. ఒకొక్క ఊపుకూ గాలిలో లేచి నూరుగజాల అవతల మళ్ళీ తేలిపడుతూ

పోసాగింది. మేమిద్దరం అలాగే ఒకరినొకరం కరచి పట్టు కొని కాళ్ళతో ట్యూబ్‌ను బిగించిపెట్టాము. అలా ఎంత సేపు గడిపామో మాకే తెలియదు.

దూరంగా ఎండపొడలు కనుపించాయి. గాలి జోరు తగ్గింది. మా ప్రాణాలు రక్షించిన రబ్బరు ట్యూబ్ నీళ్ళ మీద నిలబడింది.

దూరంగా ఏదో ఎత్తైన కొండలాంటిదేదో కనుపించింది.

డెల్లాకు చూపించాను. డెల్లా ఆనందంతో కేరింతలు కొట్టింది.

"మనల్ని ఆ గాలి తీరం వేపు త్రోసుకొచ్చింది" అన్నాను.

"యస్. యస్. మనం కాస్త కష్టపడితే ఒడ్డున పడతాం" అంది డెల్లా.

"అది భారతదేశమేనా?" అనుమానంగా అన్నాను.

"ఏ దేశమైతేనేం. ఈ నీళ్ళల్లోంచి బయటపడితే చాలు" అంది డెల్లా.

మళ్ళీ నాలుగు చేతులకూ పని పెట్టాం. అరమైలు దూరం వెళ్ళాం. నాకు చేతులు నొప్పి ఎక్కువయింది.

తీరం మరికొంతదూరంలో వుందనగా రబ్బరు ట్యూబ్‌కు ఏమైందోగాని 'ఢాం'మని ప్రేలిపోయింది.

ట్యూబ్‌లోని గాలంతా వెళ్ళిపోయి, అది అప్పడంలా అణగిపోయింది. ఆ విసురుకు మేమిద్దరం సముద్రంలోకి మునిగిపోయాం. ఏంజరిగిందో అర్థమయింది.

చేతు లాడిస్తూ ఈదుకుంటూ ఆమెనుకూడా నీళ్ళ పైకి లాక్కొచ్చాను.

డెల్లా తనకు ఈదడం వచ్చని, నానుండి విడివడింది.

ఆమె ముందూ, నేను వెనుకా ఈదుకుంటూ ముందుకు

సాగిపోసాగాం.

అలలు దగ్గరవుతున్నాయి. వాటిన్ని చూసి డెల్లా ఆనందంతో యింకా జోరుగా ఈతకొట్టడం ప్రారంభించింది.

సముద్రతీరంలో ఫర్లాంగుదూరం మాత్రమే అలలు వుంటాయి. అంటే తీరానికి మేమింక ఫర్లాంగున్నాం. అది దాటితే భూమిపైన కాలుపెట్టగలం. లేని సత్తువ కాళ్ళల్లోకి తెచ్చుకున్నాను. ముందుకు పోసాగాను.

డెల్లా ఆడదైనా అతిలాఘవంగా ముందుకు ముందుకు మునిగిపోకుండా జరిగిపోతూ నేవుంది.

మరో అరగంట నానాతంటాలుపడి తీరం చేరుకున్నాం ఇద్దరం.

నీళ్ళ అంచునే ఇసుకలో వెల్లకిలా శవాల్లా పడి పోయాం.

అరగంటసేపు ఎండలో శరీరాల్ని ఎండబెట్టి వెచ్చ చేసుకున్నాం.

మెల్లగా లేచి నడక సాగించాం. ఇసుకలోనే అర మైలు నడిచాం.

పొదల్లాంటి చిన్నచిన్న చెట్లగుబుర్లు కనుపించాయి. అటువంటి వాట్ని అంతకుముందు నేనెక్కడా చూడ లేదు.

"ఇది ఇండియాకాదు!" అన్నాను నేను.

"ఎలా తెలుసు?"

"ఈ రకం చెట్లు నేను ఎప్పుడూ చూడలేదు. ఇదేదో దీవిలాగుంది. ఇక్కడి మనుషులెలాంటి వాళ్ళో ఏమిటో మనకెలా తెలుస్తుంది?" అడిగాను.

"డోన్ట్ వరీ! చావు తప్పదని తెలిసీ బ్రతికే ప్రయత్నం చేస్తున్నాం మనం. చావడం తప్పనిసరయితే చచ్చి పోదాం. దానిగురించి కంగారుపడకు!" అంది డెల్లా.

ఆమె గుండె నిబ్బరానికి ఆశ్చర్యపోయాను నేను.

ఆ గుబురు చెట్లలోంచి ముందుకు కొంతదూరం సాగిపోయాం.

మనుషులుగానీ, పశువులుగానీ కనుపించలేదు. ఏదైనా నిర్మానుష్యమైన దీవి గాబోలనిపించింది.

ఆకాశంలో పెద్ద చప్పుడు వినిపించింది.

ఇద్దరం ఒక్కసారే తలెత్తి పైకిచూశాను.

ఒక పెద్ద పక్షుల గుంపు అరుపులు పెడుతూ, రెక్కలూపుతూ అక్కడికక్కడే గిరగిర తిరగసాగింది. ఆ గుంపు దిగే స్థలం మాకు ఫర్లాంగు దూరంలో వుంది.

"సీ దట్ సీన్!" అంది డెల్లా.

తలూపాను నేను.

"అక్కడేదో జరిగింది. ఆ పక్షులు ఒకటి చావడమో, లేక మరేదైనా విచిత్రమైన విషయమో జరిగివుండాలి. అందుకే పక్షులలా గగ్గోలు పెడుతున్నాయి. మనం వెళ్ళి చూద్దాం!" అంది డెల్లా.

"ఓ. కే! వెళ్దాం పద!" అన్నాను.

ఇద్దరం ముందుకు నడచాం.

పక్షులింకా ఆకాశంలో అల్లరిచేస్తూనే వున్నాయి.

గుబురు చెట్లనడుమ రెండు పక్షులు పడివుండటం గమనించి వాటిని డెల్లాకు చూపించాను. ఇద్దరం వాటికి దగ్గరగా నడిచాం. డెల్లా వాటి దగ్గర కూర్చుని నిశితంగా చూడసాగింది. రెండు నిముషాలు పరిశీలనగా పరికించి "రాజ్! వండర్ ఫుల్! వండర్ ఫుల్!" అంది ఎగురుతూ.

"ఏమైంది?" అంటూ ఆమె దగ్గరగా వెళ్ళాను.

"ఈ బర్డ్స్‌ను ఎవరో కాల్చి చంపారు. రెండింటి రెక్కలగుండా రివాల్వరు గుండ్లు దూసుకు వెళ్ళాయి.

అవి దూసుకువెళ్ళిన చోట్ల నల్లగా కాలిపోయాయి ఆకులు. చూశావా?'' అడిగింది.

నేనుకూడా వంగి పరీక్షగా చూశాను. ఆమె చెప్పినట్లుగా రివాల్వరు గుండ్లుచేసిన చిన్న రంధ్రాలు కనుపించాయి.

''యూ ఆర్ కరెక్ట్!'' అన్నాను నేను.

''అంటే ఈ దీవిలో మనుషులున్నారన్నమాట. మనకు ఆహారం, సిగరెట్లు అదృష్టముంటే హాట్ డ్రింక్స్ అన్నీ దొరుకుతాయి. లెటజ్ గో!'' అంది డెల్లా.

ఇద్దరం అక్కడ్నుంచి చెట్లు దాటుకుంటూ నడవసాగాం. ఇళ్ళుగానీ, మరేవిధమైన మనుషులు నివసించే జాడలుగానీ, మాకు కనుపించనేలేదు.

నాకు ఆకలి విపరీతంగా ఉండటంతో నడవలేక కూలబడ్డాను. డెల్లాకూడా నా ప్రక్కనే చతికిలబడింది.

''ఈ చెట్లకు కాయలుకూడా లేవు పీక్కుతిందామంటే!'' అన్నాను కోపంగా.

''ఏం? ఆకలి ఎక్కువగా వుందా?'' అడిగింది డెల్లా.

''నాకు తొందరగా తినేందుకేమీ దొరకకపోతే నిన్ను తింటాను'' అన్నాను.

''ఆ చెట్లకు కాయలులేవు. కానీ కావలసినంత ఆకుంది. తింటే ఆకలి తీరుతుందిగా!'' అంటూ చేరువలో వున్న చెట్టునుంచి రెండు చేతులతో ఆకును తుంపడం మొదలెట్టింది.

''కొంపతీసి తింటావా?'' అడిగాను నేను.

డెల్లా మాట్లాడలేదు.

నేను గుడ్లప్పగించి ఆమెను గమనించసాగాను.

ఆకులు నోట్లో పెట్టుకుని కరకరమని ఆవులు పచ్చగడ్డి తిన్నట్లు ఆవురావురుమంటూ నమిలి మ్రింగసాగింది.

"ఎలావున్నాయి?" అడిగాను.

"చాలా బాగున్నాయి. ఆపసరు రక్తంలో కలుస్తుంటే క్రొత్తశక్తి పుట్టుకొస్తున్నట్లుంది. నువ్వూతిను" అంది డెల్లా కానిని ఆకులు నాకందిస్తూ.

నేనుకూడా నోట్లో పెట్టుకున్నాను. ఉప్పంగా వున్నాయి. నమిలాను. రసం దిగుతుంటే నోరంతా తిమ్మిరెక్కసాగింది. లెక్ఖచెయ్యకుండా నములుతూనే వున్నాను. కడుపులో రగిలిన ఆకలిమంటలు అణగిపోయేదాకా ఇద్దరం ఆ ఆకులు తిన్నాం.

ఆ తర్వాత అక్కడే పడుకున్నాం.

సముద్రంలో పడ్డబాధలు ఒకరికొకరం చెప్పుకుంటూ నవ్వుకుంటూ చాలాసేపు వుండిపోయాం.

"గంటెంతయి వుంటుంది?" అడిగింది డెల్లా.

నేను వాచీకేసి చూశాను. నీళ్ళలో తడిసి పని చెయ్యడం మానేసింది.

"తెలీదు!" అన్నాను.

"లేచి అలా వెళ్ళాం! ఎవరన్నా కన్పిస్తారేమో చూద్దాం!" అంది డెల్లా.

"అలాగే!" అంటూ లేచి గుడ్డలకు పట్టిన ఇసుకంతా దులుపుకున్నాను. డెల్లాగూడా అలాగే చేసింది.

ఇద్దరం మళ్ళీ నడక ప్రారంభించాం. కాళ్లు నొప్పి పుట్టేదాకా ఆ దీవిలో నడిచాం. దాదాపు రెండుగంటలు నడిచాక నా కళ్ళకు బార్బ్డ్ వైర్ ఫెన్స్ కనుపించింది. డెల్లాకు చూపించాను.

ఆ ఫెన్స్ కనుచూపుమేరదాకా వుంది.

"ఏమిటిది? ఎవరు వేశారు?" అడిగాను.

(సశేషం)

# మీరే ఎన్నుకోండి?

ఈ నెల "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు నవలలు ప్రచురించబడ్డాయి. ఈ నాలుగు నవలల పేర్లు మీకు నచ్చిన వరుసక్రమంలో ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితం పై వ్రాసి, దానితో 30 పైసల పోస్టలు స్టాంపులు జత పరచి, ఈ నెల 10 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

ఒకటవ నెంబరుపైన అధిక సంఖ్యాకులు వ్రాసిన నవలను ఉత్తమ నవలగా ఎన్నిక చేయటం జరుగుతుంది. ఉత్తమ నవలా రచయితకు రు. 116/- లు బహుమతి. నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో వ్రాసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/- లు బహుమతి.

ఈ బ్యాలెట్ లో ఎవరైనను పాల్గొనవచ్చును. ఒక్కొక్కరు ఒక్క కూపన్ మాత్రమే పంపాలి. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, యీ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20/- లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులుకానివారు తమ సభ్యత్వమును పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాస పత్రికలో ప్రచురించబడతాయి. —ఎడిటర్.

## 35

ముక్కోటి ఏకాదశినాడు శివాలయంలో భక్తులంతా చేరి మైక్ ముందు గొంతు చించుకుని భజన చేస్తున్నారు. ఆ వీధిలో వాళ్ళంతా భరించలేక దైవప్రార్థన మౌనంగా చేసుకోరాదా మీ గోలతో తల పగిలి పోతున్నదని గోల చేశారు.

కావాలని మరింత పెద్దగా భజనను మొదలు పెట్టారు వాళ్లు. ఒక గంట భజన అయింది. ఢన్‌మని దేముడు ప్రత్యక్షమయ్యాడు.

భక్తులంతా తమ భక్తికి మెచ్చి ప్రత్యక్షమయ్యాడని భగవంతుడిని స్తుతించడం మొదలెట్టారు.

''మీ గోలకు నా చెవులు పనిచెయ్యటం మానేశాయి. అంతగా గొంతుచించుకొని మైక్ పెట్టుకుని అరవకండి.'' అని చెప్పి, గబుక్కున మాయమయ్యాడు దేముడు.

* * *

''మీ ఆయన ఎందుకు అలా పిచ్చి పట్టినట్లు అదే పనిగా నవ్వుతున్నారు?''

''ఈ నెల 'చివరిపేజి వినోదానికి' జోకులు పంపితే తిరిగి వచ్చాయి. అప్పటినుంచి యిదీ వరుస.''

* * *

''ఏమిటి అలా విచారంగా కూర్చున్నావ్, నీ కథ ఏదయినా తిరిగివచ్చిందా?''

"తిరిగి రాలేదు, స్వీకరించామని వ్రాశారు."

"అయితే, మరి దిగులు దేనికి?"

"ఎన్నాళ్ళకి పడుతుందా అని....?"

— మిస్. కోహినూర్, గుంటూరు.

## 36

బషీర్ ట్రావెలింగ్ సేల్స్‌మన్. ఓరోజు హోటలు కెళ్ళాడు. వెయిటరును పిల్చి, "ఉడికి ఉడకని అన్నం, ఉప్పు తక్కువ చారు, కారం ఎక్కువ పచ్చడీ తీసుకురా," ఆర్డరిచ్చాడు.

వెయిటరు అవి తెచ్చిపెట్టి, "ఇంకా ఏం తేను సార్," అన్నాడు.

"థాంక్సు! ఇంకా ఏమీ వద్దు, అలా కుర్చొని ఊరికే నన్ను కేక లేస్తూండు. కాస్త ఇంటి గాలి పట్టుకుంది!!" చెప్పాడతను.

* * *

ఆనందరావు ఈ మధ్య 'లా' పాసై ప్రాక్టీసుపెట్టాడు. కేసులేమీ రాకున్నా, ఓ రోజు ముగ్గురు లేడీ స్టెనోలు కావాలని, పేపర్లో వేయించాడు.

అది తెలిసి అతని మిత్రుడు అడిగాడు—

"ముగ్గురు స్టెనోలు చేయగల పని నీ కేముందోయ్? ముగ్గు రెందుకు?"

ఆనందరావు నవ్వి చెప్పాడు "ఆడవాళ్ళని గూర్చి నీకు

తెలియని దేముంది? ప్రతి చిన్నపనికి, పర్సనల్ పనికి. శలవు డిమాండుచేస్తారు. వేళకు ఎవరో ఒకరు ఉంటారని.''

* * *

లాడ్జి బాయ్ పరిగెత్తుకొచ్చాడు మేనేజరు గదికి. మేనేజరు ప్రశ్నార్థకంగా చూశాడు బాయ్‌ని.

''ఆ రూం నెంబర్ 111లో ఉన్న పాసింజర్ కాఫీ చెప్పిన వేళకి ఇవ్వలేదని, నన్ను, మిమ్మల్ని, లాడ్జిని, బండగా తిడుతున్నాడు సార్!'' చెప్పాడు ఆవేశంగా.

మండు కొచ్చింది ఆ పాసింజరుమీద, మేనేజరుకు. ''అలాగా! వుండు. అక్కౌంట్సు చూసి అతన్ని రూం ఖాళీ చేయిద్దాం,'' అంటూ అక్కౌంట్సు చూశాడు.

దిగి రెండు వారాలయింది. అడ్వాన్సు రెండు వేలు, ఇంత వరకు ఖర్చు 14 వందలు. ఆ వివరాలు చూశాక మేనేజరు ఏమనుకున్నాడో ఏమో, ''వెధవ, టైంకు కాఫీ ఇవ్వక, పాసింజర్లకు కష్టం కలిగించిందే కాక, లాడ్జికి చెడ్డపేరు తెస్తావా? నిన్ను డిస్‌మిస్ చేస్తున్నాను,'' అంటూ అరిచాడు బాయ్ మీద.

—వజ్రాల రాజా, కడప.

## 37

క్లాసులో టీచర్, విద్యార్థితో—

టీచరు: ఒరేయ్ రామూ! వెనుక మారుగావచ్చి కొట్టే

వాళ్ళనేమంటా్రా!

రాము: (తక్కున) "పో.... లీ ... సో.... ళ్లు!!"

* * *

క్రొత్తగా పెళ్ళయిన దంపతులు 'వెన్నెల' చూస్తూ—

భర్త: సుశీ! ఈ పండు వెన్నెల చూస్తోంటె, నీకేమని పిస్తోంది?

భార్య: నేను ఒంటరిగానైనా సెకండుషో సినిమాచూసి వచ్చేయగల ననిపిస్తోందండి!

* * *

పరీక్ష హాలులో రాము ముందు లలిత కూర్చుని 'కాపీ' కొడుతూ వ్రాస్తోంది.

లెక్చరర్ వచ్చాడు దగ్గరకి. లలిత నవ్వుతూ, కన్ను కొట్టింది- అంతే! మంత్రముగ్ధుడిలా జారిపోయాడు లెక్చరర్ అక్కడ్నుంచి.

మరుసటిరోజు రాముకూడా కాపీకొట్టడం ప్రారంభించాడు. లలిత ఏంచేసిందో కళ్ళారా చూసేక కొండంత ధైర్యం వచ్చేసింది.

మాడమ్ దగ్గరకు వచ్చింది. రాముప్రక్కనే నుంచుంది. రాము నవ్వుతూ, కన్నుకొట్టాడు

మాడమ్ మండిపడుతూ, ప్రిన్సిపాల్‌కు రిపోర్టిచ్చి మర్నాడే రాముని డిబార్ చేయించింది.

—ఇమంది రామారావు, కాకినాడ.



